# చతుర

## ఈనెల సమగ్ర నవల

'ప్రేమ' గురించి గొప్పగా కలలు కన్నాడతను. ప్రేమించా లనీ, ప్రేమింపబడటం తప్ప ఈ జీవితంలో కోరుకోదగినది ఏదీ లేదనీ గాఢంగా నమ్మాడతను. అలాంటి వ్యక్తి జీవితంలో అడుగిడిన తొలి యువతి అనుకోని విధంగా ఈ లోకం నుండే నిష్క్రమించింది. రెండవ యువతి తనంత తానుగా అతని జీవితంలోకి ప్రవేశించి కూడా చివరి క్షణంలో క్షమించ మంటూ మాయమైపోయింది.

విరక్తి చెందిన అతను మరెవరి జోలికి పోకూడదనుకుంటూండగా తుఫానులా మరో యువతి తనంత తానుగా అతని హృదయ పీఠం మీదికి దూసుకు వచ్చి తిష్టవేసి సన్నిహితురాలైపోయింది.

మరయితే తాను కలలు గన్న క్షణం ఆసన్నమయిన దశలో ప్రేయసి ఒడిలో సేద దీర్చుకోవలసి ఉన్న అతను, ఒంటరిగా ఆస్పత్రిలో ఓ మూల ఎందుకు విశ్రాంతి తీసుకోవలసిన అగత్యం వచ్చింది? ప్రేమ జీవితంలో అడుగడుగునా అపజయాన్నెదుర్కొంటున్న అతను...

## పరాజితుడు

గానె మిగిలిపోయాడా? లేక నెగ్గుకు రాగలిగాడా? పర్యవసానం ఏమిటి? పయనం ఎటు?

వీరపల్లె వీణావాణి

రసవత్తరంగా చిత్రించిన మానవ జీవన తరంగాల్లోని సున్నిత ఘట్టాల మాల 'పరాజితుడు' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



జూన్ 1982

సంచిక: 5
సంపుటి: 5

ముఖచిత్రం : దిలీప్ బెనర్జీ

రెండవ కవరు : కె. రాజేంద్రప్రసాద్

మూడవ కవరు : బ్రహ్మదేవ్

నవల బొమ్మలు : జి. ఎ. రమణ

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

*ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.*




# ట్రాఫిక్ జోగేశ్

జోగేశ్వర్రావ్ మొదటినుండి కూడా బహుజాగ్రత్త మనిషి. ఏ పని చేసినా ఎంతో జాగ్రత్తగా ఎదుటివారు మెచ్చుకొనేలా చేసేవాడు. ముఖ్యంగా ఎక్కడికైనా వెళ్ళాలంటే ప్రయాణ సమయంలో తీసుకొనే జాగ్రత్తల్లో జోగేశ్వర్రావ్‌కి సాటి ఎవరూ రారు. అతనుండే వీధిలో ప్రతి ఒక్కరూ జోగేశ్వర్రావు ట్రాఫిక్ నిబంధనలను పాటించడం చూసి "ట్రాఫిక్ జోగేశ్" అని బిరుదు ఇచ్చారు. అలాఅలా జోగేశ్వర రావు కీర్తి వాళ్ళ వీధి నుండి వాళ్ళుండే టౌన్‌కంతా వ్యాపించింది. పైగా సైకిలు నుండి మోటారు కారు నడిపే స్థాయికి ఎదిగిన జోగేశ్వర్రావ్ అందరూ పొగడడం చూసి ఇంకా జాగ్రత్తగా కారు నడపడం మొదలు పెట్టాడు.

ఇంతలో టౌన్‌లో జరిగే ట్రాఫిక్ ఉత్సవాల సందర్భంగా జోగేశ్వరరావుని సన్మానించాలని ట్రాఫిక్ అధికారులు నిశ్చయించుకున్నారు. వెంటనే చిన్న సన్మానసభ ఏర్పాటుచేసి జోగేశ్వర్రావుని ఆహ్వానించారు. ఆహ్వానం అందుకున్న జోగేశ్వర్రావు చిరునవ్వులు చిందిస్తూ సగర్వంగా సభకి విచ్చేశాడు. సభలో హర్షధ్వానాల మధ్య ట్రాఫిక్ ఉన్నతాధికారి 40 ఏళ్లపాటు జాగ్రత్తగా కారు, ఇతరత్రా వాహనాలు నడిపినందుకు జోగేశ్వర్రావుకి ప్రత్యేకమైన అవార్డును అందజేశాడు.

సభానంతరం ఉత్సాహం ఉప్పొంగగా అవార్డు బహుమతిని కారులో పెట్టుకుని ఊహాలోకాల్లో తేలిపోతూ ఆనందంగా కారు స్టార్ట్ చేశాడు. ఇంకేముంది రయ్యిన బయల్దేరింది కారు. బహుమతిని భార్యకు చూపించి భార్య తనను మెచ్చుకుంటుంటే పొంగిపోతున్నట్లు ఊహించుకుంటున్న ట్రాఫిక్ జోగేశ్ ఉన్నట్లుండి సీటులో ఎగిరిపడి ముందుకి తూలి ముఖం స్టీరింగు చక్రానికి కొట్టుకుని తర్వాత ఎగిరి అద్దానికి గుద్దుకున్నాడు.

పావుగంట తర్వాత స్పృహలోకి వచ్చిన జోగేశ్వర్రావుకు ఎదురుగా అరడజను మంది ట్రాఫిక్ పోలీసులు, వారి








వెనుకగా లాకప్‌రూమ్ కటకటాలు కనిపించాయి.

"నే...న్నే...న్నెనెక్కడున్నాను?" అని దీర్ఘం తీయబోయిన జోగేశ్వరరావు ఆ ఆరుగురు పోలీసుల్ని చీల్చుకుని ముందుకు వచ్చిన పోలీసాఫీసర్ని చూసి ఓ క్షణం స్థబ్ధుడైపోయాడు- అంతక్రితమే తనకు బహుమతి అందించిన ట్రాఫిక్ అధికారి, పక్కనే కూర్చున్న ట్రాఫిక్ పోలీసాఫీసర్ జోగేశ్వరరావుకేసి చూస్తున్నారు.

—కమలా హరిబాబు

# అతనికంటే ఘనుడు

ఫుల్ లోడింగ్ పూర్తి చేసుకుని బార్ నుంచి బయటపడి ఎదురుగా ఉన్న 'సర్దార్ పాపారాయుడు' చిత్రంలో పాపారాయుడు గెటప్‌లో ఉన్న యన్. టి. రామారావు నిలువెత్తు కటవుట్‌ని చూస్తూనిలబడ్డారు ఇద్దరు మందురాయుళ్లు.

దాన్నో అయిదు నిమిషాలు పరీక్షగా చూసిన మొదటి మందురాయుడు "గురూ! నువెన్ని షెప్పినా షెప్పు. పాపారాయుడుగా నాగేషర్రావ్ గొప్పగా ఏషాడనుకో" అన్నాడు.

"షెమించాలి బ్రెదరూ ! నీ బుర్ర షరిగ్గా పని చేయటంలేదు. సర్‌డార్ పాపారాయుడులో పాపారాయుడుగా ఏషింది మహానుభావుడు యష్వీ రంగారావుగారు. అంతేగాని ఆర్. నాగేశ్వరరావు కాదు తెలిషిందా" అన్నాడు రెండవ మందురాయుడు.

దానితో మొదటి మందురాయుడికి కోపం వచ్చింది. "ఈ భూపెపంచకంలో ఎంత మందు కొట్టినా ష్టెడీగా వుండేవాడిని నేకొక్కడినే! ఎదురుగా అంత పెద్దబొమ్మ ష్పష్టంగా కనబడతావుంటే కళ్లుమూసుకుపోయేటంత తాగేషి నన్ను దబాయిష్టావేంటి? ముమ్మాటికి అది ఆర్. నాగేష్వర్రావే" అన్నాడు.

"షూడు బాబాయ్ ! ఈ షినిమాలు షూసి షూసి నా తల పండిపోయింది. గ్రూప్ డాన్సులు ఏషేవారిని సహితం నిద్రలో లేపి అడిగినా గుర్తు పట్టగలను. నన్ను మరీ అంత షేతగాని వాడికింద తీషెయ్యకు" అని అన్నాడు రెండో

# మహాబలుడు దారాసింగ్ అంటున్నారు:
# "బలంగా ఎదగండి, న్యూట్రముల్ మొనగాడవండి."

DARA SINGH

ప్రసిద్ధ మల్లయుద్ధ వీరుడు దారాసింగ్ అభిమానాన్ని న్యూట్రముల్ చూరగొందంటే ఆశ్చర్యం ఏముంది! అముల్ వారి న్యూట్రముల్‌లో శరీర ఆరోగ్యానికీ, బలానికీ కావలసిన ఎన్నో పోషక తత్వాలు పుష్కలంగా ఉన్నాయి - అతి శ్రేష్ఠమైన మాల్ట్, రుచికరమైన కోకో, మీగడ కట్టిన అముల్ పాలు, శక్తితో నిండిన ప్రోటీన్లు, విటమిన్లు, ఖనిజ పదార్థాలు. పైగా, న్యూట్రముల్ రుచి కూడా అద్వితీయం! ఇవన్నీ కూడా బోర్న్‌విటా, బూస్ట్, మాల్టోవాల కంటే ఎంతో తక్కువ ధరకే!




daCunha/GCM/43/TL/82

మార్కెట్ చేయువారు:



గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లి.
ఆనంద్ 388 001 గుజరాత్

మందురాయుడు.

"బామర్ది! నీకు గ్రూప్ డాన్షర్ల సంగతి తెలుషేమోగాని పెద్ద యాక్టర్ల గురించి ఏమీ తెలీదు. నేను ఆర్. నాగేశ్వ రావుని, యస్వీఆర్ని పెట్టి సినిమాలు కూడా తీశాను. వాళ్ళని గుర్తుపట్టలేనంత షవటని కాదు" అని అన్నాడు మొదటి మందురాయుడు.

ఇంతలో వారి గొడవచూసి అటు వెళుతున్న ఒక పెద్దమనిషి అక్కడ ఆగగా న్యాయం చెప్పమని అడిగారు ఆయన్ని. వారి వాదనలు, వారి అనుభవాలు విని పించి సర్దార్ పాపారాయుడి సినిమాలో పాపారాయుడిగా ఎవరు యాక్టు చేశారో తేల్చి చెప్పమన్నారు.

ఆ మధ్యవర్తి వారిద్దరివంక ఓ క్షణం జాలిగా చూశాడు. మరో క్షణం సేపు ఆకాశాన్ని పరికించి" చూడండి నాయనలారా? మందు కొట్టేషినవాళ్లు కామ్గా యింటికెళ్ళి పడుకోవాలిగానీ రోడ్డుమీద ఇలా తెలివితక్కువగా ప్రవ ర్తించకూడదు. మీ ఇద్దరికీ షినిమాల గురించి ఏమీ తెలియదని మీ మాటలబట్టి అనిపిస్తోంది. ఆర్. నాగేషర్రావుగారు, యష్వీ రంగారావుగారు షచ్చిపోయిన సంగతి మీకు తెలియదా? అయినా మీరు నాలాంటి పెద్దమనిషిని ఈ సంగతి అడగ డం మీ అదురుష్టం. యిద్దరూ జాగ్రత్తగా వినండి. సర్డార్ పాపారాయుడు షిని మాలో పాపారాయుడిగా ఏషింది నాగే శ్వరరావు కాదు, రంగారావూ కాదు. అదేసింది మహానటుడు షితూరు నాగ య్యగారు తెలిషిందా! తెలియనివి తెలియ నట్టుంటాలిగాని ఇలా తెలివితక్కువగా వాగకండి" అని తూలుకుంటూ వెళ్ళి పోయాడు.

"ఎంతైనా తెలివైనవారు తెలివైన వారే" అంటూ లెంపలేసుకుని వెనక్కి తిరిగారు ఆ ఇద్దరు మందురాయుళ్లు.

— వై. సాయిబాబా

# మహాత్యాగి

"మీరు ఈసారి ఎన్నికల్లో గెలిచినందుకు మిమ్మల్ని హృదయపూర్వకంగా అభి నందిస్తున్నాను. చాలా...చాలా...ఆనం దిస్తున్నాను. వెధవది ఈ గుండె బయటకు రాదుగానీ, లేకుంటే దాన్ని చీల్చి మీ గెలు పుని చూసి అది ఎంతఆనందపడిపోతోందో చూపించివుండేవాణ్ని" అన్నాడు ఓ రాజ కీయ చెంచా - గెలుపొందిన రాజకీయ నాయకుడితో.

"అసలు ఈ గెలవటం అనేది అంత తేలిగ్గా జరిగే పని అనుకున్నావా? ఎన్ని కల్లో గెలవటానికి ముందు లక్షల ప్రజల గుండెలను గెలుచుకోవలసి వుంటుంది. వాళ్ళ హృదయాల్లో ఓ సెక్రటేరియట్ నిర్మించవలసి వుంటుంది. వాళ్ళ కళ్ళల్లో బోలెడు కాల్వలు తవ్వించవలసివుంటుంది. వంతెనలు నిర్మించవలసివుంటుంది. ఇంకా వాళ్ళ గుండెలను గెలుచుకోవటానికి ఏమేమి చేయవలసి వుంటుందో నీకు తెలుసా?" రాజకీయనాయకుడు మైకులో ఉపన్యాసం దంచుతున్నట్టు అన్నాడు.

"అబ్బే నాకేం తెలుసు పరమ అజ్ఞానిని. మీ సేవకుణ్ని. ప్రభువులు తమరే సెల వియ్యండి" చెంచా మస్కా పూస్తూ అన్నాడు.

"అరే......ప్రజలు త్యాగాన్ని ఆశి స్తారు. త్యాగధనులనే తమకు నాయ కులుగా ఎన్నుకుంటారు. నేను చేసిన



త్యాగాలు చూసిచూసి ప్రజలు నన్ను 'మహాత్యాగి' అని సంబోధిస్తున్నారు" అన్నాడు రాజకీయనాయకుడు.

"ఆహా...ఓహో...మీరు నూటికి నూటపదిపాళ్ళు నిజాన్నే వక్కాణించారు. మీరు త్యజించినన్ని పార్టీలను త్యజించటము మరెవరికైనా సాధ్యపడుతుందా? ఆర్నెల్లకో పార్టీని మీరు త్యాగం చేసేస్తారు. అంత త్యాగశీలురు మరెవరున్నారు?" అంటూ చప్పట్లు కూడా కొట్టేశాడు చెంచాగారు అలవాటులో పొరపాటుగా.

—గౌస్

# సాంప్రదాయం సడలించం

ఆంజనేయులు ఛోటా రాజకీయ నాయకుడు. మంత్రిత్వాలని చాలా కాలంనుంచి ఉబలాటపడుతున్నా యం. యల్. ఎ. కూడా కాలేకపోయాడు. పట్టు విడువని విక్రమార్కుడిలా ప్రయత్నం మాత్రం మానలేదు. మంచి రోజులు అనేవి ఉన్నాయనీ, అవి ఎప్పటికైనా తనకు కూడా వస్తాయనీ గొప్ప నమ్మకం అతనికి.

అలాగని వృత్తినే కూర్చోకుండా చిన్న చిన్న కమిటీలలో పెద్ద సభ్యుడై, కంట్రాక్టులు గట్రా సంపాదించి సొమ్ము చేసుకుంటూనే ఉన్నాడు. 'డబ్బు సంపాయించడానికి కాకపోతే రాజకీయాలెందుకోయ్' అంటాడు సన్నిహితుడెవడైనా ఆ సంగతెత్తితే.

ఓనాడు సుఖంగా బల్ల మీద వెల్లకిలా పడుకుని మంగలితో ఒళ్లు పట్టించుకుంటున్నాడు.

భార్య ఆనందీబాయి 'గొల్లు'న ఏడుస్తూ అతని పక్కకొచ్చి నిలబడింది. హడలిపోయాడు ఆంజనేయులు.

"ఏమిటి ... ఏమయింది?" భార్య భుజాలు కుదుపుతూ ప్రశ్నించాడు.

ఆనందీబాయి తన చేతిలో ఉన్న పత్రిక అందించింది భర్తకు.

అది ఆ ఊళ్ళోని వార పత్రిక. నాలుగో పేజీలో ఆంజనేయులు బొమ్మ వేసి దిగువన అతను గుండె జబ్బుతో హఠాత్తుగా మరణించినట్టు రాసి ఉంది.

ఆంజనేయులు ఉగ్రుడై పోయాడు. చకచకా బట్టలు కట్టుకుని, టాక్సీమీద



హుటాహుటిన 'త్రిశూలం' పత్రిక ఆఫీసుకి జేరాడు.

ఆంజనేయులు చేతిలో ఉన్న పత్రికను విసురుగా టేబుల్ మీద కొట్టేడు.

"ఏమిటయ్యా ఎడిటరూ దీనర్థం? ఏం రాశావో చూశావా?" అని పత్రిక చూపించాడు ఆంజనేయులు.

మనిషి వంక, పత్రికలో అచ్చయిన బొమ్మవంక ఎగాదిగా రెండు మూడు సార్లు చూశాడు ఎడిటర్ బుచ్చన్న.

"ఓశ్...అదా! ఆంజనేయులు చచ్చిపోయిన మాట వాసవమే. కాని అతను ఇంకొకడు. ఆంజనేయులనగానే నువ్వే అనుకుని మావాళ్ళు అచ్చేసి ఉంటారు. పత్రికలలో అప్పుడప్పుడు అచ్చుతప్పులు దొర్లుతుంటాయి. దానికింత రభసేమిటి? చూసీచూడనట్టు సరిపెట్టుకోవాలి" అన్నాడు బుచ్చన్నగారు అదేం పెద్ద నేరం కాదన్నట్టు.

మరీ మండిపోయాడు ఆంజనేయులు. కోపంతో రక్తం కుతకుత ఉడికిపోతోంది.

"అయితే నేను చచ్చానా? ఏమిటయ్యా నీ ఉద్దేశం?"

"ఏం చేద్దామంటారు?"

"వచ్చే పత్రికలో-పొరపాటుకి చింతిస్తున్నామని క్షమాపణ చెప్పుకుంటూ సవరణ మొదటి పేజీలో వెయ్యి. బోధపడిందా?" బల్లగుద్ది అడిగాడు ఆంజనేయులు.

"అలాగే చేద్దును కాని చిన్న ఇబ్బందుంది. మా పత్రికకు కొన్ని సాంప్రదాయాలున్నాయి. మేము ఈ నలభై ఏళ్ళ కాలంలో ఒక్క సవరణ కూడా వెయ్యలేదు. ఈరోజున అనాదిగా వస్తున్న సాంప్రదాయాన్ని సడలించం".

"అయితే నన్ను చచ్చినోళ్ళ కింద జమ కట్టేస్తావన్నమాట. ఎన్ని గుండెలున్నాయి నీకు? నీ అంతు తేలుస్తాను."

"ఆవేశపడితే అనర్థం తప్ప ఒరిగేదేమీ ఉండదు. జరిగిన పొరపాటుని సరిచేయడానికి ఇంకో మార్గం ఉంది."

"ఏమిటది?"

"నువ్వు బతికుండడమే గదా నీక్కావలసింది! వచ్చే పత్రికలో నువ్వు మళ్ళీ పుట్టినట్టు వార్త వేస్తాను" అన్నాడు బుచ్చన్న.

—ప్రతాపరావ్

హరిబాబు గుండెల్లో డైనమేట్ పేలి నట్లయింది.

తెగిన తటాకంలా కళ్లనిండాకన్నీళ్లు..

చేతుల్లో గాలికి రెపరెపలాడుతున్న ఉత్తరం.

కళ్ళనుండి ఉబికిన ఆ కన్నీళ్ళు... చెక్కిళ్లమీదుగా జారి ఉత్తరం మీద టప టప పడుతున్నాయి.

అక్షరాలు అలుక్కుపోయి అన్నీ మరకలు... మరకలు...

ఆ కన్నీటి చుక్కలకింద అతని జీవితమే కరిగిపోయినట్లయి గుండెల్లో అంకురించి... పెరిగి విశాలంగా వ్యాపించిన ఆశల వటవృక్షం ఒకేఒక క్షణంలో ఒరిగిపోయినట్లయింది.

ఆ క్షణంలో ఈ అనంత ప్రపంచం మీదే కసి, ఏవగింపు, ద్వేషం అన్నీ ఒక్క ఉదుటున హరిబాబు గుండెలనుండి ఉబికి వచ్చాయి.

చేతుల్లోని ఉత్తరాన్ని గట్టిగా నలిపే శాడు కసిగా.

నీలిమ రాసిన ఆ ఉత్తరం అతని చేతుల్లో ముక్కలుముక్కలైపోయింది... నీలిమకు అర్పించిన అతని హృదయం లాగే.

ఉత్తరం ముక్కలు అతని చేతుల్లోంచి నేలమీద పడి చెల్లాచెదురైపోయాయి. ఆ ముక్కలనన్నింటినీ మెల్లగా ఏరి ఓ చోట పోగుచేసి టేబుల్‌మీద పడిఉన్న అగ్గి పెట్టెను అందుకొని పుల్ల వెలిగించాడు.

కాగితం ముక్కలు కాలుతున్నాయి.

అది...మృగ్యమైన తన ప్రేమకు తాను పెడుతున్న తలకొరివి.

ఆ మంట కొద్దిక్షణాల్లో ఆరిపోతుంది.

కానీ...కానీ తన హృదయంలోని మంట?

బావురుమన్నాడు హరిబాబు.

* * *

పరీక్షలు భూతాల్లా తరుముకొస్తు న్నాయి.

పరీక్షలకు ముందు మెడిసిన్ విద్యార్థులు ఆకలిదప్పులను మరిచిపోయి...బయటి ప్రపంచంతో సంబంధాన్ని తెంచు కొన్నట్లుగా తలుపులు బిడాయించు కొని గదులలో కూర్చుని పుస్తకాలతో రాత్రింబవళ్లు హోరాహోరీగా పోరాడు తారు.

ఓ పక్క పరీక్షల భయం....

ఇంకోపక్క పక్కవాడికన్నా తను ఎక్కడ తక్కువ మార్కులను తెచ్చు కొంటానేమోనని దిగులు. లెక్చరర్స్‌కు తమమీద ఉండే ఇంప్రెషన్ పోతుం దేమోనని భయం అందుకే ఆరోగ్యాన్ని కూడా లెక్క చెయ్యకుండా కష్టపడి చదువుతారు.

కానీ... హరిబాబు అందరిలా చదవలేక పోతున్నాడు.

గతం అతని గుండెల్లో కుంపటిలా రగులుతోంది.

జ్ఞాపకాలుహృదయానికి గాజు పెంకుల్లా గుచ్చుకొంటున్నాయి. పుస్తకం తెరిస్తే ప్రతి పేజీలోనూ నీలిమ కనబడుతోంది. ప్రతి అక్షరంలోనూ నీలిమ కంఠం ధ్వని స్తున్నట్టుగా ఉంది.

చదువుమీద ఏకాగ్రత కుదరడం లేదు.

ప్రతి క్షణం నీలిమే నీడలా వెన్నాడు తోంది.

క్లాస్‌మేట్స్ అందరూ చాలా సీరి యస్‌గా చదువుకొంటున్నారు. వాళ్ళం దరినీ చూస్తుంటే హరిబాబుకు తాను పాస్




కాగలనో లేదోనన్న భయం పట్టుకొంది.

చదవాలి... బాగా చదవాలి.

రాత్రింబవళ్లు చదవాలి.

నీలిమను మరిచిపోయి చదవాలి.

అయినా నీలిమ కోసం తనెందుకు ఇలా బాధపడుతూ కూర్చోవడం? ఆ 'బ్యూటీ డెవిల్' జ్ఞాపకాలతో తనెందుకు ఇలా చదువును చెడగొట్టుకోవడం?

ఉత్తరాలలో ప్రేమాభిమానాలకు జీవం పోసి...

నిజజీవితంలో వాటిని ఉరితీసి...

తన బతుకులో నిప్పులుపోసి...

హృదయాన్ని రంపపుకోత కోసి...

చివరకు తనను ఒంటరిగా వదిలేసి తన దారిన తాను వెళ్లిపోయిన నీలిమ కోసం తనెందుకు యాతనపడడం?

ఇన్నాళ్లూ తను చేసిందేమిటి?

విలువైన కాలాన్ని వృథాచేసుకొంటూ పుస్తకాలను తాకకుండా నీలిమకు పేజీలు పేజీలు ఉత్తరాలు రాస్తూ కూర్చోవడమే గదా!

దానివల్ల తను సాధించిందేమిటి? సముద్రమంత వ్యధ...ఆకాశమంత బాధ. అంతకుమించి మరేంలేదు.

ఇన్నాళ్లూ తను చదువును నిర్లక్ష్యం చేసిన నేరానికి ఇప్పుడు శిక్ష అనుభవించాలి. తప్పదు.

కష్టపడి చదవడమే దానికి సరైన శిక్ష

అవును. చదవాలి...చదవాలి...

ఆలోచిస్తున్నాడు హరిబాబు. అతడు చాలా పట్టుదలగల మనిషి. గట్టిగా నిర్ణయించుకొంటే చేసి తీరవలసిందే.

ఆ రోజునుండే చదవడం మొదలెట్టాడు.

టేబుల్‌పైన పుస్తకాలన్నీ గుట్టగా పడి ఉన్నాయి.

పరీక్షలు దగ్గరికొస్తున్నాయి.

ఎక్కడలేని ఉద్రేకంతో రాత్రింబవళ్ళకు తేడాలుగుర్తించకుండా,కూర్చున్న కుర్చీలోంచి లేవకుండా నీలిమపై కసితో తీవ్రమైన పట్టుదలతో చదివేస్తున్నాడు హరిబాబు.

గదిలో నేలమీద కాల్చి పారేసిన సిగరెట్ ముక్కలు...

నిద్ర ముంచుకు వస్తున్నా కంట్రోల్ చేసుకొంటున్నాడు.

కరెంట్ పోతే కాండిల్ వెల్గించుకొని చదువుతున్నాడు. పట్టుదల పరాకాష్ఠనందుకొంది.ఆ పట్టుదలముందు ఆరోగ్యం క్షీణించి పోతోందనే విషయాన్ని గుర్తించలేదతను

బయటి ప్రపంచాన్ని చూడడం మానుకొన్నాడతను.

భోజనానికికూడా వెళ్ళేవాడు కాదు. రోజూ సమయానికి మెస్‌లోంచి క్యారియర్ సింహాద్రిచేత తనగదికే తెప్పించుకొంటున్నాడు. సిగరెట్స్,ఫ్లాస్క్‌లో 'టీ' సింహాద్రి ద్వారానే తెప్పించుకొంటున్నాడు.

ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది.

ముఖం కాంతి హీనమైపోయింది.

దగ్గు ఎడతెరిపిలేకుండా వస్తోంది.

ఏం తిన్నా సయించేదికాదు. ఎప్పుడైనా కొద్దిదూరం నడిస్తే చాలు ఎక్కడలేని ఆయాసం వస్తోంది.

కడుపులో, గొంతులో ఏదో మంట.

ఒక మెడిసిన్ స్టూడెంట్ అయివుండీ హరిబాబు తన ఆరోగ్యంపట్ల అశ్రద్ధ చూపాడు. కారణం తీవ్రస్థాయినందుకొన్న పట్టుదల... నీలిమపై కసి.

కొందరి మన స్తత్వాలు చాలా విచిత్రం. ఇతరులు చేసిన నేరాలకు కూడా తమనే

శిక్షించుకొనేవారి కోవకు చెందినవాడే హరి బాబు.

అతని రూంమేట్ ప్రసాద్.

అతను అక్కడే ఎం. ఎ. ఇంగ్లీష్ లిటరేచర్ చదువుతున్నాడు. వాళ్ళనాన్నకు ఆరోగ్యం బాగలేదని ఊరినుండి ఉత్తరం వస్తే తమ ఊరికి వెళ్ళిఉన్నాడు.

ప్రసాద్ ఉంటే హరిబాబు ఆరోగ్యం చెడిపోతూ ఉంటే చూస్తూ ఊరకుండే వాడు కాదు.

* * *

తలుపుపై ఎవరో దబదబా బాదిన శబ్దం.

"ఎవరూ?" అన్నాడు హరిబాబు.

"హరీ !" బయట ప్రసాద్ కంఠం విన్పించింది. కాట్ మీద ముసుగుతన్ని పడుకొని మెల్లగా మూలుగుతున్న హరి బాబు లేచి బోల్ట్ తీశాడు.

తలుపులు బార్లా తెరుచుకున్నాయి. హరిబాబునే తదేకంగా చూస్తున్నాడు ప్రసాద్.

"అలా చూస్తున్నావేమిట్రా?"

ఎక్కడో దిగంతాలనుండి వచ్చినట్లుగా ఉంది ఆ మాట.

"హరీ! ఏమిటి అలా అయిపోయావ్"

"ఆరోగ్యం బాగలేదు"

గదిలో నేలమీద కుప్పలా పడిఉన్న సిగరెట్ పీకలు కన్పించాయి ప్రసాద్‌కు.

"రోజూ మరో నాలుగు పాకెట్ల సిగరెట్లు తగలెయ్. ఇంకా బాగుంటుంది ఆరోగ్యం. నేను చెప్పే మాటలు ఎలాగూ నీ చెవికెక్కవు. పోనీ ఆ నీలిమ చెప్పిన మాటలన్నా వినలేకపోయావా? అది సరే గానీ నువ్వు మదనపల్లి వెళ్లి నీలిమను కలిశాక విశేషాలతో మా ఊరికి ఉత్తరం రాయమన్నాను. మరి రాయలేదెందుకని?" లుంగీ కట్టుకుంటూ అడిగాడు ప్రసాద్.

హరిబాబు నుండి జవాబు లేదు.

"చెప్పవేంరా?"

నీలిమ ప్రసక్తి ఎత్తగానే కాట్ మీద పడుకొని దిండులో ముఖం దాచుకున్నాడు హరిబాబు.

ఒక్కసారిగా గుండెల్లోంచి దుఃఖం పెల్లుబికింది. గుండె అంచులపై గూడు కట్టుకున్న జ్ఞాపకాల మేఘాలు ప్రసాద్ వేసిన ప్రశ్నతో నిలువునా కరిగి పోయాయి.

రెండు చేతుల్లో ముఖం దాచుకుని బావురుమన్నాడు హరిబాబు. ఆ పరిణామానికి నిర్ఘాంతపోయాడు ప్రసాద్.

"హరీ! ఏమిట్రా? అసలేం జరిగింది" అంటూ కదిపిన ప్రసాద్ చేతికి హరిబాబు శరీరం నిప్పులా తగిలింది.

"నేను ... నేను మోసపోయాను. నీలిమ నన్ను దారుణంగా మోసగించింది" అంటూ జరిగిన విషయాన్ని చెప్పాడు హరిబాబు.

అంతావిని బరువుగా ఓ నిట్టూర్పు వదిలాడు ప్రసాద్. హరిబాబు ఆరోగ్యం బాగా చెడిపోయిందని తెలుసుకోడానికి ఎంతోసేపు పట్టలేదు ప్రసాద్‌కు.

"హరీ ! నువ్వు తొందరగా బట్టలు వేసుకో"

"ఎందుకని?"

"డాక్టర్ దగ్గరికెళ్లాలి"

"ఎందుకు?"

"ఎందుకా? నిన్ను డాక్టర్‌కి చూపించడానికి. నీ ఒళ్లు ఎలా కాలిపోతోందో తెలుసా నీకు ? తొందరగా బయలుదేరు మరి" అంటూ ప్రసాద్ హరిబాబును

బలవంతంగా గదిలోంచి బయటికి తీసు కొచ్చాడు.

* * *

ఆటో స్పీడుగా వెళుతోంది.

హరిబాబు, ప్రసాద్ మౌనంగా కూర్చు న్నారు.

అప్పుడప్పుడు ... హరిబాబు దగ్గు తున్నాడు.

అతనికి మత్తుగా ఉంది. గొంతులో మంటగా ఉంది. ఉమ్మి వేద్దామని ఆటోను ఆపమన్నాడు. ఆటో ఆగిపోయింది.

కాండ్రించి ఊచాడు హరిబాబు!

నోటిలోంచి...ఎర్రగులాబీ పూవులా అణాకాసంత రక్తపు కళ్లికింద పడింది.

హరిబాబు కళ్ళు చెదరిపోయాయి.

ప్రసాద్ మనసులో ఏదో అనుమానం.

ఆటోవాడు... జాలిగా చూశాడు హరిబాబును.

ఆటో మళ్లీ కదిలింది.

డాక్టర్ 'ఎక్స్‌రే' తీశాడు.

"టి. బి"

హరిబాబు గుండెలవిసి పోయాయి.

గుండెపై గునపం గుచ్చినట్లయింది ప్రసాద్‌కు.

"ఊపిరితిత్తుల్లో కుడివేపున రెండు కేవిటీలు పడ్డాయి. ఎడం వేపున... జబ్బు మాత్రమే ఉంది" చెప్పాడు డాక్టర్.

"ఇప్పుడెలా డాక్టర్?"

"వెంటనే ఏ శానిటోరియంలోనో చేర్పించండి" డాక్టర్ జవాబు.

"శానిటోరియంలోనా?"

"యస్"

"డాక్టర్! మరి...నా పరీక్షలు..." హరిబాబు అన్నాడు.

"ఏం చదువుతున్నారు మీరు?" అడిగాడు డాక్టర్.

"మెడిసిన్ థర్డ్ ఇయర్"

"ఆర్ యు ఎ మెడికో?"

"అవును సార్"

"మెడికో అయి ఉండీ... హెల్త్‌ను నెగ్లెట్ చేశారెందుకని?"

హరిబాబు మౌనంగా ఉండిపోయాడు.

"చూడండీ! మీ ఆరోగ్యం బాగుపడాలంటే... కొన్నాళ్ళు మీరు చదువు మానేసి శానిటోరియంలో చేరి ట్రీట్‌మెంట్ తీసుకోవాలి. చదివేముందిలెండి మళ్లీ కంటిన్యూ చెయ్యవచ్చు. ఇంతకూ మీదేఊరు?" ప్రశ్నించాడు డాక్టర్.

"నెల్లూరు జిల్లాలో ఓ పల్లెటూరండి"

"అయితే మీకు 'మదనపల్లి' దగ్గరే అనుకొంటాను. ఆ ఊరి దగ్గర ఉందిగా టి.బి. శానిటోరియం. అక్కడైతే జబ్బు చాలా త్వరగా నయమైపోతుంది" చెప్పాడు డాక్టర్.

డాక్టర్ దగ్గర శెలవు తీసుకొని ఇద్దరూ రూమ్ చేరుకున్నారు.

"హరీ! రేపు ఉదయం నీకు ట్రైనుంది" మెల్లగా అన్నాడు ప్రసాద్.

"ఉంటే..." అర్థంకానట్టు చూశాడు. హరిబాబు.

"ఆ ట్రైన్‌కు నువ్వు మీ ఊరెళ్లాలి"

"డాక్టర్ చెప్పిన మాటలను నువ్వు కూడా బలపరుస్తున్నావా?"

"ఏం? శానిటోరియంలో చేరి జబ్బు నయం చేసుకోవాలని లేదా? ఆరోగ్యం కన్నా చదువే ముఖ్యం అనుకొంటున్నావా నువ్వు?"

"వద్దు ప్రసాద్! నేను వెళ్ళను. నేను ఈ పరీక్షలు రాసితీరాలి. ఎంతో పట్టుదలతో రాత్రింబవళ్లు శ్రమపడి చదివాను..చదువుతున్నాను. కానీ ఇప్పుడా శ్రమంతా బూడిదలో బోసిన పన్నీరై




పోతుంటే... చూస్తూ ఎలా..ఎలా ఊరుకోను? నా ఆరోగ్యం ఏమైనా పర్వాలేదు. కానీ నేను పరీక్షలు రాసితీరాలి"

"చూడు హరీ! నువ్వు పరీక్షలు... పరీక్షలు అంటూ ఇలా పట్టుబట్టి కూర్చుంటే ఆ జబ్బు కాస్త ముదిరిపోయి రేపు నీ జీవితమే బూడిదపాలైపోవచ్చు"

"భయపెడుతున్నావా ప్రసాద్?"

"లేదు. మిత్రుడిగా హెచ్చరిస్తున్నాను."

"ఆ పరిస్థితే ఎదురైతే భయపడను"

"అంటే...?"

"నాకు జీవితంపై తీపిలేదు" అన్నాడు హరిబాబు.

"ఈ పనికిరాని వేదాంతం మాటలు నా దగ్గర మాట్లాడకు హరీ! జీవితంపై తీపి లేనివాడివి అసలెందుకు చదువుతున్నట్లు? జీవితం ఎప్పుడూ సవ్యంగా, సాఫీగా ఏ ఒడుదొడుకులూ లేకుండా సాగిపోతున్నప్పుడు హాయిగా బతకగలుగుతూ... జీవితంలో ఏ చిన్నకష్టం ఎదురైనా భరించలేక బతుకుపై తీపిని చంపుకొనేవాడు అసమర్థుడు,పిరికివాడు" అన్నాడు ప్రసాద్.

హరిబాబు మాట్లాడలేదు.

గదిలో నిశ్శబ్దం నిండుకొంది.

హరిబాబు మెల్లగా సిగరెట్ వెలిగించాడు!

"హరీ! నీ ఆరోగ్యం ఎలా ఉందో నీకు తెలుసు. నువ్వేమీ చిన్నపిల్లాడివి కాదు. సిగరెట్లు మానేస్తే మంచిది. రేపు నువ్వు తప్పకుండా బయలుదేరాలి పరీక్షలు కావాలంటే వచ్చేఏడు రాసుకో నేను స్టేషన్‌కు వెళ్ళి నీకు టికెట్ రిజర్వ్ చేసుకొని వస్తాను" అంటూ ప్రసాద్ జవాబు కోసం కూడా ఎదురుచూడకుండా గదిలోంచి బయటికి వెళ్ళిపోయాడు.

ప్రసాద్ విషయం హరిబాబుకు బాగా తెలుసు.

తనంటే అతనికి ప్రాణం.

ఆ అభిమానంతోనే ఒక్కోసారి అతడు హరిబాబును శాసిస్తాడు. మందలిస్తాడు. సదా ప్రేమిస్తాడు.

స్నేహంలోని మాధుర్యాన్ని ప్రసాద్ వల్లే తెలుకోగలిగాడు హరి.

వాళ్ళిద్దరి బంధం ఈనాటిది కాదు.

ఇంటర్మీడియట్ నుండి వాళ్ళిద్దరూ క్లాస్‌మేట్స్.

ప్రసాద్ ఏం నిర్ణయం తీసుకొన్నా మంచి చెడ్డలు ఆలోచించే ఆ నిర్ణయం తీసుకొంటాడని హరిబాబు నమ్మకం.

తాగుతున్న సిగరెట్‌ను అవతల పారేశాడు హరిబాబు.

అవును... ప్రసాద్ చెప్పినట్లు తను సిగరెట్లు తాగడం ఇకనుండి మానుకోవాలి... తప్పదు.

* * *

ట్రైన్ కదలడానికి ఇంకా పది నిమిషాలుంది.

ప్రయాణీకులతో స్టేషన్ హడావుడిగా వుంది.

హరిబాబు ట్రైన్‌లో కూర్చున్నాడు.

ప్రసాద్ బయట కిటికీ దగ్గర నిలబడ్డాడు.

"హరీ! మదనపల్లిలో జబ్బు చాలా తొందరగా నయమైపోతుంది. అక్కడి వాతావరణం ప్రశాంతంగా, ఆహ్లాదకరంగా ఉంటుందట. అన్నట్టు నువ్వు ఆ శానిటోరియం ఇదివరకే చూశావుగా?" ప్రశ్నించాడు ప్రసాద్.

"నిజమే ప్రసాద్! కానీ... ఆరోజు

నీలిమతో ఒక ప్రేక్షకుడిలా ఆ శాని టోరియం చూడటానికెళ్లాను. కానీ... యిప్పుడు... ఈ రోగాన్ని తోడుగా తీసుకొని ... ఒక పేషంటుగా ట్రీట్ మెంట్ కోసం వెళుతున్నాను" హరిబాబు కళ్ళల్లో సన్నని కన్నీటిపొర.

ఇద్దరి మధ్యా రెండు క్షణాలు మౌనం...

ఇద్దరి మనసుల్లోనూ అవ్యక్తమైన వ్యథ...

"నీలిమ యిలా ఎందుకు చేసిందో అర్థంకావడం లేదు. ఏ సైకాలజీ పుస్తకాలలోనూ ఇమడని విచిత్ర మనస్తత్వం లాగుంది ఆ అమ్మాయిది. పోనీలే హరీ! హృదయం లేని మనుష్ని ప్రేమించడమే తప్పు. పోనీ హృదయం ఉందా



లేదా అని తెలుసుకొని ప్రేమించుదామను కొంటే అది కుదరదు. ఎందుకంటే స్త్రీని అర్థం చేసుకోడానికి బహుశా ఈ నూరేళ్ల జీవితం సరిపోదేమో"

హరి మౌనంగా ఉండిపోయాడు.

"శానిటోరియంలో చేరగానే ఉత్తరం రాయి"

"అలాగే"

"అక్కడ తీరికగా కూర్చొని గతాన్ని తవ్వుకోకు"

తల ఊపాడు హరిబాబు.

"నీ సూట్ కేస్‌లో కొన్ని నవలలు ఉంచాను. ఎప్పుడైనా బోరుగా ఉంటే

చదువుకొంటూ వుండు"

"అలాగే"

"అక్కడ పత్రికలూ అవీ దొరుకుతాయా?"

"ఏమో! ఓ వేళ దొరక్కపోయినా మదనపల్లి నుంచి తెప్పించుకొంటానులే"

రెండు క్షణాలు ఇద్దరి మధ్యా నిశ్శబ్దం...

"హరీ! నీలిమ వాళ్ళ ఊరు మదనపల్లే గదా? అంటే నువ్వు నీలిమకు చాలా దగ్గరగా వెళుతున్నావన్నమాట. పైగా నువ్వూ, నీలిమ కలిసి ఒకప్పుడు ఆ శానిటోరియం ఆవరణంలో సరదాగా తిరిగారు. నువ్విప్పుడు అక్కడ అడ్మిట్ కాగానే నీకు ఆ విషయాలన్నీ జ్ఞాపకానికి వస్తాయి. నువ్వు బాధపడుతూ కూర్చుంటావు. కానీ ఒక్క విషయం గుర్తుంచుకో. ఆ శానిటోరియంలో చేరినవారు... ఎప్పుడెప్పుడు అక్కడినుండి బయట పడుదామా అని ఎదురు చూస్తుంటారు. ఒకరి బాధతో ఇంకోరికి నిమిత్తం ఉండదు. నువ్వక్కడ గతాన్ని తవ్వుకొంటూ బాధపడుతూ కూర్చుంటే... ఓదార్చే ఆత్మీయులు అక్కడెవరూ ఉండరు. కాబట్టి...నిన్ను నువ్వే ఓదార్చుకొంటూ, నీకు నువ్వే ధైర్యం చెప్పుకోవాలి. అందుకే వీలైనంత వరకు నీలిమను మరచిపోడానికి ప్రయత్నించు"

తల ఆడించాడు హరిబాబు.

"హరీ! ఒక్కోసారి మనసు మట్టి ముద్ద అనుకొని దానిని మనకు కావలసిన రూపంలోకి తెచ్చుకోవాలి. లేకుంటే... గతాన్ని తొడుక్కొన్న మనసు మన భవిష్యత్తును చంపేస్తుంది. ఆ మనసు మనల్ని వర్తమాన జీవితంతో రాజీపడనివ్వక రంపపుకోత పెడుతుంది"

మౌనంగా వింటున్నాడు హరిబాబు.

"ప్రసాద్! నీలాంటి వాళ్ళ ప్రేమాభిమానాలు ఉన్నంత వరకు నా ప్రాణానికేమీ భయం లేదు. కానీ చావుతో రాజీ పడడమే గానీ ఎదుర్కొనగల శక్తి మనిషికి లేదని నీకు తెలుసు. ఒకవేళ అనుకోని దేదన్నా జరిగిపోతే నువ్వు ఆ శానిటోరియంకొచ్చి రెండు కన్నీటిబొట్లు రాల్చు"

"ప్రతి చిన్న విషయానికీ విపరీతంగా బాధపడిపోవడం నీకు అలవాటైపోయింది హరీ! పది మందికీ ధైర్యం చెప్పే డాక్టర్‌వి కాబోతున్న నువ్వే ఇలా జబ్బును చూసి భయపడిపోతే రేపు పేషంట్స్‌కు ఏం ధైర్యం చెబుతావు? ఈ రోజుల్లో టి. బి. పెద్ద వ్యాధేమీ కాదని నీకూ తెలుసు. తొందరగానే నీ జబ్బు నయమైపోతుంది. ధైర్యంగా ఉండు" అన్నాడు ప్రసాద్.

ట్రైను మెల్లగా కదిలింది.

"ఉత్తరాలు రాయడం మరిచిపోకు"

"తప్పకుండా"

"ఇంట్లో వాళ్ళకు ఈ విషయంచెప్పి వాళ్ళను అనవసరంగా కంగారు పెట్టకు" ప్లాట్‌ఫారం మీద నడుస్తూ మాట్లాడుతూనే ఉన్నాడు ప్రసాద్.

రైలు భయంకరంగా అరిచింది.

హరి, ప్రసాద్ ఒకర్ని ఒకరు చూసుకొంటున్నారు.

ఇద్దరి కళ్ళల్లోనూ కన్నీటి పొరలు.

ఒకరికొకరు మసక మసకగా కన్పిస్తున్నారు.

'వెళ్ళిరానా?' అన్నట్టు చూశాడు హరిబాబు.

ప్రసాద్ చేయి ఊపాడు.

రైలు వేగం పుంజుకొని స్టేషన్‌దాటి

 

గమ్యం వేపు దూసుకపోతోంది.

కిటికీ పక్కనే కూర్చున్నాడు హరిబాబు.

శూన్యంలోకి చూస్తున్నాడు.

తనదురదృష్టానికిభోరుమని ఏడ్వాలనిపించిందతనికి.

తాను చదివిన నవలల్లో నాయకుడికి వచ్చిన టి. బి...

తాను చూసిన సినిమాల్లో హీరోకూ బోలెడంత సానుభూతిని సంపాదించి పెట్టిన టి. బి...

చిన్నప్పుడు తమ ఊళ్లో చలమయ్యను పడక మీదినుండి లేవనీయకుండా, బంధువుల్ని చూడనీయకుండా దారుణంగా చంపేసిన టి.బి...

ఇప్పుడు తన ఊపిరితిత్తుల్లో...

ఇక ఆలోచించలేకపోయాడు హరిబాబు.

తన జీవితంలో తిరిగిన ఈ అనుకోని మలుపు తనను ఎక్కడికి తీసుకవెళుతోందో ?

* * *

రైలు అక్కడక్కడా స్టేషన్స్‌లో ఆగుతూ వస్తోంది.

కొందరు దిగిపోతూఉంటే మరికొందరు ఎక్కుతున్నారు.

జీవితం రైలుప్రయాణం లాంటిదని ఎక్కడో చదివినమాటలు గుర్తుకొచ్చాయి హరికి.

ఎదురు సీట్లో ఎవరో ఓ అపరిచిత వ్యక్తి.

అతడిని చాలా సేపటినుండి గమనిస్తున్నాడు హరిబాబు.

అవ్యక్తి మోకాళ్ళలోంచి ముఖాన్ని పైకెత్తాడు.

అతడు అలా మోకాళ్ళ మధ్య ముఖం దాచుకొని ఉంటే అంతవరకు నిద్రపోతున్నాడేమోనని అనుకొన్న హరిబాబుకు అతడి చెక్కిళ్ళమీద కన్నీటిధారలు లైట్ వెలుతుర్లో మెరుస్తూ కన్పించాయి.

ఆశ్చర్యపోయాడు హరిబాబు.

అతడు బాగా ఏడ్చినట్లు కళ్లు ఉబ్బి ఉన్నాయి. ముఖంలో ఏవో విషాద ఛాయలు స్పష్టంగా కనబడుతున్నాయి.

కొంపతీసి ఇతనికి కూడా తనలాగే ఏ టి.బి.నో, కాన్సరో లేదుగదా అనుకొన్నాడు హరిబాబు. విషయం ఏమిటో తెలుసుకోవాలని మనసులో చాలా ఉత్సాహంగా ఉంది.

"ఏమండీ!"

ఆ వ్యక్తి తలెత్తి హరిబాబు వేపు చూశాడు.

"మీదేఊరు ?"

"రాజమండ్రి దగ్గర"

"మీ పేరు..."

"రాజశేఖరం"

రెండు క్షణాలు మౌనంగా దొర్లాయి.

"ఎందాకా వెళుతున్నారు?"

"ఈరైలు ఎందాక వెళితే అంతదాకా"

ఆ జవాబుతో హరిబాబు మనసు కలుక్కుమంది.

"నాపేరు హరిబాబండీ. నేను మెడిసిన్ చదువుతున్నాను. మాది నెల్లూరు జిల్లా" అంటూ అతడు అడగకపోయినా తనే చెప్పాడు హరిబాబు.

"మీరేం చేస్తుంటారు?" ప్రశ్నించాడు హరిబాబు.

"నేనా? నేను జీవితంలో చేసిన తప్పులకు, నేరాలకు సరైన శిక్ష ఎక్కడ పడుతుందా అని వెతుకుతుంటాను"

ఆ డైలాగ్‌కు అదిరిపోయాడు హరిబాబు.

రాజశేఖరం వయస్సు సుమారు సలభై సంవత్సరాలుంటాయి.

మంచి దృఢకాయుడు. అందుకే చూస్తే సలభై సంవత్సరాలుంటాయని అనుకోరు.

జీవితంలో ఆయనేదో మానని ఎదురు దెబ్బలను తిని ఉంటాడని అనుకొన్నాడు హరిబాబు.

అతడిని గురించి ఇంకా తెలుసుకోవాలనిపించింది.

కానీ మాట్లాడడం ఇష్టంలేనట్లుగా తన బెర్త్ మీదికి వెళ్ళి పడుకొన్నాడు రాజశేఖరం.

కొండల్నీ, చెట్లనూ, వాగుల్నీ దాటుకొంటూ శరవేగంగా దూసుకుపోతోంది



రైలు.

* * *

సాయంత్రం ఆరుగంటలు...

పొలాలనుండి రైతులు తిరుగుముఖం పట్టేవేళ....

పడమటి కొండల మీద మండుతున్న అగ్నిగుండంలా ఉన్నాడు సూర్యుడు. ఆ కొండల మీది మేఘాలు తగలబడి పోతున్నట్టుగా ఎర్రగా ఉన్నాయి. పడమటి ఆకాశంపై నెత్తురులో బ్రష్ అద్ది పులిమినట్లుగా ఎర్రగా మరకలు.

అక్కడక్కడా చుక్కలు మెరుస్తున్నాయి పేదవారి ఆశల్లా.

వీస్తున్న పైరగాలి చల్లగా ఉంది



ప్రియురాలి చూపుల్లా.

మట్టిరోడ్డు మీద నడుస్తున్నాడు హరిబాబు.

రెండు చేతుల్లోనూ లగేజి. చేతులు నొప్పెడుతున్నాయి. చుట్టూ ఏపుగా పెరిగిన పంటలను, ప్రకృతి అందాలను తిలకిస్తూ మెల్లగా నడుస్తున్నాడు హరిబాబు.

"ఎవరా వెళ్ళేది?" ఓ కంచు కంఠం విన్పించింది.

హరిబాబు ఆగి చుట్టూ కలయ చూశాడు.

ఎవరూ కన్పించకపోవడంతో మళ్ళీ నడక సాగించాడు.

"ఎవరు బాబూ తమరు?"

దక్షిణం వేపు చూశాడు హరిబాబు. భుజంమీద నాగలి పెట్టుకొని అటూ యిటూ ఏపుగా పెరిగిన పంట మధ్య నుంచి గట్టుమీద నడిచివస్తున్న బసవయ్య కన్పించాడు హరిబాబుకు.

"ఎవరు బాబూ తమరు?"

"నేను బాబాయ్... హరిని"

అర్థం కానట్టు చూశాడు బసవయ్య.

"నేను బాబాయ్ జానకి రామయ్య కొడుకు హరిబాబుని"

"ఓరి...ఓరి నువ్వాటా హరీ!"

"అవును బాబాయ్ నేనే"

"ఎంత మారిపోయ్యావురా! నువ్వు చదివేది డాక్టర్ కోర్సు గదూ?" బసవయ్య అడిగాడు.

"అవును బాబాయ్"

"నువ్వు డాక్టర్ కావటానికి ఇంకా ఎన్నేళ్ళు పడుతుంది?"

"మూడేళ్ళకు పైగా"

"తొందరగా చదివెయ్యి నాయనా! మనూళ్ళో డాక్టర్ సౌకర్యాలే లేవు. ఏ రోగం వచ్చినా ఏ పసరాకో మింగాలి. ఈ ఊళ్ళోనే హాస్పిటల్ కట్టి వీళ్ళని కాపాడు."

"తప్పకుండా బాబాయ్! నాకు అంత కన్నా కావలసిందేముంది?"

"అరరె! చాలా బరువు మోస్తున్నావు. ఒక సూట్ కేస్ ఇలా పడేయ్ నేను తీసుకొస్తా" అంటూ బసవయ్య ఓ సూట్ కేస్‌ను అందుకొన్నాడు.

"పిన్ని బాగుందా బాబాయ్?"

"ఎవరూ పార్వతిని గురించా నువ్వడిగేది?"

"అవును బాబాయ్"

"ఇంకా ఎక్కడ పిన్నిరా— ఆమె పోయి నాలుగు నెలలైంది" బసవయ్య కన్నుల్లో తడి.

"బాబాయ్! ఏమిటి నువ్ చెప్పేది? పిన్ని పోయిందా? ఎలా పోయింది బాబాయ్?"

"ఎలా అంటే ఏం చెప్పేది నాయనా! వాళ్ళమ్మకి క్షయరోగం వస్తే చూడడాని కెళ్ళి సపర్యలు చేస్తూకూర్చొంది. అది అసలే అంటురోగం గదా. అది మీ పిన్నికీ తగిలి వాళ్ళమ్మతో పాటు కొన్నాళ్ళకు అదీ పోయింది" బసవయ్య గొంతు మూగబోయింది.

క్షయను గురించి ఇంకా చెబుతున్నాడు బసవయ్య.

అది చాలా భయంకరమైన అంటు రోగం. ఒక్కసారి పట్టుకుంటే ఇక ఆ మనిషిని చంపే వరకు అది వదలదు. ఆ రోగం వచ్చినవాడి దగ్గరకు మనుషు లెవరూ పోగూడదు. పోతే అది వాళ్ళను కూడా పట్టుకుంటుందిట...

క్షయపట్ల పల్లెటూరి ప్రజల అభిప్రా

యాలేమిటో స్పష్టంగా తెలిసిపోయాయి హరిబాబుకు. ఒక్క బసవయ్యనే కాదు ఆ ఊరి మనుషులలో ఎవరిని అడిగినా క్షయను గురించి ఆ మాటలే చెబుతారని హరిబాబుకు తెలుసు.

వీళ్ళందరూ ఏ రోగాన్నైతే అస హ్యించుకుంటున్నారో ఆ రోగం తన ఊపిరితిత్తుల్లో ఊపిరిపోసుకొంటోందని తెలిస్తే...

ఒక్కరైనా తనకు చేరువ కాగలరా?

ఒక్కరైనా తన పక్కన నిర్భయంగా కూర్చోగలరా?

ఆ క్షణంలో అక్కడికక్కడే గుండెలు బాదుకొని చచ్చిపోవాలన్పిం చింది హరిబాబుకు!

"శోభా!" వరండాలో లగేజీ పెడుతూ పిలిచాడు.

"అరె-అన్నయ్య! ఇదేనా రావడం?" అడిగింది శోభ.

"అవునమ్మా! నువ్వెప్పుడొచ్చావ్?"

"నేను వచ్చి వారం అయింది. అమ్మోయ్... అమ్మా ! అన్నయ్య వచ్చాడే" అంటూ సంతోషంగా ఇంట్లోకి పరుగెత్తింది శోభ.

హరిబాబు ఇంట్లోకి నడిచాడు.

శాంతమ్మ, శివరామయ్య శోభ మాటలు విని హాల్లోకొచ్చారు.

"ఏమిటి పిన్నీ అలా చూస్తున్నావ్?" తన వేపే కన్నార్పకుండా చూస్తున్న శాంతమ్మను అడిగాడు హరిబాబు.

"ఏమిట్రా మరీ అలా అయి పోయావ్?"

"ఎలా అయిపోయాను?"

"ఎలా అయిపోయావా? అద్దంలో నీ మొహాన్ని ఎప్పుడైనా చూసుకొన్నావా?"

"ప్రయాణంతో అలసిపోయిఉంటాడు లేవే" అన్నాడు శివరామయ్య.

"అన్నయ్యా! ఇదిగో నీ మేనల్లుడు" అంటూ శోభ తన ఆర్నెల్ల కొడుకును తీసుకొచ్చి హరిబాబుకు అందించింది.

"శోభా! నీ కొడుకు అచ్చం నీలాగే ఉన్నాడే" అంటూ ఆ పసిపిల్లాడిని ముద్దెట్టుకున్నాడు హరిబాబు.

"అన్నయ్యా! నా కొడుకును నువ్వి ప్పటినుండే మచ్చిక చేసుకోవాలి"

"మచ్చిక చేసుకోవాలా...ఎందుకని?"

"రేపు నీ కూతుర్ని వాడు చేసుకో వద్దూ?"

"నా కూతురికి నీ కొడుకేనా దిక్కు? కో అంటే నా కూతురికోసం కోటిమంది వచ్చి క్యూలో నిలబడతారు. తెలిసిందా?"

"ఆc .. తెలిసిందిలే పెద్ద" అంటూ వెక్కిరించింది శోభ.

"బావ రాలేదా శోభా?"

"లేదన్నయ్యా! వరినాట్లు ఉండడంతో ఆయనకు తీరిక లేకపోయింది" చెప్పింది శోభ.

అందరూ హాల్లో కూర్చుని కబుర్లు చెప్పుకొంటున్నారు.

హరిబాబు తనలో తానే ఘర్షణపడు తున్నాడు.

తన ఆరోగ్యం విషయం చెప్పాలా వద్దా ? వాళ్లు తన తల్లిదండ్రులతో సమానమైనవాళ్లు. చిన్నప్పటినుండి తనను కన్న కొడుకుగానే చూసుకొన్నారు. వాళ్ళకు చెప్పకుండా తాను ఏదీ... ఎప్పుడూ దాచలేదు.

ఇప్పుడు మాత్రం ఈ విషయం దాచడమెందుకు?

ఓవేళ దాచినా...తాను శానిటోరి యంలో చేరిన తరువాతైనా తెలీకపోదు.

"పరీక్షలు ఎలా రాశావు హరీ?"

మనుమడిని ఆడిస్తూ అడిగాడు శివ రామయ్య.

"ఇంకా పరీక్షలు జరుగలేదు బాబాయ్"

"ఎప్పుడు జరుగుతాయి?"

"ఇక నాలుగు రోజుల్లో. కానీ...ఈ సంవత్సరం నేను పరీక్షలు రాయకుండా వచ్చేశాను బాబాయ్" కప్పుపై చూపులు మరల్చి చెప్పాడు.

"పరీక్షలు రాయకుండా వచ్చేశావా?"

"అవును బాబాయ్! డాక్టర్లు చదువు మానేసి కొంత కాలం నన్ను విశ్రాంతి తీసుకోమన్నారు. నా ఆరోగ్యం బాగా లేదట."

"పోనీలే మంచి పని చేశావ్. నిన్ను

చూడగానే నీ ఆరోగ్యం బాగలేదని నాకు అనుమానం వేసింది" అంది శాంతమ్మ.

"పిన్నీ! ఇంతకూ నా జబ్బేమిటో తెలుసా?"

"ఏం జబ్బని చెప్పారు డాక్టర్లు?"

"నాకు..నాకు...నాకు టి.బి. పిన్నీ!"

"టి.బి.యా? అంటే?"

"అంటే...బసవయ్య బాబాయిగారి భార్య...పార్వతి పిన్నిని చంపేసిందే... క్షయ అది" కింది పెదవిని పంటితో నొక్కిపెట్టి, కన్నీటిని ఆపుకుంటూ మెల్లగా చెప్పాడు.

"హరీ! ఏమిట్రా... ఏమిట్రా నువ్వు చెప్పేది"

"అవును పిన్నీ! నాకు...నాకు క్షయ"



అంతే! శాంతమ్మ ఆ మాట వినగానే ఆమె నవనాడులూ కృంగిపోయాయి. తన గుండెను ఎవరో బలంగా బరిసె పోట్లు పొడిచినట్లయింది శివరామయ్యకు! గడ్డన పడిన చేపపిల్లలా విలవిలలాడి పోయింది శోభ మనసు.

రెండు క్షణాలు వాళ్ళమధ్య భయంకర నిశ్శబ్దం.

స్మశాన నిశ్శబ్దంలాంటి ఆ నిశ్శబ్దాన్ని భరించలేకపోయాడు హరిబాబు. ఏం మాట్లాడాలో ఎవరికీ ఏమీ పాలుపోవడం లేదు.

"బాబాయ్! మదనపల్లి దగ్గర శాని టోరియం ఉంది. అక్కడ చేరితే తొందరగా నయమైపోతుందట. అక్కడ పెద్ద పెద్ద డాక్టర్లు ట్రీట్‌మెంట్ ఇస్తారట. నేనూ అక్కడే చేరాలనుకొంటున్నాను"

"అలాగే" గొంతు పెగల్లేదు శివ రామయ్యకు.

చిక్కిపోయి, సన్నగా ఎముకల గూడులా ఉన్న హరిబాబును చూస్తుంటే శాంతమ్మ కళ్ళల్లో గిర్రున నీళ్లు తిరిగాయి.

శాంతమ్మ కన్నీటిని చూసి చలించి పోయాడు హరిబాబు. కన్న మమకారం కన్నా పెంచిన మమకారం గొప్పది.

"హరీ ! భోంచేద్దువుగాని లే" అంది శాంతమ్మ.

శివరామయ్య ఇంట్లోంచి వీధిలోకి వెళ్లిపోయాడు.

"శోభా! మీ అన్నయ్యకు అన్నం వడ్డించు" అంటూ పసిబిడ్డను తీసుకొని వరండాలోకి వెళ్లిపోయింది శాంతమ్మ.




హరిబాబు భోజనానికి కూర్చున్నాడు.

శోభ విస్తరాకు తీసుకొచ్చి హరిబాబు ముందుంచింది.

హరిబాబు కనుబొమ్మలు ముడి వడ్డాయి.

ఏరోజూ తను ఈ ఇంట్లో విస్తరిలో తినలేదు.

ఏదో ఓ కంచంలో తినేవాడు తను. పిన్ని కంచంలోనో, బాబాయ్ కంచంలోనో, లేక శోభ కంచంలోనో, ఏ కంచం ఖాళీగా ఉంటే ఆ కంచంలో తనకు వడ్డించేవాళ్లు. విస్తరిలో వడ్డించడానికి తనేమీ ఆ ఇంటికి చుట్టం కాదు. తను ఆ ఇంట్లో మనిషితో సమానం. తనకూ, ఆ ఇంటికీ ఉండే సంబంధం ఈనాటిది కాదు. దాదాపు పన్నెండు సంవత్సరాలుగా పెనవేసుకపోయిన సంబంధం అది.

రక్తానికీ, ప్లాస్మాకూ...

నిప్పుకూ, వేడికీ...

వెన్నెలకు, చంద్రుడికీ...

వీటి మధ్య ఉండే బలీయమైన సంబంధం-తనకూ, ఆ ఇంటికీమధ్య ఉంది.

విస్తరిలో వడ్డిస్తోంది శోభ.

నిజమే. తను...తను క్షయరోగి.

అలాంటప్పుడు... తను తిన్న కంచంలో వాళ్లెందుకు తింటారు. పైగా ఈ పల్లెటూరి ప్రజలకు క్షయపట్ల ఉండే అభిప్రాయాలు తనకు తెలిసినవే.

తన ద్వారా అది ఇంట్లోవాళ్ళకి అంటుకొంటుందేమోనని శోభభయం.అందుకే... అందుకే ఇలా విస్తరిలో వడ్డన... ఇలా ఆలోచించుకొంటూ అన్నం కెలుకుతున్నాడు హరిబాబు.

అతనికి తినాలని అనిపించడం లేదు.

శోభ కొడుకు-వరండాలోంచి పాకుకుంటూ హాల్లోకి వచ్చి మెల్లగా వంట

గదిలోకి చొరబడ్డాడు.

హరిబాబు ముందున్న విస్తరి వద్ద ఆగిపోయాడు.

ఆ విస్తరిలోకి చేయిపెట్టాడు ఆ పసిబిడ్డ.

అది చూసి ఒక అంగలో వచ్చి వాడిని అందుకొంది శోభ. "అన్నంతింటే వీడికి జీర్ణం కాదన్నయ్యా" అంటూ ఆ పసివాడిని పెరడు దగ్గరకి తీసుకుపోయి వాడి చేతిని శుభ్రంగా కడగసాగింది శోభ.

అంతా గమనిస్తున్నాడు హరిబాబు.

తనపై తనకే అసహ్యం వేసింది.

శోభను పసితనంలో తనెంత గారాబంగా చూశాడు!

తను తింటుంటే శోభ జోగుతూ వచ్చి తన కంచం పక్కన కూర్చుంటే ముద్దలు చేసి తినిపించాడు తను.

శోభకు గాజులు తెచ్చిపెట్టాడు.

పూవులు కొనిచ్చాడు.

బట్టలు తెచ్చిచ్చాడు.

ఒక్క మాటలో చెప్పాలంటే రక్తం పంచుకొని పుట్టకపోయినా... అంతకన్నా ఎక్కువగానే శోభపై ప్రేమాభిమానాలు చూపించాడు తను!

ఆ శోభేనా ఇప్పుడు... ఇప్పుడు... తను క్షయరోగని తెలియగానే తనకు కంచంలో వడ్డించడానికి భయపడుతున్నది?

ఆ శోభేనా...తన ఎంగిలి తింటే తన బిడ్డకూ ఆ రోగం అంటుకొంటుందని బిడ్డను దూరంగా తీసికెళ్ళిపోయింది?

మనుషుల మధ్య ఉండే బలమైన అనుబంధాలు తెగిపోడానికి కారణం కేవలం డబ్బేనని ప్రసాద్ చెప్పేవాడు.

కానీ ఇలాంటి వ్యాధులు కూడా మనుషుల మధ్య ఉండే బంధాలను తెంచే స్థాయని తనకు ఇప్పుడిప్పుడే తెలిసింది.

ఏమో శోభ నిజంగా ఆ ఉద్దేశంతో అలా ప్రవర్తించలేదేమో. తనే ఆ ప్రవర్తనకు అనవసరంగా కారణాలు సృష్టించుకొంటున్నాడేమో!

పైగా తనది గోరంతలు కొండంతలు చేసుకొని ప్రతి చిన్న విషయానికి బాధపడే మనస్తత్వమని తన ఫ్రెండ్స్ చెబుతుండేవాళ్లు.

హరిబాబు ఆలోచించుకొంటున్నాడు.

బుర్ర బద్దలు కొట్టుకొంటున్నాడు.

సున్నిత హృదయముండడం నిజంగానే మనిషికి శాపం.

నిజానికి హరిబాబు కుటుంబానికీ, శివరామయ్య కుటుంబానికీ ఎటువంటి సంబంధాలూ లేవు. హరిబాబుది ఓ పల్లెటూరు. హరిబాబు ఈ లోకం చూసేసరికి వాళ్లమ్మ శాశ్వతంగా మరోలోకానికి వెళ్ళిపోయింది. హరిబాబు మూడో తరగతిలో ఉన్నప్పుడు బామ్మ కూడా పోయింది. తర్వాత ఆ ఇంట్లో ముగ్గురే మిగిలారు. జానకిరామయ్య, కూతురు వరలక్ష్మి, కొడుకు హరిబాబు.

హరిబాబు అయిదో తరగతిలో ఉండగా—

ఓరోజు వాళ్లనాన్న అక్కయ్యను గొడ్డును బాదినట్టు బాదాడు. తండ్రి ఎందుకలా కొడుతున్నాడో హరిబాబుకి తెలియదు. అడిగి తెలుసుకొనే ధైర్యం ఆ వయస్సులో లేదు.

ఆ రాత్రంతా వాళ్ళక్కయ్య అన్నం తినకుండా ఏడుస్తూ ఉండిపోయింది.

ఉదయం ఇంట్లో వాళ్ళక్క కన్పించలేదు.

జానకిరామయ్య గాబరాపడి ఊరంతా వెతికాడు. బావుల్లో, చెరువుల్లో వెతికిం

చాడు. కానీ కూతురు శవం కూడా దొరక లేదు. 'మన ఊళ్ళోకి బట్టలు తెచ్చి అమ్ముకొనేవాడితో మీ అక్కయ్య చనువుగా ఉండేదట. వాళ్ళిద్దరిమీదా ఊళ్లో చెడుగా చెప్పుకొంటుంటే అది తెలిసి మీ నాన్న మీ అక్కయ్యను కొట్టాడట. అందుకు మీ అక్కయ్య ఎక్కడోపడి చచ్చిపోయిందట' అని ఎవరో చెబితే తెలిసింది హరిబాబుకు.

తర్వాత జానకిరామయ్య ఆ ఊళ్ళో ఆస్తిని అమ్మేసి శివరామయ్య వాళ్ళ ఊళ్ళోచేరి ఆస్తి కొన్నాడు. పక్కపక్క నుండడంతో ఆ కాపురాల మధ్య అను బంధం ఏర్పడింది.




బస్సు దిగాడు హరిబాబు.

రోడ్డుకు తూర్పుగా ఉన్న శానిటోరి యాన్ని చూశాడు.

భారంగా ఓ నిట్టూర్పు విడిచి మెల్లగా నడక సాగించాడు. శానిటోరియం ముందున్న గేటు మృత్యులోకపు ముఖ ద్వారంలా కన్పిస్తోంది. శానిటోరియం లోకి వేయబడిన వెడల్పయిన రోడ్డు రాక్ష సుడి నాలుకలా కన్పిస్తోంది. చుట్టుపక్కల ఎత్తుగా పెరిగిన చెట్లలోంచి విన్పిస్తున్న పక్షుల అరుపులు, చనిపోయిన మనుషుల ఆత్మలుచేసే ఆలాపనల్లా ఉన్నాయి. ఆ చెట్లలో ఎండిపోయి వేలాడుతున్న కొమ్మలు అక్కడే చనిపోయిన రోగుల అస్థిపంజరాల్లా కన్పిస్తున్నాయి హరి బాబుకు.

లోపలికి నడుస్తుంటే కాళ్లు వణికాయి. శరీరం ఒక్కసారిగా జలదరించింది. ఒక మెడికో అయిఉండీ ఎందుకో అతనికంత భయం.

ఆ శానిటోరియం చాలామందికి పున ర్జన్మను ప్రసాదించినా...దురదృష్టవంతు లను మృత్యు కుహరంలోకి తోసే స్తుంటుందికూడా.

పరిసరాలను చూస్తూ నడుస్తున్నాడు హరిబాబు.

అతడు ఆ శానిటోరియంలోకి ప్రవే శించడం అది రెండవసారి.

మొదట నీలిమతో అక్కడికొచ్చాడు. అయితే అప్పుడు ఈ వాతావరణం... ఇలా భయభ్రాంతులను పుట్టించలేదు. ఇంత అలజడినీ... ఆందోళనను లేపలేదు. అప్పటి పరిస్థితివేరు.

ఉన్నట్టుండి ఏదో గలభా విన్పిం చింది.

ఆగి అటువేపు చూశాడు.

ఎవరో అయిదారుగురు గుంపుకూడి ఏడుస్తున్నారు.

విషయం ఏమిటని ఎవరినో అడిగాడు. జవాబు వినగానే గుండె ఝల్లుమంది. టి.బి. బాగా ముదిరిపోయి ఆ పేషంట్ చని పోయాడట. అతని వాళ్లు ఏడుస్తున్నారు.

శానిటోరియంలోకి అడుగు పెట్టగానే కన్పించిన మొదటి దృశ్యం అదే. అన్నీ చూసుకుని వార్డ్‌లో అడ్మిట్ అయ్యాడు హరిబాబు.

చేరిన కొంతసేపటికే...ఆ వార్డ్‌లో ఉండే రోగులు ఆప్యాయంగా పలుక రించారు.

చిన్నవయసులో టి.బి. వచ్చినందుకు జాలిగా చూశారు.

సానుభూతి వాక్యాలు పలికారు.

ఆ సానుభూతికి భోరున ఏడ్వాలని పించింది హరిబాబుకు.

ఆ శానిటోరియం టౌన్‌కు దూరంగా ఎత్తైన ప్రదేశంలో ఉంది. చుట్టూ ఎత్తుగా పెరిగిన చెట్లలోంచి అప్పుడప్పుడూ చల్ల గాలి వస్తూ ఉంటుంది. పక్షుల కిలాకిలా రావాల్లు విన్పిస్తుంటాయి. వార్డులోంచి చూస్తే దూరంగా ఎత్తైన కొండల వరుస. సాయంత్రంవేళ... తళతళ మెరుస్తూ సూర్యకిరణాలు పిట్టగోడమీదుగా వార్డ్‌లోకి ప్రవేశిస్తాయి. వెళ్ళవచ్చే బస్సులు తదితర వాహనాల శబ్దాలుకూడా అప్పుడప్పుడు విన్పిస్తుంటాయి.

వార్డ్‌లో చేరిన కొన్నిగంటలకే చుట్టుపక్కలుండే రోగులు అతనితో కలిసి పోయారు.

ఎప్పటి నుంచో పరిచయమున్న వాళ్లలాగా పలుకరించారు.

కానీ... ఇదేం పట్టనట్టుగా ఓ మూల కాట్‌మీద పడుకొని ఏదో పుస్తకం చదువుకొంటున్నాడొక పేషెంట్.

ఆ పేషెంట్‌నే తదేకంగా చూశాడు హరిబాబు.

ఏదో స్ఫురించినవాడిలా ఆ కాట్ దగ్గరికెళ్ళాడు.

"రాజశేఖరంగారూ!"

ఆ పిలుపుతో టక్కున పుస్తకంలోంచి తల తిప్పాడావ్యక్తి.

"మీరు..."

"ఈమధ్య మనం రైల్లో కలిశాంలెండి. మీరేం చేస్తుంటారని నేనడిగిన ప్రశ్నకు మీరిచ్చిన సమాధానం ఇంకా గుర్తుంది లెండి" అంటూ పలుకరించాడు హరిబాబు.

"మీరు...ఇక్కడికి..."

"ఏం. రాకూడదా? నేను ఇక్కడ పేషెంట్‌గా యివాళే అడ్మిట్ అయ్యాను"

"మీరూనా! ఈ వయసులో?" నిర్ఘాంత పోయాడు రాజశేఖరం.

"వ్యాధికీ, మరణానికి వయస్సుతో నిమిత్తం ఏమిటి చెప్పండి. నేను ఆ రోజే రైల్లో మీ వాలకం చూసినపుడే అనుకొన్నాన్లెండి"

"ఏమని?"

"మీకు ఇలాంటి జబ్బేదో ఉందని"

"కానీ నేను మాత్రం మిమ్మల్ని ఇలా చూస్తానని అనుకోలేదు"

"అనుకోనివి జరిగితేనే గదండి లైఫ్ థ్రిల్లింగ్‌గా ఉండేది."

"కానీ....మిమ్మల్ని ఇలా చూస్తుంటే బాధగా ఉంది"

"నా మీద సానుభూతి చూపిస్తున్నారా?"

"ఏం? మీకు సానుభూతి అంటే యిష్టంలేదా? చూడండీ!మనం రైల్లో కలిసి కొంత ప్రయాణం చేశాం. మళ్లీ ఇక్కడ కలుసుకొని... కొన్నాళ్లు ప్రయాణం సాగిస్తాం. అయితే రైలు ప్రయాణంలో మీరు నాకన్నా ముందే దిగిపోయారు. కానీ... ఇక్కడ ఈ ప్రయాణంలో మాత్రం... మీకన్నా నేనే ముందు దిగిపోతాను."

"ఎందుకని?"

"ఎందుకంటే...నా గమ్యం చాలా దగ్గర్లో ఉంది"

"ఇంతకూ మీ గమ్యమేది?"

"మరణం"

"రాజశేఖరంగారూ!"

"ఏం! భయంగా ఉందా?"





"మీ గమ్యం మరణం కాదు, కాబోదు"

"మరి?" ప్రశ్నించాడు రాజశేఖరం.

"పచ్చని జీవితం. మీరు అక్కడే తప్పక దిగుతారు"

"కానీ...నేను ఆ స్టాపింగ్‌ను దాటు కొని వచ్చేశాను"

"మళ్ళీ మీరు వెనక్కు వెళ్ళి ఆస్టాపింగ్ లోనే దిగుతారు"

"చూడు హరిబాబూ! జీవితంఎప్పుడూ రివర్స్ వెళ్ళదు. పురోగమనమే దాని లక్షణం"

"మీరు నిరాశపడకండి. మీ జబ్బు తప్పక నయమౌతుంది"

"నిజానికి ఆ మాట నేను అనవల సింది. నా జబ్బు ఎంత తీవ్ర స్థాయిలో ఉందో నాకు తెలుసు. అంతేకాదు... ఇక్కడ నా జబ్బు నయం కాదని కూడా తెలుసు. నయం కావాలని నేను కూడా ఆశించడం లేదు"

"అయితే మీరు ఇక్కడెందుకు చేరి నట్టు?"

"బతకాలనే ఆశతో అనుకొంటు న్నారా?"

"మరి...?"

"కానేకాదు. చివరి రోజుల్లో ఇలా మారంగా వచ్చెయ్యాలన్పించింది. పైగా ఇక్కడి వాతావరణం చాలా ప్రశాం తంగా, ఆహ్లాదకరంగా ఉంటుందని చెప్పారు. చచ్చేటప్పుడైనా ఇలా ప్రశాంత వాతావరణంలో చచ్చిపోదా మని ఇక్కడికొచ్చేశాను"

"మీరు ఎంతవరకు చదువుకొన్నారు రాజశేఖరంగారూ?"

"చేసిన తప్పుల్ని గుర్తించగల్గినంత వరకు"

"గుర్తించాక ఆ తప్పుల్ని దిద్దుకొ న్నారా?"

లేదన్నట్లు పెదవి విరిచాడు రాజ శేఖరం.

"ఎందుకని?" ప్రశ్నించాడు హరి బాబు.

"జీవితంలో మనిషి చేసే తప్పులు రెండు రకాలు. దిద్దుకోగలిగిన తప్పులు, ఎప్పటికీ దిద్దుకోలేని తప్పులు. నేను చేసిన తప్పులు రెండవ కోవకు చెందినవి"

రెండు క్షణాలు మౌనంగా దొర్లి పోయాయి.

"మిమ్మల్ని చూస్తుంటే నాకో విషయం అర్థమౌతోంది"

"ఏమిటది?" ప్రశ్నించాడు రాజ శేఖరం.

"జీవితంలో మీరు చాలా దెబ్బల్ని తిన్నారని..."

"మీ అంచనా పొరబాటు"

"ఏం?" అడిగాడు హరిబాబు.

"జీవితంలో ఇంతవరకు నేను ఏ దెబ్బా తినలేదు సరిగదా నేనే మాయని దెబ్బలను కొట్టాను"

"ఎవరిని?"

"నేను నమ్మినవాళ్ళను. కాదు... కాదు. నన్ను నమ్ముకొన్నవాళ్ళను"

"ఇప్పుడు వాళ్ళ దగ్గరికెళ్లి క్షమా పణలు చెప్పుకోండి"

"అది వీలుపడదు"

"ఎందుకని?"

అందువల్లా ప్రయోజనముండదు గనుక

"క్షమాపణలు చెప్పుకోవడం వల్లా ప్రయోజనముండదా? .

"చూడు హరిబాబూ! మనం ఓ

బిడ్డను నరికేసి ఆ బిడ్డను కన్నతల్లి వద్దకు వెళ్ళి 'అమ్మా! మీ బిడ్డను మేము చంపేశాం. మమ్మల్ని క్షమించు తల్లీ!' అంటూ ఆమెకు క్షమాపణలు చెప్పుకొంటే అందువల్ల ప్రయోజన ముంటుందా? క్షమాపణలు చెప్పినందుకు ఆ మాతృ హృదయం సంతోషించి క్షమించేస్తుందా?"

హరిబాబు మౌనం వహించాడు. ఇంతలో నర్స్ అటు రావడంతో తన కాట్ దగ్గరికొచ్చేశాడు.

* * *

శానిటోరియంలో జీవితం దుర్భరం. అక్కడ రోగులకు రోగులే ఆత్మీ

యులు.

రోగులకు రోగులే ధైర్యం చెప్పుకో వాలి. ఓదార్చుకోవాలి.

అభిమానాలకూ, ఆత్మీయతలకూ నోచుకోని చీకటి జీవితమది.

డాక్టర్లూ, నర్సులూ వచ్చి ఏవో మాత్రలూ, ఇంజక్షన్లూ ఇచ్చి పోతుంటారు. ఏవో రెండు మూడు మాటలు మాట్లాడి వెళ్ళిపోతుంటారు. అంతేగానీ... ఏ పేషెంట్ తోనూ హృదయం విప్పి మాట్లాడరు. ఆ పేషెంట్ గుండెల్లోని విచారాన్ని, విషాదాన్ని విన్పించుకోరు. వాళ్ళు వాళ్ళ పరిధిని దాటి ఇవతలకు రారు.

దారుణమైన వేదనతో అక్కడ



జీవించాలి.

ప్రతిరోగి బయటి ప్రపంచంలోని ఇతరుల జీవితాలతో తమ జీవితాన్ని పోల్చి చూసుకొంటూ తన దురదృష్టానికి కుమిలిపోతుంటాడు.

అక్కడ చేరిన మొదట్లో...

జీవితం చాలా దుర్భరమన్పించినప్పటికీ ఆ వాతావరణానికి అలవాటు పడిపోయి తోటి రోగులతో స్నేహం పెంచుకొన్నాక.. బయటి జీవితంకన్నా ఇక్కడి జీవితమే నయమనుకొంటారు చాలామంది రోగులు.

ఏ వయసులో జీవితం పట్ల ఆశల్ని పెంచుకోవాలో...

ఆ వయసులో అన్ని ఆశలను చంపుకొని, హృదయం నిండా వ్యధను నింపుకొని బతకడమనేది మహాశాపం.

హరిబాబు ఈ శాపానికే గురైయ్యాడు

ప్రపంచంలోకెల్లా బాగా మేపవలసింది టి. బి. వచ్చిన వాళ్ళనేనేమో. ఉదయం పళ్ళు తోముకొని ముఖం కడుక్కొన్నది మొదలు మళ్ళీ రాత్రి బెడ్ మీద చేరి నిద్రపోయే వరకు వెన్న.. రొట్టె... మాత్రలు... మందులు ఏవో ఒకటి తింటూనే ఉండాలి. లేకుంటే జబ్బు నయం కావడం కష్టం.

అందుకే ఇష్టం లేకున్నా వాటిని విధిగా తింటారు కొందరు.

రోజులు అరిటాకు మీదపడి జారిపోయే నీటి బిందువుల్లా జారిపోతున్నాయి.

ఆ జీవితం చాలా విసుగ్గా ఉంది హరిబాబుకు.

హరిబాబుకూ, రాజశేఖరంకూ మంచి స్నేహం కుదిరింది.

అయితే తనను గురించి ఏమి చెప్పేవాడు కాదు రాజశేఖరం.

ఓ వేళ అడిగినా ఇష్టం లేనట్టుగా ముఖం పెట్టి లేచిపోయేవాడు.

అందుకే హరిబాబు కూడా అతడినేమీ అడిగేవాడు కాదు.

తన వ్యక్తిగత విషయాలను తప్పించి మిగిలిన ఎన్నో విషయాలను గురించి చెబుతుండేవాడు రాజశేఖరం.

ఈ జీవితంలో మనకు ఎందరో మనుషులు పరిచయమౌతూ ఉంటారు. అయితే మనం అందరికీ సన్నిహితులం కాలేము. కానీ కొందర్ని చూస్తే వాళ్ళతో మనకు ఎలాంటి సంబంధమూ లేకున్నా వాళ్ళతో మనకేదో సంబంధమున్నట్లు మనం వాళ్ళకు సన్నిహితులై పోతూ ఉంటాం. అదే జరిగింది రాజశేఖరం, హరిబాబుల మధ్య.

ఒక్క రాజశేఖరానికే కాదు ఆ వార్డులోని మిగిలిన రోగులందరికీ హరిబాబంటే చాలా ఇష్టం. అయితే రాజశేఖరంతో తప్ప మరెవరితోనూ చనువుగా మాట్లాడేవాడు కాదు హరిబాబు.

* * *

సాయంత్రం అయిదున్నర దాటుతోంది.

ఆకాశం అనే ఫ్లవర్‌వాజ్‌లో అమర్చిన ఒకే ఒక మందార పువ్వులా ఉన్నాడు సూర్యుడు. పడమటి ఆకాశం ఎర్రగా నిగనిగ మండుతోంది. భగ్న హృదయుడి జీవితంలాగా ఆకాశంలోగాలికి తేలిపోతున్న మబ్బు తునకలు ఎగురుతున్న ఎర్రని గుడ్డపేలికల్లా ఉన్నాయి.

వార్డంతా నిశ్శబ్దంగా ఉంది.

హరిబాబు ఒంటరిగా పడుకొన్నాడు.

అప్పుడప్పుడూ చల్లగాలి వచ్చి అతడిని పరామర్శిస్తోంది.




పేషంట్స్ అందరూ వార్డ్ బయట కెళ్ళి చల్లగాలి పీలుస్తున్నారు. మరికొం దరు అక్కడక్కడా ఉండే పచ్చికమీద కూర్చొని కబుర్లు చెప్పుకొంటూ నర్సుల మీద జోకులు వేసుకొంటూ నవ్వుకొంటు న్నారు.

అలా వాళ్ళు నవ్వుకొంటుంటే...

తాము క్షయ రోగులనీ,మృత్యువుతో పోరాటం సాగిస్తున్నామనీ గుర్తుండేది కాదు వాళ్ళకు. అలా నవ్వుకొనే సమ యంలో ఏక్షణంలోనైనా తాము రోగుల మనే విషయం గుర్తుకొస్తే నిప్పుమీదపడ్డ నీటిచుక్కలా క్షణంలో వాళ్ళ పెదవులపై నవ్వు మాయామైపోయి ఆ స్థానంలో విషాదం నిండుకొంటుంది.

హరిబాబు ఆ కాట్ మీద పడుకొని అలా ఒంటరిగా ఏదో ఆలోచిస్తున్నాడు.

అబ్బ! జీవితం ఎంత విశిష్టమైంది–ఎంత అనుభవించినా తరగనిది ... మనిషిని బాధించేది... వేధించేది పులకరింప చేసేది...ఆనంద భాష్పాలనూ ఆవేదనా శ్రువులను రెండింటినీ ఏక కాలంలో కూడా సృష్టించేదీ ... చివరకు అర్థం కాకుండా మిగిలిపోయేదీ...

తను జీవితంతో ఎన్ని సార్లు పోరా డాడని!

కానీ ఒక్కసారి కూడా గెలవ లేక పోయాడు తను.

గుండె నిండా మానని గాయాలే.

ప్రతి గాయానికీ ఓ మరపురాని కథ.

ప్రతి కథవల్లా తనకో రకమైన అను భవం.

ప్రతి అనుభవం తన జీవితం చుట్టూ కాళరాత్రులను సృష్టించింది. కన్నీటిని పుట్టించింది. నరకాన్ని చూపెట్టింది. తన హృదయంలో నిరాశ,నిస్పృహ,బాధ, వ్యథ – ఇవన్నీ స్థిర స్థావరాలను ఏర్ప రచుకొని సుఖశాంతులను హృదయావర ణంలోకి రానివ్వకుండా తరిమికొట్టాయి.

'ఈ ప్రపంచాన్ని నమ్మకండి. అది మనం కోరుకొన్నదానినెప్పుడూయివ్వదు' అని 'లోక్' చెప్పిన మాటలు నిజమే. ఈ ప్రపంచాన్ని నమ్మి తను ఏమీ పొందలేక పోయాడు.

జీవితంలో తను సంపాదించుకొన్నది ఒక్క ప్రసాద్ స్నేహమే.

ప్రసాద్‌కి తనంటే ఎంత అభిమానం? తను జ్వరంలో పడినప్పుడు...అమృత విషయం తెలిసి తను ఆందోళ చెంది నప్పుడు ఎంత ఓదార్చాడు?

హరిబాబు మనస్సు గతం వేపు పరుగు తీసింది.




అయిదు సంవత్సరాల క్రితం ఇంటర్మీడి యట్ చదివే రోజుల్లో...

హరిబాబు, ప్రసాద్, ఆనంద్ ముగ్గురూ హాస్టల్లో రూంమేట్స్.

పరీక్షలు దగ్గరపడుతున్నాయి.

కొందరు గదులలో కూర్చొని సీరియస్‌గా చదువుకొంటున్నారు. మరి కొందరు ఆ పరీక్షలకూ తమకూ ఏమీ సంబంధంలేనట్లుగా తలుపులు బిడాయించు

కొని పేకాటలో మునిగిపోయి ఉన్నారు. ఇంకొంత మంది పరీక్షలలో కాపీకొట్టడానికి అనువుగా స్లిప్స్ రాసుకొంటుంటే మరికొందరు గైడ్స్‌లోని పేజీలను బ్లేడ్‌తో కట్ చేసుకొని జాగ్రత్తగా దాచుకొంటున్నారు.

కొందరు విద్యార్థులు వారం క్రితం విడుదలైన తమ అభిమాన హీరో సినిమాకు ఏరోజు ఎంతవసూలుఅయ్యిందీ, ఎన్ని ఆటలు హౌస్‌ఫుల్ అయ్యిందీ, ఆ సినిమాలో ఏయే సన్నివేశంలో తమ హీరో అద్భుతంగా నటించిందీ చెప్పుకొంటున్నారు. ఆ హీరో అంటే గిట్టని మరికొందరు ఆ సినిమా ఎందుకు బాగలేదో వివరించి చెబుతున్నారు.

హరిబాబు ఇవేమీ పట్టించుకోవడం లేదు.

తన గదిలో కూర్చొని పట్టుదలగా చదువుకొంటున్నాడు.

తను మంచి మార్కులతో పాసై మెడిసిన్‌లో చేరాలి. అదే హరిబాబు ఆశయం.వాళ్ళనాన్న కూడా హరిబాబును డాక్టర్‌కోర్సు చదివించాలని ఉన్నాడు. అందుకే కష్టపడి చదువుతున్నాడు.

అతడికి ఒంట్లో నలతగా ఉంది. రాత్రుల్లో ఎక్కువ మేల్కోవడం వల్లా కళ్ళు పీక్కుపోయాయి.

ఆ సాయంత్రానికల్లా జ్వరంవచ్చింది. ఇక చదవడం సాధ్యపడలేదు "మరీ అంతగా మేల్కొని చదవకుంటే కొంపలేం మునిగిపోయాయి?" అంటూ బజారు నుంచి తీసుకొచ్చిన టాబ్లెట్స్‌ను అందించాడు ప్రసాద్.

"వచ్చే సంవత్సరం నేను మెడిసిన్‌లో చేరాలి" అన్నాడు హరిబాబు

"మెడిసిన్‌లో చేరాలంటే ఆరోగ్యం చెడిపోయేలా చదవాలా?"

"లేకుంటే మంచి మార్కులురావు"

"అయినా ఇంత కష్టపడి రాత్రింబవళ్ళు చదవాల్సిన పనిలేదు. ఎటూ మెడిసిన్‌కు ఎంట్రెన్స్ ఉందిగా? ఆ ఎంట్రెన్స్‌కు కష్టపడి చదువుచాలు" లుంగీ కట్టుకొంటూ చెప్పాడు ప్రసాద్.

మరుసటి రోజుకల్లా హరిబాబుజ్వరం తీవ్రస్థాయి చేరుకోవటంతో డాక్టర్ దగ్గరికి తీసుకెళ్ళారు. ఏవో , ఇంజక్షన్స్ ఇచ్చి కొన్ని మందులు రాసిచ్చి ఏవి ఎప్పుడెప్పుడు మింగించాలో వివరంగా చెప్పాడు డాక్టర్.

ఆరోజు నుండి హరిబాబు ఆరోగ్యాన్ని చాలా జాగ్రత్తగా కనిపెడుతున్నాడు ప్రసాద్. రెండురోజులకోసారి డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళడం మందులు తీసుకొచ్చి, టైం ప్రకారం వాటిని హరిబాబు చేత బలవంతగా మింగించడం, బజారు నుండి రొట్టె పాలు పళ్ళు ఇవన్నీ కొనుక్కురావడం ఇలా సపర్యలు చేస్తున్నాడు ప్రసాద్.

ప్రసాద్ తనకోసం పడే పాట్లన్నీ గమనిస్తున్నాడు హరిబాబు.

రోజులు గడుస్తున్నాయి.

పరీక్షలు మరీ దగ్గర పడుతున్నాయి.

తనవల్ల ప్రసాద్ చదువు చెడిపోతోంది.

తను ఈ ఏడు పరీక్షలు రాస్తే తప్పవచ్చు. లేదా తక్కువ మార్కులతో పాస్ కావచ్చు. కానీ తనకు మెడిసిన్‌లో సీటు రాదు. కనీసం మెడిసిన్‌కు ఎంట్రన్స్ రాయడానికి కూడా అర్హతలేనన్ని తక్కువ మార్కులు వస్తాయి. అందుకే ఈ ఏడు తను పరీక్షలు రాయడం మానుకోవాలి. ఇంటికి వెళ్లిపోవాలి. హాస్టల్లోంచి





తను వెళ్ళిపోతేగాని ప్రసాద్‌కు చదువు సాగదు.

"ప్రసాద్!" పిలిచాడు హరిబాబు.

పుస్తకంలోంచి తలెత్తి ఏమిటన్నట్టు చూశాడు ప్రసాద్.

"నేను రేపు మా ఊరెళ్ళిపోదామనుకుంటున్నాను"

"ఇప్పుడా? పరీక్షలు ఇంతదగ్గర్లో పెట్టుకుని"

"నేను పరీక్షలు వ్రాయడంలేదు"

"పిచ్చిగానీ పట్టిందా నీకు!"

"నీకు తెలియదు ప్రసాద్! ష్యూర్‌గా ఈ ఏడు ఫెయిల్‌కాను"

"అని నువ్వనుకొంటున్నావు అంతే"

"లేదు ప్రసాద్! నీకు తెలియదు"

"నాకంతా తెలుసుగానీ నోరు మూసుకొని చదువుకో"

"చదవను. నా వల్ల కావడంలేదు"

"అయితే హాయిగా పడుకో" అన్నాడు ప్రసాద్.

"అటు ఇంటికీ వెళ్ళకుండా యిటు ఇక్కడ చదువుకోకుండా నేనెందుకు ఇక్కడ?"

ప్రసాద్ బదులు చెప్పలేదు.

ఆ గదిలో రెండు క్షణాలు నిశ్శబ్దం.

"చూడు హరీ! కొంతమంది తమను తామే చాలా తక్కువగా అంచనా వేసుకొంటుంటారు. అది చాలా ప్రమాదకరమైన అలవాటు. ఈ అలవాటు ఒక్కోసారి జీవితాన్ని బలమైన దెబ్బ కొడుతుంది. ఈ కారణంవల్లే చాలామంది సమర్థులు అసమర్థులైపోతుంటారు. నీ శక్తి మీద నీకు ఎప్పుడూ నమ్మకంలేదు. పైగా నీ శక్తిని తక్కువ అంచనా వేసుకొంటూ బాధపడుతుంటావు. నువ్వు ఇకనుండి పుస్తకం ముట్టుకోకుండా పరీక్షలు రాసినా నీకు తప్పకుండా ఫస్ట్‌క్లాస్ వస్తుంది. ఆ నమ్మకం నాకుంది" అన్నాడు ప్రసాద్.

తను ఊరెళ్ళిపోడానికి ప్రసాద్ ఒప్పుకోలేదు.

అలాగని తను ఈ అనారోగ్యంతో చదవలేడు.

ఏం చేయాలో హరిబాబుకు అర్థం కావడంలేదు.

ప్రసాద్ మాత్రం చాలా సీరియస్‌గా చదువుతున్నాడు.

తను చదివిన సబ్జెక్ట్సును హరిబాబుకు అర్థం అయ్యేలా 'టీచ్' చేస్తున్నాడు. వీలైనప్పుడల్లా హరిబాబుచేత అంతో యింతో చదివిస్తున్నాడు.

కానీ హరిబాబులో తీవ్రమైన అలజడి... ఆందోళన.

తనకు ఏవీ గుర్తుండడంలేదు.

తనకు మంచి మార్కులు రావేమో?

మెడిసిన్‌లో సీటు రాదేమో...అని భయపడుతున్నాడు హరిబాబు.

* * *

ఆ రోజుతో యింటర్మీడియట్ పరీక్షలైపోయాయి.

బాగా రాసినవాళ్లు సంతోషంగా సినిమాలకు వెళుతున్నారు. సరిగా రాయని విద్యార్థులు ఆ క్వొశ్చన్ పేపర్స్‌ను సెట్ చేసిన లెక్చరర్స్‌ను బండ బూతులు తిడుతున్నారు.

మొత్తానికి విద్యార్థులు అప్పుడే విడుదలైన ఖైదీలలాగా హాయిగా గాలి పీల్చుకొంటున్నారు.

కాలేజీనుండి రూంకు చేరుకున్నాడు హరిబాబు.

తనకు మంచి మార్కులు వస్తాయనే నమ్మకం లేదతనికి.

తను ఏం రాశాడో తనకే అర్థంకావడం లేదు.

"అయితే హరీ! క్లాస్ రాదంటావా నీకు?" ఫాన్ స్పీడు పెంచుతూ అడిగాడు ప్రసాద్.

"లాభంలేదు ప్రసాద్"

"పోనీ సెకండ్ క్లాసైనా"

"పాస్ మాత్రం అవుతాను"

"నువ్వెప్పుడూ అలాగే మాట్లాడుతావులేవోయ్. నాకు తెలుసు నీకు తప్పకుండా మంచి మార్కులే వస్తాయి"

"ఇంతకూ నీ విషయం చెప్పుమరి" అడిగాడు హరిబాబు.

"పర్వాలేదు బాగానే రాశాను"

"తర్వాత ఏం చేద్దామనుకొంటున్నావు?"

"నీకు తెలుసుగా నాకు ఇంగ్లీష్ లిటరేచర్ అంటే చాలా యిష్టమని. అందుకే బి.ఏ. ఇంగ్లీష్ లిట్ లో చేరాలనుకుంటున్నాను"

ఇంతలో చాకలి బట్టలు తీసుకొచ్చాడు.

బట్టలు లెక్క పెట్టుకుని వాడికి ఇవ్వవలసింది ఇచ్చి పంపించేశారు.

"సార్!"

తలెత్తి వాకిలివేపు చూశాడు హరిబాబు.

ఎదురుగా హాస్టల్ మెస్‌లో సర్వర్ శివుడు కన్పించాడు.

"ఏమిట్రా శివా! యిలా వచ్చావ్?"

చెప్పడానికి తటపటాయించాడు శివుడు.

"ఏమిటో చెప్పరా బాబూ!"

"మీరు ఊరెళ్ళిపోతున్నారా సార్?"

"చదువైపోయిందిగా వెళ్ళక తప్పుతుందా?"

"సార్! మీరు వెళ్ళేటప్పుడు ఏదైనా మీది పాత చొక్కా ఉంటే ఇచ్చివెళ్ళండి సార్!" హరిబాబు వేపు దీనంగా చూస్తూ అడిగాడు శివుడు.

హరిబాబు వాళ్ళు శివుడిచేత చిన్నచిన్న పనులు చేయించుకుంటూ ఉండేవాళ్ళు. అర్జంటుగా ఉంటే వాళ్ళకి బట్టలు ఉతికి యిచ్చేవాడు. మెస్‌కు కొంచెం ఆలస్యంగా వచ్చినా వాళ్ళకోసం భోజనం ఎత్తిపెట్టేవాడు. పోస్టాఫీసుకెళ్ళి కవర్స్ తెచ్చి యిచ్చేవాడు.

"పాతబట్టలు ఎక్కడో సూట్‌కేస్ లోపల ఉన్నాయిరా శివా! నేను రేపు ఉదయం ఊరెళ్ళిపోతాను. సాయంత్రం వచ్చి ఓసారి కనబడు. ఓ షర్టూ పాంటూ ఇస్తాను" అన్నాడు హరిబాబు.

"అలాగే సార్" అంటూ వెళ్ళిపోయాడు శివుడు.

* * *

సాయంత్రం.. గోధూళి వేళ..

ఇంటిముందున్న తిన్నె మీద కూర్చుని జానకిరామయ్య, ఆ ఊరి బడిపంతులు మాధవయ్య కాఫీలు తాగుతూ కబుర్లు చెప్పుకొంటున్నారు. దీపం పెట్టడానికి శోభ ప్రత్తి వత్తులు తయారుచేస్తోంది.

"ఆ వస్తున్నది మన హరి గదూ!" అంటూ దూరంగా వస్తున్న శాల్తీని చూసి అన్నాడు మాధవయ్య.

"అవును పెదనాన్నా! అన్నయ్య వస్తున్నాడు" అంది శోభ.

వస్తున్న కొడుకును తృప్తిగా చూస్తున్నాడు జానకిరామయ్య.

"ఏరా! మధ్యాహ్నం లోపల వచ్చేస్తానని ఉత్తరం రాశావు. మరి ఇంత ఆలస్యం అయిందేమిటి?" అనడిగాడు దగ్గరకు రాగానే.

"కాస్త పని ఉండడం వల్ల లేట

యింది నాన్నా!"

"ఇంతకూ పరీక్షలు బాగా రాశావా హరీ?" పంతులు అడిగాడు.

"లేదు మాస్టారూ! అనుకొన్నంత బాగా రాయలేకపోయాను"

"ఎందుకని?"

"ఆ టైంలో ఆరోగ్యం దెబ్బతిన డంతో సరిగా రాయలేకపోయాను" అంటూ సూట్ కేస్ తీసుకొని ఇంట్లోకి నడిచాడు హరిబాబు.

అతని వెంటే శోభ కూడా వెళ్లింది.

"అబ్బా! ఇప్పుడా రావడం? నీకోసం ఉదయం నుండి ఎప్పుడొస్తావా అని మేమంతా ఎదురు చూస్తున్నాం. అన్నట్టు అన్నయ్యా! కాఫీ తాగుతావా?" అడిగింది శోభ దేవుడి పటం దగ్గర దీపం వెలిగిస్తూ.

"బాబాయి, పిన్ని అంతా బాగున్నారా?"

బాగున్నారన్నట్టు తల ఆడించింది శోభ.

"అది సరేగాని అన్నయ్యా! నువ్వు పోయినసారి వచ్చినప్పుడు గాజులు తీసుకురమ్మనిచెప్పాను. తీసుకొచ్చావా?"

"ఆఁ తీసుకొచ్చాను. లేకుంటే ప్రాణం తీసెయ్యవూ నువ్వు"

"ఏవీ?" అంది పరుగుతో వచ్చి.

"నా షర్ట్ జేబులో సూట్ కేస్ తాళా లున్నాయి. తీసుకుని సూట్ కేస్ తెరిచి చూడు"

శోభ తుపాకి గుండులా పరుగెత్తి హేంగర్‌కు వేలాడుతున్న చొక్కా జేబులో చెయ్యి పెట్టింది.

"తీసుకొన్నావా శోభా?"

"ఆ.. తీసుకొన్నాను"

"ఏవీ?"

"ఇదిగో!" అంటూ హరిబాబు దగ్గరకు వచ్చి చూపెట్టింది.

హరిబాబు చూశాడు..

అతడి గొంతులో పచ్చి వెలక్కాయ పడినట్లయింది.

శోభ చేతిలో..తెల్లగా సిగరెట్.

"అన్నయ్యా! ఈ అలవాటు నీకు ఎప్పటినుండి?"

"శోభా! ప్లీజ్ ఇటిచ్చెయ్యి. నిజంగా నాకు.. నాకు..ఆ అలవాటు లేదు"

"లేకపోతే ఇది నీ జేబులోకి ఎలా వచ్చింది?"

"అది ... అది..." నీళ్లు నమిలాడు హరిబాబు.

"నేను పెదనాన్నతో చెప్పేస్తాను" అంది శోభ.

"శోభా! నాన్నతో చెప్పకే. ఈ సారి నీకు కొత్త బట్టలు తీసుకొచ్చి ఇస్తాను"

"సరే. ఈసారికి వదిలేస్తున్నా. కానీ ఇంకోసారి మళ్ళీ నీ జేబులో కనపడిందా తప్పకుండా చెప్పేస్తాను" అంటూ ఆ సిగరెట్‌ను తీసుకపోయి మండుతున్న పొయ్యిలో పడేసింది శోభ.

"ఒరేయ్ హరీ!" అంటూ బయటి నుండి విన్పించింది తండ్రి గొంతు.

"ఏమిటి నాన్నా!" అంటూ బయటికొచ్చి అడిగాడు హరిబాబు.

"అక్కడ మీ పిన్ని పిలుస్తోంది."

జానకిరామయ్య ఆ మాట చెప్పగానే హరిబాబు పక్కనే ఉన్న శివరామయ్య ఇంటికి వెళ్లాడు.

"ఎంతసేపైందిరా వచ్చి?" అడిగాడు శివరామయ్య.

"ఇప్పుడే వచ్చాను బాబాయ్! పిన్ని ఏది?"

"వంట ఇంట్లో ఉంది చూడు."

"బాగున్నావా పిన్నీ?" అడిగాడు వంటయింట్లోకెళ్ళి.

"బాగానే ఉన్నాను నాయనా! నువ్వు వస్తావని బూరెలు చేసింది శోభ. ఇవిగో తీసుకో" అంటూ ఓ ప్లేటు తీసుకొచ్చి పెట్టింది శాంతమ్మ.

రిజల్ట్స్ వచ్చాయి. హరి సెకండ్ క్లాస్‌లో పాసయ్యాడు.

* * *

"చాలా ఆలస్యంగా ఉత్తరం రాస్తున్నందుకు క్షమించు హరీ!

కాలేజీకి అప్లైచేసి...చేరిపోయి ... చివరకు హాస్టల్లోకూడా చేరిపోయాను



నేను. ఆ హడావుడిలో నీకు ఉత్తరం రాయడానికి తీరికలేకపోయింది. తిరుపతిలో గోవిందరాజస్వామి ఆర్ట్సుకాలేజీలో బి. ఎ. ఇంగ్లీష్‌లిట్‌లో చేరానులే. నువ్వేం చేస్తున్నావో..ఎక్కడున్నావో తెలియదు. నువ్వు ఎక్కడున్నా మెడిసిన్‌కు ఎంట్రెన్స్ రాయడానికి తిరుపతి వస్తావు. అప్పుడు నన్ను తప్పకుండా కలుసుకో. నా అడ్రసు ఈ కవర్‌మీదే ఉంది. నీకు తిరుపతి మెడికల్ కాలేజీలో సీటువస్తే- నేను హాస్టల్లోంచి వచ్చేస్తాను. అప్పుడు మనం ఎక్కడన్నా ఓ గదిని అద్దెకు తీసుకొని హాయిగా ఉండవచ్చు. మీ నాన్నను, పిన్ని, బాబాయిలను అడిగినట్లు చెప్పు.



వెంటనే నీ వివరాలతో ఉత్తరం రాయి.

నీ ప్రసాద్"

ఉత్తరం చదవడం ముగించాడు హరిబాబు.

ఇంటినుండి రీడైరక్ట్ చెయ్యబడింది ఆ ఉత్తరం.

టైం చూశాడు. ఇంకా కాలేజీ బెల్ మోగడానికి ముప్పావుగంట టైముంది. ఈ లోపలే ప్రసాద్‌కు రిప్లై రాసేద్దామని పించి పేపరూ, పెన్ తీసుకొన్నాడు.

"నువ్ రాసిన ఉత్తరం అందింది.

నేను ఇక్కడే...మా ఊరికి కొద్ది దూరంలో ఉండే ఓ డిగ్రీ కాలేజీలో బి.కాం.లో చేరాను. ఇంటర్‌లో సైన్సు చదివినవాడిని డిగ్రీలో కామర్స్‌లో చేరినందుకు నీకుఆశ్చర్యంగా ఉండొచ్చు. కానీ నేను ఈ బి.కాం.ను కంటిన్యూ చేస్తా సనే నమ్మకంలేదు.

ఎందుకంటే...నా దృష్టి మెడిసిన్ మీదే ఉంది.

బి.యస్సీలో చేరబుద్ధిగాక బి.కాం.లో చేరాను. బి.కాం.ను కంటిన్యూ చేస్తూ మెడిసిన్ ఎంట్రెన్స్ రాస్తాను. ఓ వేళ సీటు రాకుంటే మళ్ళీ సంవత్సరం రాస్తాను. ఏమైనా సరే మెడిసిన్‌ను వదిలేదిలేదు. మెడిసిన్‌లో సీటువచ్చిన తక్షణం ఈ బి.కాం.ను వదిలేస్తాను.

ఇక్కడ హాస్టల్ బాగుండదు.

అందుకని బయటే అద్దెగది తీసుకోవా లనుకొంటున్నాను.

అద్దె గది దొరకగానే నేను మళ్ళీ నీకు ఉత్తరం రాస్తాను.

మెడిసిన్ ఎంట్రన్స్‌కు నాలుగురోజులు ముందే నేను తిరుపతి వచ్చేస్తాను. ఇక్కడ మాది కోఎడ్యుకేషన్. మా క్లాస్‌లో డజను మంది అమ్మాయిలున్నారు. పాపం మీకు తిరుపతిలో కోఎడ్యుకేషన్ లేదను కొంటాను. కాలేజీకి టైమైపోయింది వెళ్లాలి. ఇక శెలవు.

నీ మిత్రుడు హరిబాబు."

ఉత్తరాన్ని కవర్లోపెట్టి అతికించి పోస్టబాక్స్‌లో వేద్దామని బయలుదేరాడు హరిబాబు.

ఇంతలో కాలేజీ బెల్ మోగింది.

స్టూడెంట్స్ గబగబా క్లాస్ రూమ్స్ కెళుతున్నారు.

హరిబాబు క్లాసులో కూర్చున్నాడు.

తన మెడిసిన్ గురించే ఆలోచిస్తు న్నాడు.

"హరిబాబూ!"

"హరిబాబూ!" అంటూ గట్టిగా రెండవసారి పిలిచాడు అటెండెన్స్ తీసు కొంటున్న తెలుగు లెక్చరర్.

"యస్సార్" అంటూ లేచి నిలబడి తడబడుతూ చెప్పాడు – అంతవరకు పర ధ్యానంలో ఉన్న హరిబాబు.

క్లాసులో అందరూ తననే చూస్తు న్నారు.

"ఏం బాబూ! బోధి వృక్షం కింద ధ్యానంలో మునిగిపోయిన సిద్ధార్థుడిలా మౌనంగా కూర్చున్నావు. ఇటు చూడు నాయనా! నువ్విలా ధ్యానంలో మునిగి పోతే సిద్ధించేది జ్ఞానోదయం కాదు చీవాట్లు. ఎందుకంటే నువ్వా సిద్ధార్థుడివి కాదు. ఈ క్లాస్‌రూం బోధి వృక్షమూ కాదు" చీవాట్లు పెట్టాడు లెక్చరర్.

ఫక్కుమని నవ్వింది పక్కవరుసలో కూర్చున్న ప్రవీణ.

హరిబాబుకు ఆ నవ్వు చూసి ఒళ్ళు మండిపోయింది.

ఆరోజు చాలా అవమానంగా ఫీల్





అయ్యాడు.

అసలు తను ఇంతవరకు ఏ క్లాసు లోనూ ఇలా తలవంచుకొని నిలబడే పరిస్థితిని తెచ్చుకోలేదు.

ఏ అమ్మాయీ తనను చూసి ఇలా నవ్వలేదెప్పుడూ.

హరిబాబుకు అసలే సెన్సిటివ్‌నెస్ ఎక్కువ.

చిన్న విషయానికే పెద్దగా బాధపడి పోయే రకం గనుక జరిగిన ఆ చిన్న విషయం. అతని మనసుకు ముల్లులా గుచ్చుకొంది.

ఒక్కరు తనను ఒక్క మాటన్నా సహించడతడు.

అనవసరంగా ఎవరినీ పల్లెత్తుమాట కూడా అనడు.

అసలు క్లాసులో ఏ అబ్బాయో, అమ్మాయో లేచి నిలబడి లెక్చరర్ చేత తిట్లు తింటుంటే ఆ వ్యక్తిని చూసి సంస్కారం ఉన్నవాళ్లెవ్వరూ నవ్వరు.

ఆ సాయంత్రం కాలేజీ వదిలాక...

లైబ్రరీవేపు మెల్లగా నడుస్తున్నాడు హరిబాబు.

అప్పుడే ప్రవీణ తన ఫ్రెండ్స్‌తో లైబ్రరీలోంచి వస్తోంది.

"ప్రవీణ గారూ!" పిలిచాడు హరిబాబు.

నడుస్తున్న ప్రవీణ టక్కున ఆగి పోయింది.

హరిబాబు మెల్లగా ప్రవీణ దగ్గరికి నడిచొచ్చాడు. ఉదయం క్లాసులో ఆ అమ్మాయి నవ్విన నవ్వు అతని గుండెలపై కారం చల్లినట్లుగా ఇంకా మండుతూనే ఉంది. ఆ అమ్మాయిని తను తిడితే గానీ ఆ మంట చల్లారదు.

"మీకో విషయం తెలుసా?" అన్నాడు హరిబాబు.

"ఏమిటండీ?" కొత్త విషయం చెబుతాడేమోనని ఆసక్తిగా అడిగింది.

"ఒకరిని చూసి మనం ఫక్కుమని నవ్వినప్పుడు మనకున్న అందమైన పలువరుసేకాదు మనం అలవరచుకొన్న సంస్కారం కూడా ఒక్కోసారి కన్పిస్తుంది ఎదుటివాళ్ళకు" అనేసి వెళ్ళిపోయాడు హరిబాబు.

ప్రవీణ ముఖం అవమానంతో కందగడ్డలా అయిపోయింది.

హరిబాబు ఆమాట ఎందుకన్నాడో ప్రవీణకు తెలుసు.

ప్రవీణతో పాటు అక్కడున్నవాళ్ళ క్లాసమ్మాయిలకూ తెలుసు.

అందరి ముందు జరిగిన అవమానాన్ని భరించలేకపోయిందామె.

ఆ మరుసటి రోజు ఉదయం...

కాలేజీకి టైమైపోవడం వల్ల గబగబా నడిచి కాలేజీ ఆవరణలోకి ప్రవేశించాడు హరిబాబు. అక్కడ వరుసగా క్లాస్‌రూమ్స్ కట్టబడి ఉన్నాయి. అక్కడ..దారి దక్షిణంగా వెళ్లిపడమరకు మలుపు తిరుగుతుంది. ఆ మలుపు దగ్గరనుండి క్లాస్ రూమ్స్ కట్టబడి ఉండడంచేత అటువేపు నుండి వచ్చేవాళ్లు యివతలివేపు నున్న వాళ్లకు గానీ.. ఇవతలివేపు నుండి వచ్చేవాళ్లు అవతలి వేపునున్న వాళ్లకు గానీ కన్పించరు. ఆ దారి కూడా విశాలంగా లేకుండా సన్నగా, ఇరుకుగా ఉంది.

దక్షిణం వేపు నడిచి గబగబా పడమర వైపుకు తిరిగాడు హరి.

అంతే...ఆ తొందరలో ఎదురుగా వచ్చే అమ్మాయిని ఢీకొట్టాడు.

ఆ అమ్మాయి చేతిలోని బుక్స్ జారి కిందపడ్డాయి.

"సారీ ప్రవీణగారూ! మిమ్మల్ని చూడలేదు. క్లాస్‌కు టైమైపోతుందన్న తొందరతో......" అంటూ నేలమీది బుక్స్‌ను ఎత్తి అందించాడు హరి.

"యూ...బ్రూట్" అంటూ చెంప ఛెళ్లుమన్పించింది ప్రవీణ.

స్థాణువైపోయాడు హరిబాబు.

"ఏం జరిగింది ప్రవీణా?" అంటు బిలబిలా వచ్చారు ఆమె ఫ్రెండ్స్.

"ఏమీ లేదు.. మీద పడ్డాడు"

"పాపం కళ్లు కన్పించలేదేమో" అద్దాలు పెట్టుకొన్న అరుణ కామెంట్.

"మన ప్రవీణ ఒకమంచి రోస్ట్ అందించినట్లుంది. ఇకనుండి కళ్లు బాగా కన్పిస్తాయిలేవే" అంది సీత వెకిలినవ్వుతో.

"ఈ దెబ్బతో మన సిద్ధార్థుడికి జ్ఞానోదయం కలిగినట్లేనా?" సన్నగా చీపురుపుల్లలాగా ఉండే భారతి అందించింది.

"మనదెబ్బతో అది సిద్ధించినట్లే మరి" ప్రవీణ అంది.

"ఇదిగో చూడండి స్వామీజీ! ఆడవాళ్ళ దగ్గర ఒళ్ళు మరచిపోయి ప్రవర్తిస్తే ఇదిగో యిలాగే గుర్తు చేస్తారనే సత్యాన్ని మీ సిద్ధాంతాలలో చేర్చుకొని శిలా శాసనం కావించండి"

"ఇక చాలులేవే పాపం అబ్బాయి గారు షాక్‌లోంచి తేరుకోలేదు"

ఇలా రకరకాలుగా మాట్లాడి నవ్వుకొంటూ వెళ్లిపోయారు వాళ్లు.

హరిబాబు బెల్లం కొట్టిన రాయిలా నిలబడిపోయాడు.

ఓ అమ్మాయి.. హరిబాబుకు ఎదురుగా.. దూరంగా నిలబడి జరిగిన తతంగాన్నంతా గమనించి అతడి దగ్గరకు మెల్లగా వచ్చింది.

ఆమె వేపు చూశాడు హరిబాబు.

ఆమె అతడిని చాలా జాలిగా... జరిగిన దాంట్లో నీ తప్పేమీ లేదన్నట్లుగా చూస్తోంది.

"పరిస్థితి చూస్తుంటే నాకు చాలా బాధగా ఉంది" అందామె.

హరిబాబు ఏమీ మాట్లాడలేదు.

"మనక్లాస్‌రూంను రెండో అంతస్తులోకి మార్చారు పదండి" అంది ఆ అమ్మాయి. ఆ అమ్మాయి అమృత. హరిబాబు క్లాస్‌మేట్.

మళ్ళీవచ్చినదారినే నడిచాడు హరిబాబు.

"మనకు ఫస్టవర్ లేదు అమృతా! ఇంగ్లీషు లెక్చరర్ శెలవు పెట్టాడట" వరండాలో ఎదురుపడి చెప్పింది నీరజ.

హరిబాబు వెనుదిరిగి లైబ్రరీవేపు నడక సాగించాడు.

అప్పటికే అవమానంతో అతని హృదయం కుంచించుకుపోయివుంది.

తల మొద్దుబారిపోయింది.

"హరిబాబుగారూ!"

తల తిప్పి చూశాడు హరిబాబు.

అక్కడ కిషోర్, ఇంకా నలుగురైదుగురు అబ్బాయిలు నిలబడి ఉన్నారు. తనను రమ్మన్నట్టుగా సైగ చేశారు. వాళ్ళందరూ హరి క్లాస్‌మేట్స్.

కిశోర్ మంచివాడే కానీ...ఆవేశం ఎక్కువ. క్లాసులో అల్లరి చెయ్యడంలో అతనిదే పైచేయి. అమ్మాయిలను బాగా ఏడ్పిస్తుండేవాడు. నీరజ అన్న. ధనవంతులబిడ్డ, పలుకుబడి ఉన్నవాడు కావడంతో అతడు చేసే అల్లరిని ఎవరూ పట్టించుకొనేవాళ్లుకాదు.

హరిబాబు వాళ్ళ దగ్గరికొచ్చాడు.

"హరిబాబుగారూ! ఇవాళ మీకు జరిగిన అవమానానికి మేము చాలా బాధ పడుతున్నాం" కిశోర్ అన్నాడు.

"మీకు ఆ విషయం..."

"నీరజ చెప్పిందిలెండి. ఆ ప్రవీణను మొదటినుంచి చూస్తున్నాను. ఆవిడకు మహా తలబిరుసు."

"పోనీలెండి కిశోర్‌గారూ! తప్పు నాదేగా"

"అది మీ తప్పు ఎలా అవుతుందండీ? మీరేం కావాలని ఆ అమ్మాయిని ఢీ కొన్నారా? ఏదో కాకతాళీయంగా జరిగి పోయింది"

"పోనీలెండి!పడ్డవాళ్ళెప్పుడూ చెడ్డవాళ్లు కాదుగా"

ఇంతలో ఫస్టవర్ అయిపోయినట్లు బెల్ మోగడంతో అందరూ క్లాస్‌రూం వేపు నడక సాగించారు.

సెకండ్అవర్ ప్రారంభమైంది.

లెక్చరర్ ఏవో లెక్కలు చెబుతున్నాడు.

కానీ...అవేమీ హరిబాబు బుర్రకు ఎక్కడంలేదు. అంతకు క్రితం జరిగిన సంఘటన చుట్టే అతని ఆలోచనలు పరిభ్రమిస్తున్నాయి. కనీసం...చిన్నప్పుడు తల్లిదండ్రుల చేతనైనా దెబ్బతిని ఎరుగడతడు. వాళ్ళ నవ్వులు...వెకిలి మాటలు అతని గుండెను అగ్నికణాల్లా తాకుతున్నాయి.

"హరిబాబూ! యు యిడియట్ గెటప్" సింహగర్జన లాగా ప్రతిధ్వనించింది లెక్చరర్ కంఠం క్లాస్‌రూంలో.

బిత్తరపోయి లేచి నిలబడ్డాడు హరిబాబు.

"ఏమిటి నువ్వు చేసిన పని?" గట్టిగా అడిగాడు లెక్చరర్.

హరిబాబు పరిస్థితి అయోమయంగా ఉంది.

"మీరంటున్నదేమిటో నాకు అర్థం కావటంలేదు సార్" అంటూ క్లాస్ రూంను పరిశీలనగా చూశాడు హరిబాబు.

అక్కడ అమ్మాయిల వరుసలో ప్రవీణ లేచి నిలబడి ఉంది.

ఆమె ముఖం అవమానంతో కంది పోయి ఉంది.

ఆమెచేతిలో చుట్టబడిన పెద్ద కాగితపు ఉండ ఉంది.

పరిస్థితి ఏమిటో వెంటనే అర్థమై పోయింది హరిబాబుకు. "నీకు సరసాలాడాలని అంత ఇష్టంగా ఉంటే ఓసారి బజారుకెళ్లు. అక్కడ వేరే ఆడవాళ్లు దొరుకుతారు"

లెక్చరర్ ఆ మాట అనగానే క్లాసు గొల్లుమంది.

హరిబాబు అభిమానం బుడగలా చిట్లిపోయింది. "అలాగా! అలాంటి ఆడవాళ్ల విషయాలు నాకు మాత్రం బొత్తిగా తెలియవండీ"

ఆ మాటతో అందరూ పకపక నవ్వారు.

"వాట్ ఎ ఫెంటాస్టిక్ డైలాగ్ యిట్ ఈజ్!"వెనక బెంచిలో కూర్చున్న కిశోర్ బృందంలో ఎవరో అన్నారు.

"సైలెన్స్" అంటూ గట్టిగా అరిచాడు.

"ఆ కాగితం ఉండను ఆ అమ్మాయి పైకి ఎందుకు విసిరినట్టు?" అడిగాడు లెక్చరర్ చాలా సీరియస్‌గా ముఖంపెట్టి.

"అంత ఖచ్చితంగా చెబుతున్నారు. నేను విసరడం మీరు నిజంగా చూశారా?"

ఎదురు ప్రశ్న వేశాడు హరిబాబు.

"నేను...నేను...చూడలేదు. ప్రవీణ నీమీదే చెబుతోంది"

"ఇప్పుడు నేనూ చెబుతున్నాను. నేను కాదని"

"కానీ నువ్వు ఆఉండను విసురుతుంటే క్లాస్‌లో చూసిన వాళ్లున్నారు.

"వాళ్లెవరో చెప్పమనండి సార్"

"నేను చూసానుసార్" అంటూ అద్దాలు పెట్టుకొన్న అరుణ పైకిలేచి సాక్ష్యం చెప్పింది.

"బాహుశా దృష్టిలోపం వల్ల అలా కన్పించి ఉండొచ్చు"

హరిబాబు ఆ మాట అనగానే క్లాసు గొల్లుమంది.

"కనుపాప కరువైన బతుకెందుకూ" అంటూ వెనకనుంచి ఎవరో ఓ గడుగ్గాయి పాడడంతో క్లాసంతా విరగబడి నవ్వింది..

అరుణ అవమానంతో తలదించుకొని కూర్చుంది.

"సార్! నేను నిజం చెబుతున్నాను. ఆ కాగితం ఉండను నేను విసిరెయ్యలేదు. ఇది నిజం. నమ్మకపోతే నేనేమీ చెయ్యలేను"

"కానీ.. నేను చెయ్యగలను" లెక్చరర్ అన్నాడు.

"ఏమిటి?"

"ప్రిన్స్‌పాల్‌తో చెప్పి నిన్ను సస్పెండ్ చెయ్యడం"

నిర్ఘాంతపోయాడు హరిబాబు.

తను సస్పెండు కావడమా?

"సార్!" అంటూ పైకి లేచి నిలబడ్డాడు కిశోర్.

ఏమిటన్నట్టు చూశాడు లెక్చరర్.

"ఆ కాగితం ఉండ విసిరింది నిజానికి హరిబాబు కాదు సార్"

"ఇంకెవరు?"

"నేనే సార్" చెప్పాడు కిశోర్.

"నువ్వా? ఎందుకు విసిరావు?"

"నేనేం కావాలని ఆ అమ్మాయి మీదికి విసరలేదు"

"మరి...?"

"కిటికీ గుండా వెలుపలికి పారేద్దామని విసిరాను. అది గాలికి ఇటు తిరిగి ఆ అమ్మాయికి తగిలింది"

'ఇప్పుడేమంటారు?' అన్నట్టుగా చూశాడు హరిబాబు ఆ లెక్చరర్ వేపు. లెక్చరర్ ముఖం మాడ్చుకొన్నాడు.




మరుసటి రోజు...

హరిబాబు కాలేజికి వెళ్ళలేదు.

అంతవరకు అతడు తెలిసిన వాళ్ళ ఇంట్లో ఉంటూ కాలేజికి వెళ్ళేవాడు. కానీ ఏమైనాసరే ఆ రోజంతా తిరిగి గది సంపాదించాలనుకొన్నాడు. ఉదయం లేచింది మొదలు పదిగంటలవరకు వేటసాగించాడు. కానీ ఎక్కడా గది దొరకలేదు. కొందరు స్టూడెంట్స్‌కు ఇవ్వమని చెప్పేశారు. విసిగిపోయి పదకొండు గంటలకు బస్‌స్టాండ్ కేసి నడిచాడు.

ఓ టీకొట్టులో కూర్చొని టీ తాగుతూ

అద్దెగది ఎక్కడైనా దొరుకుతుందేమోనని ఆ కొట్టువాడిని అడిగాడు హరిబాబు.

ఆ కొట్టువాడు అక్కడ దగ్గరలో ఉండే ఓ వీధిని చూపెట్టి ఆ వీధిలో పచ్చ రంగుగల మిద్దెమీద అడిగి చూడమని చెప్పాడు. కొట్టువాడికి మనసులోనే కృతజ్ఞతలుచెప్పి కొట్టులోంచి బయటపడ్డాడు హరిబాబు.

"హరిబాబుగారూ!"

పిలిచింది ఎవరా అని చూశాడు హరిబాబు.

బుక్స్ చేతిలో పట్టుకొని నవ్వుతూ వస్తోంది అమృత.

"ఇవాళ మీరు కాలేజీకి రాలేదేమిటి?" అడిగింది అమృత.

"కాస్త పని ఉండడంచేత రాలేకపోయాను"

"అయినా ఇవాళ కాలేజీ లేదులెండి"

"ఎందుకని?" అడిగాడు హరిబాబు.

"స్టూడెంట్స్ ఏదో సమ్మె చేస్తున్నారండి"

"అలాగా...!అదేమిటి మీరు నడిచి వస్తున్నారు? టౌన్‌బస్ రాలేదా?" ప్రశ్నించాడు.

"అది ఇవాళ రెస్ట్ తీసుకొందిలెండి. దానికెప్పుడూ రిపేరే. అసలా బస్సులో వెళుతుంటే దిగేవరకు నమ్మకం ఉండదండి. అప్పుడప్పుడూ ఆక్సిడెంట్ కూడా అవుతూ ఉంటుంది. వస్తానండి ఒక ఫ్రెండు ఇంటికి వెళ్లాలి" అంటూ వెళ్ళిపోయింది అమృత.

టీ కొట్టువాడు చెప్పిన ఆ ఇంటి ముందు నిలబడ్డాడు హరిబాబు.

ఆ ఇంటి వాకిలి దగ్గర ఎవరో ఆడ మనిషి నిలబడి ఉంటే –

"ఏమండీ! ఇక్కడ ఖాళీరూమ్ ఏమైనా ఉందా?" అనడిగాడు.

"లేదు నాయనా! ఒక రూమ్ ఉంటే నిన్ననే ఇచ్చేశాం. ఆఇంట్లో అడిగిచూడు" అని ఎదురింటిని చూపెట్టి లోపలికి వెళ్ళిపోయిందామె.

ఆ ఇంటి దగ్గరికి వెళ్లి అడిగాడు హరిబాబు.

స్టూడెంట్స్‌కు రూమ్ ఇవ్వటానికి తటపటాయించే సుభద్రమ్మకు హరిబాబును చూడగానే ఏ సదభిప్రాయం కల్గిందోగానీ రూమ్ ఇవ్వడానికి ఒప్పుకొంది.

"నువ్వు ఒక్కడివే ఉంటావా లేకుంటే ఇంకా ఎవరైనా గదిలో చేర్చుకొంటావా అబ్బాయ్?" అనడిగింది సుభద్రమ్మ.

"లేదండి. రూంలో నేను ఒక్కణ్నే ఉంటాను" వినయంగా బదులు చెప్పాడు హరిబాబు.

"సరే! రూమ్ చూద్దువుగానీ రా!" అంటూ ఆమె మేడపైకి నడిచింది.

ఆమెను అనుసరించాడు హరిబాబు.

మేడమీద ఒకే గది. ఆ గదికో కిటికీ. పుస్తకాలు పెట్టుకోడానికి ఓ షెల్ఫ్. గది చాలా శుభ్రంగా ఉంది. హరిబాబుకు నచ్చిందా గది.

"అన్నం నువ్వే వండుకొంటావా?"

"అబ్బే లేదండి. హోటల్లో తింటాను."

"చూడు బాబూ! ఇది ఆడవాళ్లుండే ఇల్లు. నువ్వు మీ ఫ్రెండ్స్‌ను ఇక్కడకు ఎక్కువగా తీసుకురావడం గానీ, వాళ్లు ఇక్కడికొచ్చి గలాబా చెయ్యడం గానీ జరగకూడదు"

"అలాగేనండి"

ఇంకా ఆవిడ ఎన్నెన్నో నిబంధనలను చెప్పింది. అన్నిటికీ తల ఆడించాడు హరిబాబు. బాత్‌రూమ్, లావెట్రీ కింద

ఉన్నాయి. ఇంట్లో వాళ్లకి వేరే లేవు. అందరికీ అవే. మోటార్ వదిలితే బాత్ రూమ్‌లోకి నీళ్లు దూకుతాయి. సౌకర్యాలు బాగానే ఉన్నాయనిపించింది.

అడ్వాన్స్ ఇచ్చేశాడు హరిబాబు.

"రేపు ఉదయం లగేజి తీసుకొచ్చేస్తానండి" అని చెప్పి వచ్చేశాడు.

ఆ మరుసటిరోజు కాలేజీ శలవు.

ఉదయమే తన లగేజి తీసుకొని ఆ మేడమీది గదిలో చేరిపోయాడు హరిబాబు.

అతడి మనసు ఇప్పుడు తేలిగ్గా ఉంది.

ఇక తను ఈ రూంలో హాయిగా మెడిసిన్ ఎంట్రన్స్‌కు ప్రిపేర్ కావచ్చు.

ఎలాగైనా కష్టపడి చదివి మెడిసిన్ సీటు సంపాదించాలి.

తను డాక్టర్ కావాలి.

ఈ కాలేజీలో చేరి ఎక్కువ రోజులు కూడా కాలేదు.

అప్పుడే తనకో అనుభవం.

ప్రవీణకు తను చేసిన అన్యాయమేమిటి? తనను ఎందుకిలా శత్రువులా చూస్తోంది? పొరపాటుగా ఢీ కొట్టినందుకు సారీ చెప్పినా విన్పించుకోకుండా చెంప చెళ్లుమన్పించింది. ఆ కాగితం ఉండ తను విసరకపోయినా తానేవిసిరినట్లులెక్చరర్‌కి చెప్పింది. ఎందుకిలా ప్రవర్తిస్తోంది? తలబిరుసుతనమంటే ఇదేనా? కనీసం ఆ అమ్మతకున్న సంస్కారం కూడా ప్రవీణకు లేకపోయింది. అమ్మాయిలు

ఏదిచెప్పినా నమ్మే సే స్థాయికి దిగజారారు లెక్చరర్స్ కూడా.

రిస్ట్‌వాచ్‌ను చూశాడు హరిబాబు.

మధ్యాహ్నం ఒంటిగంట కావస్తోంది.

ముఖం కడుక్కొని భోజనానికి వెళ్దామని సోపూ, టవలూ తీసుకొని మేడమీది నుండి దిగి బాత్‌రూంలో కొచ్చాడు హరిబాబు.

బాత్‌రూంలో...టబ్‌లో నీళ్ళులేవు.

"ఏమండీ" మోటార్ వదలమని చెప్పడానికి వాకిలి దగ్గర నిలబడి ఇంట్లో వాళ్ళను పిలిచాడు హరిబాబు.

లోపలి నుండి ఎటువంటి బదులూ లేదు.

వంట యింట్లోంచి పాత్రల శబ్దాలు వినిపిస్తున్నాయి.

లోపలికి వెళ్ళి పిలుద్దామనుకొన్నాడు.

కానీ ఆ గదిలో చేరి ఒక్కరోజు కూడా పూర్తిగాకనే అలా చనువుగా ఇంట్లోకి వెళ్ళిపోవడం సభ్యత కాదన్పించింది.

అందుకే బయటినుండి మళ్ళీపిలిచాడు.

"ఎవరూ? అంటూ ఓ అమ్మాయి బయటికొచ్చింది.

ఆ అమ్మాయిని చూడగానే ఆశ్చర్యపోయాడు హరిబాబు.

"అరె...మీరా?" అంది హరిబాబును చిత్రంగా చూస్తూ.

"అమృతగారూ! మీరు ఇక్కడ..."

"ఇది మా ఇల్లేనండి" అంది అమృత.

"అలాగా! నేను ఇక్కడ మేడమీద రూంలో అద్దెకు..."

"అయితే ఆ రూంలో దిగింది మీరేనన్నమాట"

"అవునండి. ముఖం కడుక్కొందామని వస్తే బాత్‌రూంలో వాటర్ లేదు. మోటర్ వదలమని చెబుదామని..."

"వదులుతానులెండి. అన్నట్టు మీరు హాస్టల్లో చేరలేదా?"

"లేదండి. హాస్టల్ బాగుండదని ఎవరో అన్నారు"

"ఇంతకూ మీ సొంత ఊరేది?" అడిగింది అమృత,

"దగ్గరే! సీతాపురం"

తన కూతురు ఎవరితోనో మాట్లాడుతుంటే విన్న సుభద్రమ్మ "ఎవరితో మాట్లాడుతున్నావే" అంటూ వంటయింట్లోంచి వచ్చిందక్కడకు.

"అమ్మా! ఈ అబ్బాయి ఎవరో తెలుసా?"

"ఎందుకు తెలియదు. మన మేడమీది గదిలో చేరిన అబ్బాయిగదూ"

"అదికాదమ్మా! మొన్న మా క్లాస్‌లో ప్రవీణ అనే అమ్మాయి ఓ అబ్బాయిని నిష్ఠారణంగా అవమానించిందని చెప్పాను. గుర్తుందా?"

గుర్తుంది అన్నట్టు తల ఆడించింది సుభద్రమ్మ.

"ఈ అబ్బాయినేనమ్మా!"

"ఎవర్ని? ఈ అబ్బాయినా?"

"అవునమ్మా"

"అయితే ఈ అబ్బాయి మీ క్లాస్‌మేట్ అన్నమాట"

"అవునమ్మా!"

"ఏమిటో అబ్బాయి! ఈకాలం కాలేజీ చదువుకొనే అమ్మాయిలు మరీ మితిమీరిపోతున్నారు. మొన్న మీ క్లాస్‌లో జరిగిన విషయం మాఅమృత అంతా చెప్పిందిలే"

"అమ్మా! టబ్‌లో నీళ్ళు అయిపోయాయట. మోటార్ ఆన్ చెయ్యి" అమృత ఆ మాట చెప్పగానే స్విచ్ వెయ్యడానికి

 

లోపలికెళ్ళిపోయింది సుభద్రమ్మ.

* * *

సుభద్రమ్మకు ఏకైక సంతానం అమృత.

అందుకే అమృతను అల్లారుముద్దుగా పెంచుకొందామె.

సుభద్రమ్మ భర్త నాలుగేళ్ల క్రితం పోయాడు.

ఆయన పోవడంతో చేస్తున్న వ్యాపారం మూలబడిపోయింది.

అందువల్ల ఆ ఇంటికి సంపాదన లేకపోయింది. అయితే సుభద్రమ్మ వాళ్లకు పక్క వీధిలో ఇంకో మేడ ఉంది. అందులో నాలుగు కుటుంబాలు అద్దెకుంటున్నాయి. ఆ అద్దె ఒకటే వాళ్లకు జీవనాధారం. సుభద్రమ్మకు దగ్గర బంధువులు అంతగా లేరు. ఉన్న బంధువులు కూడా ఎవరి కుటుంబ తగాదాలతో వాళ్లు దూరమై పోయారు.

ఎప్పుడో ఓసారి దూరపు బంధువులు వచ్చిపోతూ ఉంటారు, అంతే!

సుభద్రమ్మ మనసు వెన్నలాంటిది. కూతురంటే ఆవిడకు పంచప్రాణాలు.

అమృత మాటకు ఆ ఇంట్లో తిరుగు లేదు.

"ఏమండోయ్! లోపలికి రావచ్చా?" అంది అమృత.

చదువుతున్న పుస్తకంలోంచి తలెత్తి చూశాడు హరిబాబు. వాకిలి దగ్గర నిలబడి నవ్వుతూ అమృత.

"రండి... రండి"

లోపలికొచ్చింది.

"కూర్చోండి" అంటూ కుర్చీ చూపించాడు.

"ఏమిటి సీరియస్‌గా చదివేస్తున్నారు"

"కెమిస్ట్రి"

"ఏమిటీ? కెమిస్ట్రినా?"

అవునన్నట్టు తల ఆడించాడు హరిబాబు.

"బి.కాం.లో కెమిస్ట్రి ఏమిటండీ నా బొంద?"

"చూడండి అమృతగారూ! బి.కాం.లో కెమిస్ట్రిలేదు. మీ బొందా లేదు. నేను మెడిసిన్‌ఎంట్రెన్స్‌కు ప్రిపేరవుతున్నాను. అదీ అసలు సంగతి"

"అయితే తమరు ఇంటర్లో సైన్స్ గ్రూప్ అన్నమాట"

"అవునండి. మీరే గ్రూపు?" ప్రశ్నించాడు హరిబాబు.

"ఇంటర్లో కూడా నేను కామర్స్ గ్రూపేనండి"

"అయితే మీకు ఈ బి.కాం. ఈజీగానే ఉంటుందన్నమాట"

"ఏం? మీకు కష్టంగా ఉందా?"

"అబ్బ! చచ్చిపోతున్నానండీ! ఆ లెక్చరర్స్ ఏం చెబుతున్నారో నాకేమీ అర్థంగావడంలేదండి. అంతా అయోమయంగా.. అందులోనూ అదేమిటీ తలగడ సైజ్‌లోఉంటుంది చూశారూ ఓ పుస్తకం"

"అదా! అడ్వాన్స్‌డ్ అకౌంటెన్సీ"

చెప్పింది అమృత.

"ఆఁ...అదేఅదే. ఆ అడ్వాన్స్‌డకౌంటెన్సీ-అందులోని ప్రాబ్లమ్స్ ఉన్నాయి చూశారూ అవేం ప్రాబ్లమ్సోగానీ అవి నాకు మాత్రం పెద్ద ప్రాబ్లమ్స్ అయి కూర్చున్నాయి. అసలు అందులో కొన్ని పదాలకు అర్థాలు కూడా తెలియడంలేదు నాకు"

"ఫర్వాలేదులెండి. మెల్లగా అర్థమౌతాయి."

"ఏమోనండి అమృతగారూ! ఆ బి.యస్సీతో చావలేక ఈ బి.కాం.లో చేరి

కాస్త గాలి పీల్చుకొందామనుకొన్నాను. కానీ నా పరిస్థితి చెర విడిపించుకోబోయి ఉరి తగిలించుకొన్నట్లయింది."

అమృతకు నవ్వాగలేదు.

"కామర్స్ మీకు అర్థం గాకపోయినా ఫర్వాలేదులెండి"

"ఎందుకని?"

"ఎలాగూ మీకు మెడిసిన్ సీటు వస్తుంది" అంది అమృత.

"అదేమిటి మీరు అంత ఖచ్చితంగా చెబుతున్నారు? మీకు జోస్యంగానీ వస్తుందా?"

"ఇటు చూడండి" అంటూ నోరుతెరిచి నాలుకను హరిబాబుకు చూపెట్టింది అమృత.

"ఏమిటి? నాలుకను చూపెడుతున్నారు?"

"నా నాలుక మీద మచ్చఉంది చూడండి" అంటూ మళ్ళీ నాలుకను సాచి చూపెట్టింది అమృత.

"అవునండోయ్ ! నిజంగానే మీ నాలుకపై మచ్చఉంది."

"చూశారుగదా! నాలుక మీద మచ్చ ఉన్నవాళ్లు ఏం చెబితే అదిజరుగుతుందట. చిన్నప్పుడు మా అమ్మమ్మ చెప్పేది. కాబట్టి నేను చెబుతున్నాను మీకు మెడిసిన్‌లో సీటు వస్తుందని. రాకపోతే అప్పుడడగండి"

"మెడిసిన్లో సీటొస్తే నాకు అంతకన్నా కావలసింది మరేమీ లేదండి. ఓవేళ పొరబాటుగా రాలేదనుకొండి. అప్పుడు నేను ఈ బి.కాం.నే కంటిన్యూ చెయ్యాలిగదా. అట్లాంటప్పుడు కామర్స్‌ను జాగ్రత్తగా చదువుకోవాలిగదా. అదేనండి నాబాధ"

"అయితే ఓ పని చెయ్యండి" అంది అమృత.

"చెప్పండి" హరిబాబు అడిగాడు.

"మరేం లేదు. ఈ బి.కాం.లో ఉండే సబ్జెక్ట్సుతో మీకు ఇంతవరకు 'టచ్' లేకపోవడం వల్లే మీరు ఇంత వర్రీ అవుతున్నారు. మీకు వీలున్నప్పుడల్లా నాకు చెప్పండి. నేను వచ్చి నాకు తెలిసినంత వరకు సబ్జెక్ట్సును గురించి మీకు అర్థం అయ్యేలా చెబుతాను. ఇకపోతే అకౌంట్స్ ప్రాబ్లమ్స్ ఉన్నాయి చూశారా ? వాటిని మనం ఇక్కడే కలిసి వర్క్ చేద్దాం. అలా ఓ నెలరోజులు మనిద్దరం కలిసి ప్రాబ్లమ్స్ వర్క్ చేశామంటే మీకు బాగా అకౌంట్స్ అర్థమైపోతాయి. తర్వాత నా కన్నా మీరే బాగా వర్క్ చేస్తారు. ఏమంటారు?" అంది అమృత.

"మీరు చెప్పింది బాగానే ఉందండీ! కానీ..."

"కానీ చెప్పండి?"

"మనిద్దరం ఇలా కలిసి చదువుకొంటుంటే"

"అవును. కోస్టడీచేస్తే ఏమిటి తప్పు?"

"తప్పని కాదండి"

"మరి ?"

"మీ అమ్మగారు..." సంకోచించాడు హరిబాబు.

"ఓహో అదన్నమాట మీ అనుమానం. చూడండి హరిబాబుగారూ! మా అమ్మ విషయం మీకు తెలియదు. ఆవిడ మన లాగా కాలేజీ చదువులు చదవకపోవచ్చు. కానీ ఆమెకూ అంతోయింతో సభ్యతా సంస్కారాలున్నాయి. ఆవిడ మనసు చాలా స్వచ్ఛమైంది. మీరు మా అమ్మను గురించి భయపడాల్సిన అవసరంలేదు. ఆవిడ చాలా కలుపుగోలుమనిషి. నా మీద ఆమెకు బోలెడంత నమ్మకం ఉంది. ఇక

పోతే నేను ఇలా మీ రూంకు వచ్చిపోతూ ఉంటే, మీతో కలిసి చదువుకొంటూ ఉంటే చూసి ఎదురింటివాళ్లూ, పక్కింటి వాళ్లూ ఏమైనా అనుకొంటారేమోననే భయం నాకులేదు. కారణం నేను చాలా తెగింపుగలదాన్ని. న్నా గురించి ఒకరు ఏమనుకొన్నా కేర్ చేసే మన స్తత్వం కాదు నాది. మనం భయపడాల్సింది మన అంత రాత్మలకు మాత్రమే. మీరు అనవసరమైన మొహమాటాలు పెట్టుకోకుండా మా కుటుంబంలో ఓ వ్యక్తిగా కలిసిపోవచ్చు. అలా కలిసిపోవాలంటే అందుకు మనసుండాలండీ...మనసు. అయితే ఆ మనసు మీకుంటో లేదో నాకు తెలియదు" అంది అమృత ఓ పాత పత్రిక పేజీలను తిరగేస్తూ.

ఆ గదిలో వాళ్ళిద్దరి మధ్య రెండు క్షణాలు నిశ్శబ్దం తాండవించింది.

"అన్నట్టు మీ కెమిస్ట్రీకి నేను అడ్డొచ్చినట్టున్నాను. సారీ ఫర్ ది డిస్టర్బ్" అంటూ అమృత పైకి లేవబోయింది.

"అబ్బే! అదేంలేదులెండి.కూర్చోండి" అన్నాడు హరిబాబు.

"ఇంట్లో కాస్త పనుందండి"

"ఒక్కక్షణం ఉండండి" అంటూ హరిబాబు కుర్చీలోంచి పైకిలేచి సూట్ కేసు తెరిచాడు. అందులోంచి ఓ పెద్ద ప్లాస్టిక్ కవర్ సుతీసి అమృత దగ్గరికి తీసుకొచ్చాడు.

"ఏమిటండి అది?" అడిగింది అమృత.

"ఏమీలేదండి. మొన్న మా ఊళ్లోంచి ఒకాయన ఈ ఊరు వస్తుంటే తినడానికని మా ఇంట్లోవాళ్లు ఆయనచేత అరిసెలు పంపించారు" అంటూ ఓ పేపర్ మీద వాటిని తీసిపెట్టి అమృతను తీసుకొమ్మన్నాడు.

"అదేమిటి మీవాళ్లు పంపించినవన్నీ నాకే ఇచ్చేస్తున్నారు. పాపం కొడుకు మీద ప్రేమతో చేసి పంపించి ఉంటారు మీ అమ్మగారు"

"నాకు అంత అదృష్టం లేదులెండి"

ప్రశ్నార్థకంగా హరిబాబు వేపు చూసింది అమృత.

"మా అమ్మ ఎలా ఉంటుందో నేను చూడలేదు. నేను పుట్టడం...మా అమ్మ చనిపోవడం రెండూ వెంటవెంటనే జరిగిపోయాయి"

"అయాం సారీ" అంటూ నొచ్చుకుంది అమృత.

"మా ఇంటి పక్కన ఇంకో కుటుంబం ఉందిలెండి. వాళ్ళకూ, మాకూ మధ్య విడదీయరానంత బలీయమైన అనుబంధాలున్నాయి.వాళ్లకు నేనంటే ప్రాణం. నేనెప్పుడూ వాళ్ళ ఇంట్లోనే ఉంటాను. వాళ్లే నాకోసం ఈ అరిసెలు చేసిపంపారు. మీ అమ్మకుకూడా కొన్ని పట్టుకెళ్లండి"

"సరే...ఇక నేను వెళతానండి" అంటూ కొన్ని అరిసెలను తీసుకొని వెళ్ళిపోయింది అమృత.

మనుషుల మధ్య సంబంధాలు ఏర్పడడానికి ఎన్నో సంవత్సరాలు అవసరం లేదు. అనుబంధాలూ, ఆత్మీయతలూ, హృదయ స్పందనలూ ఇవన్నీ క్షణకాలంలోనే సంభవిస్తాయి.అణువులో సృష్టి యావత్తూ అంతర్భూతమై ఉన్నట్లుక్షణంలోనే మనుషుల నడుమ ఏర్పడే అవగాహన నుండి మమత ప్రవాహంలా నుంచుకొచ్చి జీవితమంతా వ్యాపిస్తుంది.

హరిబాబు, అమృత అందుకుఅతీతులు కారు.

ఒకరంటే ఇంకొకరికి ఎంతో అభిమానం.

ఒకరి దగ్గర ఇంకొకరు ఎంతో చనువుగా ప్రవర్తించేవాళ్ళు.

సుభద్రమ్మకు కూడా హరిబాబంటే ప్రేమ.

వాళ్ళిద్దరు ఎంత సన్నిహితంగా ప్రవర్తించినా ఆవిడ ఏమీ అనుకొనేదికాదు. తన కూతురు పట్ల ఎంతో నమ్మకం.

హరిబాబు మెడిసిన్ ఎంట్రన్స్ దగ్గర పడుతోందని కష్టపడి చదువుతున్నాడు.

అప్పుడు టైమ్ రాత్రి ఒంటిగంటదాటుతోంది. తలుపుపై ఎవరో టకటకమంటూ కొట్టారు. చదువుతున్న పుస్తకాన్ని టేబుల్ మీద పడేసి వెళ్ళి తలుపు తీశాడు హరిబాబు.

ఎదురుగా అమృత.

"నువ్వా అమృతా!"

"ఏం దయ్యం అనుకొన్నావా?"

"ఏమీ అనుకోలేదుగానీ ఇంతరాత్రి పూట..."

"ఎందుకు వచ్చావు ఇక్కడికి అని అంటావు. అంతేనా? ఎదురింటి పద్మ వాళ్ళింటికి బంధువులొస్తే సెకండ్‌షోకి రమ్మని బలవంతంచేసింది పద్మ. ఆ సినిమా యివాళే ఆఖరట. అందుకని వెళ్ళాను. ఇంట్లోకి వస్తుంటే మేడ మీద నీ గదిలో లైట్ కన్పించింది. ఏం చేస్తున్నావో చూసిపోదామని వచ్చాను" అంది అమృత.

"చదివింది చాలుగానీ ఇకపడుకో" అంటూ టేబుల్‌మీదున్న బుక్‌ను మూసేసి షెల్ఫ్‌లో పెట్టేసింది అమృత.

"పడుకొంటే ఎలా. చదువుకోవద్దూ?"

"నీలా చదివే వాళ్ళను నేనెక్కడా చూడలేదు హరీ! ఇంకో నాలుగురోజులు నువ్విలాగేచదివావంటే గుర్తుపట్టలేనంతగా మారిపోతుంది నీ ముఖం. పూర్తిగా నల్లపూసైపోయావు" అంది అమృత.

ఆగదిలో తలుపుదగ్గర కాల్చిపారేసిన రెండు మూడు సిగరెట్ ముక్కలు కన్పించాయి అమృతకు.

"సిగరెట్లు కూడా తాగుతున్నావా హరీ!"

"అబ్బే లేదు"

"అయితే ఆ ముక్కలెక్కడివి?"

ఆముదం తాగిన వాడిలా ముఖం పెట్టాడు హరిబాబు.

"నిద్రను కంట్రోల్ చేసుకోడానికి.."

"సిగరెట్స్‌తాగాలా?అక్కర్లేదు. నిద్ర వస్తే పడుకొని ఉదయం లేచి చదువుకో. మళ్ళీ లైట్ కన్పించిందా నీగదిలో బల్బ్ తీసేస్తాను" అంటూ వెళ్ళిపోయింది అమృత.

* * *

"డియర్ ప్రసాద్!

నువ్వు రాసిన ఉత్తరం అందింది.

నేను మెడిసిన్ ఎంట్రెన్స్‌కు చాలా బాగా ప్రిపేరవుతున్నాను. సీటు వస్తుందనే నమ్మకం గట్టిగా ఉంది.

ఏడవతేదీ మా ఎంట్రెన్స్.

తిరుపతికి రెండు మూడు రోజుల ముందే బయలుదేరి వద్దామనుకొన్నాను. కానీ వీలులేకపోయింది. నేను ఆరవతేది తప్పకుండా వస్తాను. ఎంట్రన్స్ అయిపోయాక నీ దగ్గరే నాలుగైదు రోజులుంటాను.

ఇంట్లో అందరూ క్షేమం!

నీ చదువు ఎలా సాగుతోంది?

కలుసుకొన్నాక అన్ని విశేషాలూ మాట్లాడుకొందాం. అంతవరకు సెలవు.

నీ మిత్రుడు హరిబాబు"




ఉత్తరాన్ని కవర్లో పెట్టి అతికించాడు. ఆ వీధిలో ఉండే పోస్ట్‌బాక్స్‌లో వేసివచ్చి మళ్ళీ చదవడం మొదలెట్టాడు.

రోజులు గడుస్తున్నాయి.

ఆరవతేది వేకువజామునే నిద్రలేచి స్నానపానాలు ముగించుకొని డ్రస్ చేసుకొని కిందికి వచ్చి తలుపు తీశాడు హరిబాబు. ఆ తలుపు తీసి నాలుగు అడుగులు వేసి అక్కడున్న తలుపుపై కొట్టాడు.

తలుపు తీసింది అమృత.

"అమృతా! నేను తిరుపతి వెళుతున్నాను"

"ఇంత చీకట్లోనా? కాసేపుండు కాఫీ పెట్టి యిస్తాను"

"వద్దులే అమృతా వెళతాను"

"కాసేపు ఉండమన్నానా? నీఎంట్రెన్స్ రేపైతే యిప్పుడేఎందుకు బయలుదేరడం? తిరుపతికి ఇక్కడి నుండి బోలెడన్ని బస్సులున్నాయి. కాసేపు నువ్వెళ్ళి చదువుకో. పాలవాడు రాగానే కాఫీ పెట్టి తీసుకొస్తాను. తర్వాత కాఫీ తాగి వెళుదువు గానీ" అంది అమృత.

ఇక ఎదురు చెప్పే ధైర్యం లేక తిరిగి రూంకొచ్చి చదువుకోసాగాడు హరిబాబు.

ఇరవై నిముషాలు గడిచాయి.

అమృత ఎప్పుడొస్తుందా అని అప్పుడప్పుడు పుస్తకంలోంచి తలెత్తి చూస్తున్నాడు తలుపుకేసి.

ఇంతలో ఎవరో వస్తున్నట్లు సవ్వడి విన్పించడంతో కుర్చీలోంచి లేచి వాకిలి దగ్గరికొచ్చాడు హరిబాబు.

ఎదురుగా శివరామయ్య.

"బాబాయ్! ఇప్పుడేనా రావడం?"

అవునన్నట్టు తల ఆడించాడు శివరామయ్య.

"బాబాయ్! రేపు ఉదయం మా మెడిసిన్ ఎంట్రెన్స్. నేను ఇప్పుడే తిరుపతికి బయలుదేరుతున్నాను. ఇంతలో నువ్వొచ్చావు" అన్నాడు హరిబాబు

శివరామయ్య ఏమీ మాట్లాడలేదు.

"బాబాయ్! పిన్ని, శోభ అందరూ క్షేమంగా ఉన్నారా?"

క్షేమమే అన్నట్టు తల ఆడించాడు శివరామయ్య.

"హరీ! నువ్వు.. తిరుపతి వెళ్ళడం... కుదరదేమో"

"అదేమిటి బాబాయ్?" హరిబాబు కనుబొమలు ముడిపడ్డాయి

"నువ్వు వెంటనే మన ఊరికి బయలు దేరాలి"

"మన ఊరికా? నువ్వు చెప్పేదేమిటో నాకేమీ అర్థం కావడం లేదు బాబాయ్"

"హరీ.. మీ నాన్న... పో... పోయాడురా"

గుండెలు బద్దలైనట్లయింది హరిబాబుకు.

"బా...బాబాయ్!"

"అవును హరీ! రాత్రి గంగమ్మ చెరువు కింద..మీనాన్న పొలానికి నీరు పెడుతుంటే... పాము కరచి పడి పోయాడు. నోట్లోంచి నురుగలు వచ్చి... కాసేపటికే..." ఇక చెప్పలేకపోయాడు శివరామయ్య.

కుప్పలా కూలిపోయాడు హరిబాబు.

తనకు వెలుగును చూపెట్టి కన్నతల్లి చీకట్లోకి వెళ్ళిపోయింది.తను డాక్టరైతే చూసి సంతోషించాలని కోరుకునే తండ్రి. తను మెడిసిన్లోనైనా చేరకముందే కన్ను మూశాడు.

ఏమిటీ దారుణం!

ఈ అనంతకాల కీకారణ్యంలో...
తనవాళ్ళందరూ తనకు కన్పించకుండా మరుగైపోయారు. తనొక్కడే దిక్కు తోచని ఒంటరి పాంథుడయ్యాడు.

హరిబాబు పిచ్చిగా ఆలోచిస్తున్నాడు.

అతడికి చెక్కిళ్ళ మీదుగా కన్నీళ్ళు జారిపోతున్నాయి. ఆ బస్సులో కిటికీ దగ్గర కూర్చుని శూన్యంలోకి చూస్తున్నాడు హరిబాబు.

బస్సు వేగంగా దూసుకపోతోంది.

ఉదయం..పదిగంటలు కావస్తోంది.

ఇంట్లో అడుగెట్టిన హరిబాబు...
"నాన్నా!" అంటూ భూమి అదిరేట్లుగా అరిచాడు.

ఆ అరుపు... మనిషికి మనిషికి మధ్యఉండే మమత తెగిపోయినప్పుడు...



అంతరాత్మ చేసే ఆర్తనాదం.

"నాన్నా!" అంటూ జానకిరామయ్య శవం మీద పడి బావురుమన్నాడు హరి బాబు.

ఆ శవం పలకదని హరిబాబుకు తెలుసు.

అయినా 'నాన్నా నాన్నా' అంటూ అరుస్తాడు.

అది మమకారం...

మమతలూ, మమకారాలూ చాలా చిత్రమైనవి. అవి..అటు బుద్ధి తెలియని పసిపిల్లాడినీ.. ఇటు వృద్ధుడినీ కూడా ఏడ్పించగలవు.

ఆ శవం చుట్టూ చేరి హరిబాబుతో పాటు శోభ, శాంతమ్మ, శివరామయ్యలు కూడా కన్నీళ్ల కుక్కుకొంటున్నారు.



దుఃఖానికి మరణాన్ని జయించ గలిగిన శక్తేఉంటే..ఈసరికే ఆ మృత దేహం సజీవమై ఉండేది.

"రామయ్యా మావాఁ! నువ్వు కూడా ఇలా చిన్నపిల్లాడిలా ఏడుస్తూకూర్చుంటే ఎలా? చావు పుట్టుకలు మన చేతుల్లో ఉన్నాయా ఏమిటి? పిల్లలకి ధైర్యంచెప్పా ల్సినవాడివి నువ్వూ వాళ్ళతో పాటు ఏడుస్తూ కూర్చుంటే ప్రయోజనం ఏమిటి" అంటూ కరణం మందలించాడు.

ఆ చుట్టుపక్కల ఇళ్ళల్లో ఉండే పెద్దలందరూవచ్చి హరిబాబునూ,శోభనూ ఓదార్చుతున్నారు.

ఆ ఇంట్లో శోకం విలయతాండవం చేస్తోంది.

ఒక జీవితం అస్తమించిందని చెప్ప డానికి ఆనవాలుగా ఆ మృతదేహం తల దగ్గర ఓ ప్రమిద మండుతోంది.

జానకిరామయ్య శవానికి తలకొరివి పెడుతుంటే హరిబాబు చేతులు ఒక్క సారిగా వణికాయి.

ఆ రాత్రి...

ఎంత ప్రయత్నించినా హరిబాబుకు నిద్రపట్టలేదు. మెల్లగాలేచి వరండాలో కొచ్చి కూర్చున్నాడు. ఊరంతా నిద్ర లోకి జారిపోయిఉంది. తాగినవాడిలాగా తూగుతోంది రాత్రి.

చీకటి నిండిన సామ్రాజ్యాన్ని నిశ్శబ్దం ఏలుతోంది. ఆ భయంకర నిశ్శబ్దంలో ధ్వాంతాన్ని కప్పుకొన్న ఏకాంతంలో హరిబాబుశూన్యంలోకిచూస్తూ ఆ శూన్యంలో, ఆ చీకటిలో ఏ అందాలను వెతుకుతున్నాడో, ఏ జీవిత రహస్యాలను అన్వేషిస్తున్నాడో హరిబాబుకే తెలియడం లేదు.

ఎక్కడో తొలికోడి కూసింది.

అంతవరకు హరిబాబు వరండాలోనే కూర్చున్నాడు.

అతని కళ్ళు బాగా ఉబ్బి ఉన్నాయి.

కూర్చున్న చోటునుండి కదిలాడు హరిబాబు.

ఇంటిముందున్న రావిచెట్టు వెంట్రు కలు విరబోసుకొన్న దయ్యంలా ఉంది. మనిషి అలికిడి వినగానే ఏదో పక్షి రెప రెప రెక్కలుకొట్టుకొంటూ ఆ చెట్టులోంచి ఎటో ఎగిరిపోయింది-దేహాన్ని వదిలిన హరివాళ్ళ నాన్న ఆత్మలాగా.

ఆచీకట్లో నడుస్తున్నాడు హరిబాబు.

ఊరుదాటి చాలా దూరం వచ్చేశాడు.

నడుస్తున హరిబాబు పాదాలకు ఏవో ఎముకలు, పుర్రెలు తగులుతున్నాయి. మరణించిన మనుషుల గురులవి. రెండు మూడు సమాధులు చీకట్లో తెల్లగా కన్పి స్తున్నాయి. స్మశాన సామ్రాజ్యానికి చక్రవర్తులవి. దూరంగా తన తండ్రి చితిలో నిప్పులు ఎర్రగా కన్పిస్తున్నాయి.

మెల్లగా నవ్వాడు హరిబాబు.

ఆ సమయంలో ఆ నిర్జీవమైన నవ్వులో ఏదో విరక్తి. జీవిత విషాదాలపై... కాలం తిప్పే ఊహాతీత మలుపులపై ఏదో అయోమయ భ్రాంతి.

తండ్రి చితికి కొంచెం దూరంలో నిల బడ్డాడు హరిబాబు.

అతనిబుర్ర నిండా ఏవేవో ఆలో చనలు.

ఈ లోకంలో మనిషికి మనిషికి మధ్యగల సంబంధమేమిటి ?

అభిమానాలకూ, ఆత్మీయతలకూ ఆది మధ్యాంతాలెక్కడ?

ఒకరికోసం ఇంకొకరు చిందించే కన్నీటి విలువెంత ?

అసలా కన్నీటిని చిందించడంలో

గల ఆంతర్యమేమిటి?

నీటి బుడగలాంటి జీవితంపై మనిషి కెందుకు పల్లమాలిన తీపి?

ఈ సృష్టికి నిజంగానే...ఒక కర్త ఉన్నాడా? ఉంటే ఈ లోకంలో కొందరికి సుఖాలను, మరికొందరికి అంతులేని ఆవేదనను పంచిపెడుతూ ఎందుకంత పక్షపాతం చూపిస్తున్నాడు?

ఈ ప్రపంచంలో బాధల గాథల ఘర్షణల నడుమ నలిగే ఈ జీవితం క్షణ భంగురమే గదా! ఇది తెలిసీ మనుషులకు ఎందుకంత ఆరాటం? ఆ ఆరాటమే జీవితమా?

అసలు జీవితానికి అర్థం ఏమిటి? ఆనందమా? ఆవేదనా? విషాదమా? వినోదమా? ఈ ప్రశ్న ఎప్పటికీ శేష ప్రశ్నేనేమో.

ఎందుకో ... తనకింత లోతైన ఆలోచనలు.

క్లిష్టమైన విషయాలపై తనకెందుకింత ఆసక్తి?

హృదయమంతా చాలా భారంగా ఉంది విషాదభారంతో, విచార భావంతో.

బుర్ర పగిలిపోతూ ఉంది-అర్థంకాని ఆలోచనలతో, ఆకృతిలేని ఆవేదనతో.

ఏమిటో ఈ వేదాంతం!

ఏమిటో ఈ స్మశాన వైరాగ్యం!

హరిబాబు ఇలా పిచ్చిగా ఆలోచించుకుంటూ అక్కడే చాలాసేపు ఉండిపోయాడు.

తూర్పు ఆకాశం ఎర్రబడుతోంది.

సృష్టి జాగృదావస్థలోకి వస్తోంది.

చీకటి ఛాయలు పారిపోతున్నాయి.

ఆ స్మశానానికి పక్కన ఓ పర్వతం నిద్రిస్తోంది విరబోసుకున్న మర్రిలా! కొండచరియల్ని చుంబిస్తూ వెళుతున్నాయి మబ్బులు తెంపుకొన్న బర్రెల్లా.

స్వర్ణలేపనాన్ని తన లేత శరీరానికి పూసుకొని పెళ్ళికూతురిలా ముస్తాబై వస్తోంది ప్రాతః సంధ్య.

ఇంటికి తిరుగుముఖం పట్టాడు హరిబాబు.

ఆ వ్యథ, బాధ, వేదన, శోకంలో.. తనకు ఆరోజు మెడిసిన్ ఎంట్రెన్స్ ఉందనే విషయాన్ని పూరిగా మరిచిపోయాడు హరిబాబు. ఓ వేళ గుర్తుకొచ్చినా తను చేయగలిగింది ఏమీలేదు.

తనతండ్రి పోయాడని శివరామయ్య చెప్పిన క్షణంలోనే ఇక ఈ సంవత్సరం మెడిసిన్ ఎంట్రెన్స్ రాయడం కుదరదని అనుకొన్నాడు హరిబాబు.

తన పొలాలను కూడా శివరామయ్యనే సాగుచేసుకొమ్మని చెప్పి పది రోజుల తర్వాత కాలేజికి వెళ్ళిపోయాడు హరిబాబు.




రోజులు దొర్లిపోతున్నాయి.

హరిబాబు పొలాన్ని ఇప్పుడు శివరామయ్యే సాగుచేస్తూ కావలసిన డబ్బును పంపిస్తున్నాడు.

అమృత, హరిబాబులు మరింత దగ్గరైపోయారు.

ఇప్పుడు అతడు హోటల్లో

భోంచెయ్యడం మానేసి వాళ్ళఇంట్లోనే భోంచేస్తున్నాడు. తను ఊరెళ్ళినప్పుడు బియ్యం, మిరపకాయలు, నూనె వగైరా వంట సామాగ్రి తెచ్చి అమృతవాళ్ళింట్లో పడేస్తుండేవాడు.

ఆరోజు రాత్రి తొమ్మిది కావస్తోంది.

ఆకాశం మేఘావృతమై సన్నగా వర్షం పడుతోంది.

మేడమీద గదిలో హరిబాబు, అమృత కూర్చొని అకౌంట్స్ వర్క్ చేస్తున్నారు. 'ఫైనల్ అకౌంట్స్' ఎలా వెయ్యాలో వివరంగా చెబుతోంది అమృత. 'గ్రాస్ ప్రాఫిట్' వచ్చాక 'ప్రాఫిట్ అండ్ లాస్ అకౌంట్' ను ఎలా ఎలా తయారు చెయ్యాలో, డెబిట్ సైడ్ ఏయే అయిటమ్స్ వస్తాయో, క్రెడిట్ సైడ్ ఏయే అయిటమ్స్ వస్తాయో నెట్ ప్రాఫిట్ ఎలా వస్తుందో, నెట్ ప్రాఫిట్ వచ్చాక 'బాలన్స్‌షీట్' ను ఎలా తయారుచేసి అందులోని 'అసెట్స్'ను 'లైబలటీస్'ను ఏ విధంగా 'టాలీ' చెయ్యాలో వివరిస్తోంది అమృత.

హరిబాబు బుర్రలో అవేమీ ఎక్కడం లేదు.

అమృతనే కన్నార్పకుండా చూస్తున్నాడు.

బయట వర్షం జోరుగా పడుతోంది.

అమృత ఆ సాయంత్రమే తల స్నానంచేసి ఆరబెట్టుకొన్న వెంట్రుకలతో వదులు వదులుగా జడవేసుకొంది. మెరూన్ కలర్ చీర, దానికి మాచ్ అయ్యేటట్లు అదే రంగు బ్లౌజు, కాటుక పెట్టుకొన్నకళ్ళు కలువల్లా అందంగా ఉన్నాయి. సాయంత్రం ముఖానికి అద్దు కొన్న పౌడరు ఇంకా ఘుమ ఘుమ వాసన వస్తోంది. ఆరోజు హరిబాబు కళ్ళకు కొత్త అందాలతో మత్తెక్కించే కావ్య నాయికలా కన్పిస్తోంది అమృత.

బయట వర్షం ఉధృతమైంది.

చల్లగాలి రివ్వున వీస్తోంది.

హరిబాబు బుర్రనిండా అమృతను గురించిన ఆలోచనలు...!

ఆకాశం విరిగి భూమి మీద పడిపోయే టట్లుగా పెళపెళ మంటూ భయంకరంగా ఉరుము...

సరిగ్గా అదే సమయానికి కరెంటు పోయింది.

'అమ్మో!' అంటూ జడుసుకొని హరిబాబును బల్లిలాగా కరచుకొంది అమృత.

హరిబాబు కౌగిల్లో అమృత.

అతడికి జీవితంలో మొదటిసారిగా స్త్రీ స్పర్శ!

నరాలలో విద్యుత్ ప్రసరణ...

గుండెల్లో ఏదో అనిర్వచనీయమైన అనుభూతి...

వాళ్ళిద్దరి చుట్టూ కటిక చీకటి......

తన హృదయానికి మరింత గట్టిగా హత్తుకొని చటుక్కున ఆ అమ్మాయిని ముద్దు పెట్టేసుకొన్నాడు హరిబాబు.

ఇంతలో కరంట్ రావడంతో అతడి కౌగిల్లోంచి విడిపించుకొని ఆ గదిలోంచి బయటికి పరుగెత్తింది అమృత.

ఆ మరుసటి రోజు...

ఉదయం నుండి అమృతను తప్పించుకొని తిరుగుతున్నాడు హరిబాబు. ఆవాళ ఆదివారం కనుక కాలేజీకి శెలవు.

ఉదయమే రూంలోంచి బయటపడి మధ్యాహ్నం వరకూ రోడ్ల వెంట పిచ్చివాడిలాతిరిగాడు. మధ్యాహ్నం హోటల్లోనే భోంచేసి మ్యాట్నీకి వెళ్లిపోయాడు. సినిమాలో కూర్చున్నాడే గానీ అతని ఆలోచనలన్నీ అమృత మీదే ఉన్నాయి.

రాత్రి జరిగిన సంఘటనను గురించే ఆలోచిస్తున్నాడు.

ఏమిటి తను రాత్రి చేసింది?

ఆవేశంతో వివేకాన్నే పోగొట్టుకొన్నాడు.

తన ప్రవర్తనకు అమృత ఏమనుకొని ఉంటుంది?

తనను అసహ్యించుకొని ఉంటుందేమో...

కాకపోతే కరెంట్ రాగానే తన గది లోంచి ఎందుకలా వెళ్ళిపోయింది?

ఓవేళ సిగ్గుతో వెళ్ళిపోయిందేమో...!

ఇంతకూ అమృతకు తనంటే ఇష్టమేనా?

ఇష్టం లేకుంటే తనతో ఎందుకంత చనువుగా ప్రవర్తిస్తుంది?

ఒక అమ్మాయి ఇష్టంలేని మగాడి గదికి తరుచుగా వస్తుందా?

ఇష్టంలేని మగాడితో సినిమాలకు వెళ్ళి పక్కసీట్లో కూర్చుంటుందా?

ఇష్టంలేని మగాడు భోంచేస్తుంటే అతడి పళ్లెంలోని అన్నాన్ని తను తీసుకొని తింటుందా?

ఇష్టంలేని మగాడి పుట్టినరోజుకు తను బలవంతంగా కొత్తబట్టలు కుట్టిస్తుందా?

ఈ ప్రవర్తనకు అర్థం ఏమిటి?

ఏమో...అమృత తనను ఓ మంచి ఫ్రెండుగా ట్రీట్ చేస్తోందేమో!

తనే అనవసరంగా ఆ అమ్మాయి ప్రవర్తనకు లేనిపోని కారణాలను ఊహించుకొని భ్రమపడ్డాడేమో!

మొదటి నుండీ అమృత తన దగ్గర చొరవగానే ప్రవర్తించింది.

తన ప్రసక్తి లేకనే తన జీవితంలోకి ప్రవేశించింది.

ఆమె చాలా ముక్కుసూటి మనిషి. తనంటే ఓవేళ ఇష్టం లేకుంటే ఆ మాట డైరక్టుగా చెప్పేసేది. తనంటే ఇష్టం ఉన్నా ఆ మాటైనా డైరక్టుగా చెప్పాలిగా? కానీ ఆడది ఎంత ముక్కుసూటి మనిషైనా ఇలాంటి విషయాలలో సహజంగా సిగ్గుపడుతుందేమో!

అయినా తనెందుకిలా బుర్ర బద్దలు కొట్టుకోవడం?

అదేదో తానే అడిగేస్తే సరిపోతుంది.

అవును. ఆ విషయం రాత్రికి ఎలాగైనా తేల్చేయాలి. ఆలోచించుకొంటూ సాయంత్రం ఆరు గంటలకు ఇంటికెళ్లాడు హరిబాబు. మేడమీదికి వెళదామని రెండు మెట్లెక్కగానే అమృత లోపలి నుంచి వచ్చింది.

"దొరగారు ఉదయం నుండి ఎక్కడికెళ్లినట్టు?"

"టౌన్‌లో కొంచెం పని ఉంటే..."

"భోజనానికి వస్తావేమోనని నీ కోసం మధ్యాహ్నం మూడుగంటల వరకు ఎదురు చూశాను తెలుసా? టౌన్‌లో అంత రాచకార్యాలుంటే అదేదో ఉదయమే వెళ్లేటప్పుడు చెప్పి వెళ్లొచ్చుగా"

"సారీ అమృతా!" అంటూ గబగబా తన గదిలోకి వెళ్లటానికి నాలుగు మెట్లెక్కి ఆగి మళ్లీ తిరిగి కిందికి చూశాడు. కింద నిలబడి తననే చూస్తోంది అమృత.

-గది తాళం తీసి తలుపులు వేశాడు.

నేలమీద - గదిలో ఓ కవర్ కన్పించింది.

ఇవాళ ఆదివారం. పోస్ట్ రావడానికి అవకాశంలేదే అని అనుకొంటూ వంగి కవర్‌ను అందుకొన్నాడు హరిబాబు.

ఆ కవర్ మీద వి. హరిబాబు, సెకండ్ బి. కాం. అనిమాత్రమే రాసిఉంది. అవి

అమృత అక్షరాలని తెలుసుకోడానికి ఎంతోసేపు పట్టలేదు హరిబాబుకు. గబగబా కవర్‌ను చించి చూశాడు.

అందులో...ఒకే ఒక చిన్న స్లిప్పు.

ఆ స్లిప్పు మీద ఒకే ఒక వాక్యం.

"ఐ లైక్ యు వెరీమచ్ అండ్ ఐ వాంట్ యు!"

చదువుకొన్నాడు హరిబాబు.

ఒక్కసారి కాదు. పదిసార్లు చదువుకొన్నాడు. ఆ క్షణంలో హృదయంలో యావత్ ప్రపంచాన్ని జయించినంత ఆనందం...

*   *   *

"హరీ!" అంటూ చాలా రోజులకు కలిసిన ప్రాణమిత్రుడిని గట్టిగా కౌగలించుకొన్నాడు ప్రసాద్.

"అబ్బ! ఊపిరాడటంలేదు వదిలి పెట్రా బాబూ!" అంటూ నవ్వుతూ ప్రసాద్ చేతులను మెల్లగా తొలగించాడు హరిబాబు.

"ఇంతకూ ఎంట్రెన్స్‌కు ఎలా ప్రిపేరయ్యావ్?" ప్రశ్నించాడు ప్రసాద్ హరిబాబు చేతిలోని సూట్‌కేస్‌ను అందుకుంటూ.

"లాభంలేదు ప్రసాద్! సరిగా ప్రిపేర్ కాలేదు. లాస్టియర్ చాలా బాగా చదివాను. అప్పుడు రాసిఉంటే తప్పకుండా సీటు వచ్చేది. కానీ ఈ సంవత్సరం సీటువస్తుందన్న నమ్మకంలేదు" అన్నాడు హరిబాబు.

"వస్తుందిలేవోయ్!"

"అది సరేగానీ ఆ వాచ్‌మన్‌గాడు నన్ను లోపలికి రానివ్వకుండా 'ఇక్కడే ఉండండిసార్ మీ ఫ్రెండును తీసుకొస్తాను' అనిచెప్పి నిన్ను తీసుకొచ్చాడు. గెస్టులను హాస్టల్లోపలికి రానివ్వరా!" అన్నాడు హరిబాబు.

"ఈ హాస్టల్లో రూల్స్ కొద్దిగా స్ట్రిక్టు. గెస్టులనులోపలికి రానివ్వరు. ఎవరుకావాలో చెబితే వాచ్‌మన్ వాళ్ళను పిలుచుకొస్తాడు. మనం కొద్దిగా వాడికి చిల్లర పడేశామనుకో మన గెస్ట్సు లోపల ఉండొచ్చు నువ్వు ఇక్కడే ఉండు. నేను ఇప్పుడే వాచ్‌మన్‌తోనూ, హాస్టల్ మేనేజర్ తోనూ మాట్లాడివస్తాను" అంటూ వెళ్ళిపోయాడు ప్రసాద్.

హరిబాబు బయటే నిలబడి హాస్టల్‌ని పరిశీలనగా చూస్తున్నాడు. హాస్టల్ ముందు పైన ఇంగ్లీషులో బోర్డ్ వేలాడుతోంది.

"ఏమిటోయ్ అలా పరిశీలనగా చూస్తున్నావు?" అంటూ హాస్టల్ ఆఫీస్‌లోంచి బయటకి వచ్చాడు ప్రసాద్.

"ఏంలేదు! ఇది హాస్టల్లా కన్పించడం లేదేమా అని"

"మరి?"

"ఇదేదో దేవస్థానం వారి సత్రంలా కన్పిస్తోందోయ్"

"నీ ఊహ కరక్టే! ఒకప్పుడిది దేవస్థానంవాళ్ళ సత్రమేనట. ప్రస్తుతానికి మా కాలేజీకి హాస్టల్‌గా మార్చారు. సరే! రా వెళదాం" అంటూ రూంవేపు నడిచాడు ప్రసాద్.

ఓ రూమ్ ముందు ఆగి తలుపు తోశాడు ప్రసాద్.

ఆ తలుపుపై రూమ్ నంబర్ యిరవై అని రాసిఉంది.

ఆ తలుపు మీద ప్రసాద్ సెకండ్ బి. ఏ., చంద్రశేఖర్ ఫస్ట్ బి.యస్సి., వి. ఆర్. చౌదరి సెకండ్ బి. కాం. అని ముగ్గురి పేర్లు రాయబడిన ఓ కాగితం




ముక్క అంటించి ఉంది. లోపలికొచ్చి బట్టలు మార్చుకొన్నాడు హరిబాబు.

"మీ రూమ్‌మేట్స్ కన్పించడం లేదే?"

"ఒకతను ఊరెళ్ళాడు. ఇంకొకతను బజారెళ్ళినట్లున్నాడు" అంటూ సోపూ, టవలూ తీసి హరిబాబు ముందు పెట్టాడు ప్రసాద్.

"హరీ! వెళ్ళి స్నానం చెయ్యి. బజార్‌కు వెళ్దాం"

"బాత్‌రూమ్ ఎక్కడ?"

"చూపెడతానురా" అంటూ హరి బాబును బాత్‌రూమ్ దగ్గరకు తీసుక పోయాడు ప్రసాద్.

"అన్నట్టు మీ మెడిసిన్ ఎంట్రెన్స్ ఎప్పుడన్నావ్?"

"ఆదివారం నాటికి. యింకా మూడు రోజులుంది" చెప్పాడు హరి.

"నేను రూమ్‌లో ఉంటాను. తొందరగా స్నానం ముగించుకొని వచ్చేయ్"

సాయంత్రం ఆరుగంటలవుతోంది...

ఇద్దరూ హాస్టల్లోంచి బయటపడ్డారు.

బజారు చాలా రద్దీగా ఉంది.

"ఈ తిరుపతిలో 'ఫ్లోటింగ్ పాపులేషన్' ఎక్కువనుకొంటాను" అన్నాడు హరి.

అవునన్నట్టు తల ఆడించాడు ప్రసాద్.

ఇద్దరూ వెళ్ళి హోటల్లో కూర్చున్నారు.

స్టూడెంట్స్‌తో కిటకిటలాడుతోందది. చుట్టూ కలయ చూశాడు హరిబాబు. అక్కడక్కడా గుంపులు గుంపులుగా కుర్చీలలో కూర్చొని కబుర్లు చెప్పుకొంటున్నారు స్టూడెంట్స్. ఆ రోజు క్లాస్‌లో తను లెక్చరర్ మీద ఎలా తిరగబడ్డాడో పీచుడిలా పోజు పెట్టి చెబుతున్నాడొక స్టూడెంట్. నాలుగు రోజుల క్రితం పద్మావతి ఉమెన్స్ కాలేజీ అమ్మాయిలు మ్యాచ్కికి వస్తే తను ఆరోజు వాళ్ళను ఎలా ఏడ్పించిందీ చెబుతున్నాడు ఇంకో స్టూడెంట్. తను వెల్‌కమ్ పార్టీలో చేసిన ఏకపాత్రాభినయాన్ని చూసి తన క్లాస్‌లోని అమ్మాయిలు తనను పొగిడారని భుజాలెగరేసుకొంటూ గొప్పలు చెబుతున్నాడొక యూనివర్శిటీ స్టూడెంట్.

"హరీ! ఏదైనా పిక్చర్‌కి వెళ్దామా?" అన్నాడు ప్రసాద్

"పిక్చర్‌కా?"

"అవునోయ్"

"చూడు ప్రసాద్! మా మెడిసిన్ ఎంట్రెన్స్‌కు మధ్యలో ఇక రెండు రోజులు మాత్రం టైముంది. నేను అసలే సరిగా చదవలేదు. ఈ రెండ్రోజులూ కొంచెం కష్టపడితే గానీ మెడిసిన్ సీటు నమ్మకం లేదు. మా ఎంట్రెన్స్ అయిపోయేంత వరకు నన్ను సినిమాలకూ, షికార్లకూ దయచేసి రమ్మని యిబ్బంది పెట్టకు" అన్నాడు హరి.

"ఓకే...ఓకే! కానీ ఓ షరతు" అన్నాడు ప్రసాద్.

"ఏమిటది?"

"మీ ఎంట్రెన్స్ అయిపోయాక నువ్వు ఇక్కడ కనీసం ఒక్క వారం రోజులైనా ఉండాలి"

"అయ్యబాబోయ్ వారం రోజులే"

"ఏం? వారం రోజులు ఈ తిరుపతిలో ఉండలేవా?"

"ఎందుకులే ప్రసాద్! ఎంట్రెన్స్ అయిపోగానే వెళ్లిపోతాను"

"వెళ్లిపోతాను...వెళ్లిపోతాను అని మహా తొందరపడిపోతున్నావు. ఏమిట్రా అంత తొందర? నీ రాకకోసం ఎదురు చూసేవాళ్లెవరైనాడున్నారేమిటి అక్కడ"

మెల్లగా టీ చప్పరిస్తూ అన్నాడు ప్రసాద్.

"ఉన్నారోయ్"

"ఉన్నారా! ఏమిట్రోయ్ కథ? ఎవరా హీరోయిన్?" నవ్వుతూ అడిగాడు ప్రసాద్.

"అమృత అని..."

"అమృత... పేరు చాలా బావుందే. బి.కాం.లో చేరి నువ్వు సాగించే ఘన కార్యాలు ఇవన్నమాట. సరే. అసలు విషయం చెప్పు?"

"సారీ ప్రసాద్! అమృత విషయం నీకు రాయాలని చాలారోజుల నుండి అను కొంటూనే ఉత్తరంలోరాయలేకపోయాను. నిన్ను కలిసినప్పుడు చెబుదామను కొన్నాను" అంటూ అమృత విషయం చెప్పసాగాడు హరి.

హరి ఏ విషయాన్నీ ప్రసాద్‌కు చెప్ప కుండా దాచలేడు. ఒకవేళ కొన్నాళ్ల దాచినా చివరకు ఎప్పుడో ఆ విషయం చెప్పేంతవరకు అతనికి మనసు తృప్తిగా ఉండదు.

అయితే అమృత విషయం హరిబాబు తన బాబాయ్ శివరామయ్యకు గానీ, పిన్ని శాంతమ్మకు గానీ, శోభకు గానీ చెప్ప లేదు. ఎందుకో ఆ విషయం వాళ్లకు చెప్పాలన్పించలేదు.

ఆ రాత్రి హాస్టల్లో...

రూంలో కూర్చొని ఒంటరిగా చదువు కొంటున్న హరిబాబుకు టక్కున అమృత గుర్తుకొచ్చింది.

ఏం చేస్తుంటుందో ఇప్పుడు?

తిరుపతి వెళ్లగానే ఉత్తరం రాస్తానని చెప్పి వచ్చాడు తను.

రేపైనా అమృతకు ఉత్తరం రాయాలి.

తనంటే ఎంత ఇష్టం అమృతకు!

ప్రేమించటం కన్నా ప్రేమించబడడం గొప్ప అదృష్టం కదా!

హరిబాబు తన ఆలోచనల్ని అమృత మీదినుండి పుస్తకంలోకి చొప్పించాడు. ఎందుకో నిద్ర వస్తున్నట్టుగా ఉంది అతనికి. బజారులో టీ తాగి వద్దామని పైకి లేచాడు.

పక్కరూంలో కూర్చొని ఏవో కబుర్లు చెబుతున్నాడు ప్రసాద్.

ఆ రూమ్ దగ్గర నిలబడి పిలిచాడు హరిబాబు.

"ఏమిటి హరీ! రా కూర్చో" అంటూ పిలిచాడు ప్రసాద్.

"రండి" అంటూ ఆ రూంలో ఉండే ఇంకో స్టూడెంట్ పిలిచాడు.

హరిబాబు వెళ్లి ఓ కుర్చీలో కూర్చున్నాడు. ఆ రూంల్లో ఉండే ఇంకో స్టూడెంటూ, ప్రసాద్ ఏదో చర్చించుకొంటున్నారు.

కుర్చీలో కూర్చున్న హరిబాబు ఆ గదిని పరిశీలనగా చూస్తున్నాడు. ఆ గదిలో ఓ టేబుల్ మీద ఫ్రేంలో అమర్చబడిన ఓ అమ్మాయి ఫొటో మీద హరిబాబు చూపులు స్తంభించిపోయాయి.

అతని బుర్రలో పెద్ద కొశ్చన్‌మార్క్.

ఈ ఫొటో ఇక్కడెందుకుంది?

ఇది ఇక్కడికెందుకొచ్చినట్టు?

తనకళ్లు తనని మోసగించడంలేదు.

ఆ ఫొటో ఎవరిదో తనకు ఖచ్చితంగా తెలుసు.

అయిదు నిముషాల తరువాత టీకోసం హరిబాబు, ప్రసాద్ బయట రోడ్డుపైకొచ్చారు.

"ప్రసాద్! ఇందాక మనం కూర్చున్న ఆ రూంలో టేబుల్ మీద ఫ్రేంలో ఓ అమ్మాయి ఫొటో ఉంది. ఎవరా అమ్మాయి?" అనడిగాడు.

"చాలా బ్యూటీగా ఉందిగదూ!"

"ఇంతకూ ఆ అమ్మాయి ఎవ్వరా ప్రసాద్?"

"ఆ రూంలో ఇంకో బి. యస్సీ ఫైనలియర్ స్టూడెంట్ ఉన్నాడులే. అతడు నాకంతగా క్లోజ్ కాదు. అతని పేరు సాగర్. ఆ ఫొటోలో ఉన్న అమ్మాయి సాగర్‌కు కాబోయే భార్యట. ఎక్కడో చదువుతోందట"

స్థాణువులా నిలబడిపోయాడు హరిబాబు.

కాళ్ళకింది భూమి బద్దలైనటన్పించిందతనికి.

"ప్రసాద్! నో...నో! అలా జరగడానికి వీల్లేదు"

"ఏమిట్రా హరీ! ఏమిటి నువ్వంటున్నది?"

"అవును ప్రసాద్! ఆ ఫొటోలో ఉన్నది ఎవరో తెలుసా? అమృత..అవును అమృత"

నిర్ఘాంతపోయాడు ప్రసాద్.

రెండుక్షణాలు మౌనంగా గడిచాయి.

"ఆ ఫొటో నిజంగా అమృతదే అయితే నువ్వు దురదృష్టవంతుడివే హరీ! ఎందుకంటే ఆ అమ్మాయివాళ్ళు సాగర్‌కు దూరపు బంధువులట. పైగా సాగర్‌కు ఆ అమ్మాయంటే చాలా ఇష్టం"

"కానీ...అమృతకు నేనంటే చాలా ఇష్టం" అన్నాడు హరిబాబు.

"కావచ్చు. కాని తనకు ఎవరుకావాలో నిర్ణయించుకోవడం ఆమె చేతుల్లో ఉంది" ప్రసాద్ అన్నాడు.

"సరే అమృత అసలు ఉద్దేశ్యం





ఏమిటో రేపే...రేపే వెళ్ళి తేల్చేస్తాను. విషయం అటో ఇటో తేలిపోవాలి" ఆవేశంగా అన్నాడు హరిబాబు.

"చూడు హరీ! రెండుమూడు రోజుల్లో నీ మెడిసిన్ ఎంట్రెన్స్ ఉంది. ఆ విషయం మరిచిపోయి పిచ్చిపిచ్చి వేషా లెయ్యకు. అమృతకు నిజంగా నువ్వంటే చాలా ఇష్టమే అయితే అమృత నీదే అవుతుంది. కాబట్టి అనవసరమైన ఆలోచనలతో బుర్రను పాడుచేసుకోక కాస్త శ్రద్ధగా చదువు" అన్నాడు ప్రసాద్.

ఇద్దరూ టీ తాగేసి మళ్ళీ హాస్టల్‌కు పదినిముషాల్లో తిరిగివచ్చేశారు.

పుస్తకం తెరిచాడు హరిబాబు.

కానీ మనసు పుస్తకంమీద లగ్నం కావడంలేదు. నిర్మలమైన హరిబాబు మనస్సులో అమృత విషయం అలజడినీ, ఆందోళననూ రేపింది. ఒక్క అక్షరం కూడా బుర్రకు ఎక్కడంలేదు. ఏ విషయంలో కొందరి మనస్సు వికలమై పోతుందో ఆ విషయంపై తప్ప మరే విషయం మీదా మనసు కేంద్రీకృతంకాదు. ఆ రెండ్రోజులు ఏం చదివాడోగానీ అతడికేమీ ఎక్కలేదు.

మెడిసిన్ ఎంట్రెన్స్‌రాసి హాస్టల్‌కు తిరిగొచ్చాడు హరిబాబు. మెడిసిన్లో సీటు వస్తుందనే నమ్మకం గంగలో కలిసి పోయింది.

సున్నితమైన హృదయాన్ని కలిగి ఉండడం శాపమేమోనన్పిస్తుంది కొందర్ని చూస్తే.

తిరుపతిలో ఇంకా రెండు మూడు రోజులుండమని ప్రసాద్ ఎంత బలవంత పెట్టినా హరిబాబు విన్పించుకోలేదు. ఆ సాయంత్రమే తిరుపతిలో బస్సు ఎక్కేశాడు.

కాని...

అమృతని నిలదీసి ఏదేదో అడిగెయ్యాలని ఆతృతతో వచ్చిన హరిబాబు ఆమెను ఒక్క మాటకూడా అడగలేక పోయాడు.

సుభద్రమ్మ చెప్పిన విషయం వినగానే మొదలు నరికినవృక్షంలాకూలిపోయాడు.

పిచ్చిగా అరిచాడు.

గుండెలు బాదుకుని ఏడ్చాడు.

జుట్టు పీక్కున్నాడు.

కానీ పోయిన అమృత తిరిగి రాలేదు.

కొన్నాళ్ళకు మెడిసిన్ ఎంట్రెన్స్ రిజల్ట్స్ వచ్చాయి. అందులో హరిబాబు నంబరు లేదు.

కాలేజీకి వెళ్ళే టౌన్‌బస్ ఆక్సిడెంట్ అయింది. కొంతమందికి తీవ్రమైన గాయాలు తగిలాయి. అయిదారుమంది అక్కడికక్కడే చనిపోయారు. వాళ్ళలో అమృత కూడా ఒకతె. సుభద్రమ్మ శోకం ఆపగలవారే లేరు.

హరిబాబు జీవితంలో అమృత పాత్ర ఆ విధంగా ముగిసిపోయింది.

అమృత జ్ఞాపకాలు క్షణం క్షణం అగ్నిజ్వాలల్లా హృదయాన్ని సోకుతుంటే ఆ ఇంట్లో ఉండలేక గదిని ఖాళీచేసి చదువు వదిలేసి లగేజ్ తీసుకుని ఊరెళ్ళి పోయాడు హరిబాబు.

అయితే కాలం ఎంతటి గాయాన్నైనా మాన్పగలదు.

రోజులు గడిచేకొద్దీ అతని హృదయంలో అమృత జ్ఞాపకాలు మరుగున పడిపోయాయి. ఊళ్ళోనే పొలంపనులు చూసుకుంటూ కాలం గడుపుతున్నాడు హరిబాబు. కానీ అతడు యిలా చదువు మానేసి పొలం పనులు చూసుకోవడం శివరామయ్య, శాంతమ్మలకు ఏమాత్రమూ



యిష్టంలేదు. అందుకే మళ్ళీ మెడిసిన్ సీటుకోసం ప్రయత్నించమని బలవంతం చేశారు.

వాళ్ళ మాటను తోసెయ్యలేక పోయాడు హరిబాబు.

ఈసారి వైజాగ్‌లో ప్రయత్నించాడు. ఎలాగోలా వచ్చింది. ఊళ్ళో చాలా మంది సంబరపడిపోయారు. హరిబాబు అప్పుడే డాక్టరై పోయినంతగా సంతోషించారు శివరామయ్య, శాంతమ్మ.

ఇంటర్మీడియట్ పాసయ్యాక హరిబాబుకు రెండు సంవత్సరాలు వృథా అయ్యాయి. చివరకు విశాఖపట్నం మెడికల్ కాలేజీలో జాయినై పోయాడు.



కారు చీకట్లు కమ్ముకున్నాయి.

శానిటోరియంలో వార్డులోని తన కాట్ మీద పడుకొని గతాన్ని తవ్వుకుంటున్న హరిబాబు బిలబిలమంటూ బయటినుండి పేషంట్స్ వార్డులోకి ప్రవేశించడంతో గతంనుండి వాస్తవంలోకొచ్చాడు. అలా ఒంటరిగా పడుకున్న హరిబాబును పేషంట్స్ వింతగా చూశారు.

ఆ చూపులకు అర్థం ఏమిటో అతడికి తెలుసు.

కాని అతని ప్రపంచం అతనిది.

ఒక్క రాజశేఖరంతో తప్ప ఎవరితోనూ ఎక్కువ మాట్లాడేవాడుకాదు హరిబాబు.

"హరీ! నువ్వు ఒంటరిగా యిక్కడే ఉండిపోయావేం?" వార్డులోకి ప్రవేశించిన రాజశేఖరం ప్రశ్నించాడు.

"బయటకు రావాలన్పించలేదండీ"

హరిబాబు ముఖంలోకి పరిశీలనగా చూశాడు రాజశేఖరం.

అతని ముఖంలో ... గతకాలపు జ్ఞాపకాలు మిగిలించిన విషాద ఛాయలు కన్పిస్తున్నాయి.

"చూడు హరీ! ఇక్కడున్న ప్రతి పేషంట్‌కూ ఓ చరిత్రా, ఆ చరిత్ర నిండా కడివెడు కన్నీళ్ళూ ఉండనే ఉంటాయి. ఇది అసలే చీకటి జీవితం. ఈ చీకట్లోకి మనమంతా వెలుగుకోసం వచ్చాం. ఆ వెలుగును చూడడం కోసం ఎదురు చూస్తూ కూర్చోవడమే ఇక్కడ రోగుల కర్తవ్యం. అంతేగానీ... నీలా గతాన్ని తవ్వుకొంటూ, బాధ పడుతూ కూర్చుంటే ప్రయోజనం ఏమిటి? ఇక నుండి ఎప్పుడూ ఇలా ఒంటరిగా కూర్చోకు. సాయంత్రంపూట అలా వార్డు బయటకెళ్ళి చల్లగాలి పీలుస్తుంటే ఎంతో ఆహ్లాదకరంగా ఉంటుంది. నువ్వూ సాయంత్రం పూట మాతో వస్తూ ఉండు" అని హరిబాబుకు ధైర్యం చెప్పి తన కాట్ దగ్గరికి వెళ్ళిపోయాడు రాజశేఖరం.

ఒక్కోసారి రాజశేఖరం తన మీద చూపెట్టే అభిమానానికి పులకరించి పోయేవాడు హరిబాబు.

కాల ప్రవాహంలో రోజులు కొట్టుకపోతున్నాయి.

ప్రసాద్ ఎం.ఎ. అయిపోయింది.

హరిబాబు జబ్బు తగ్గుముఖం పడుతోంది.




శివరామయ్య, శాంతమ్మలు హరిబాబును చూడటానికి రెండుసార్లు వచ్చి వెళ్ళారు. అప్పుడప్పుడు వాళ్ళకు ఉత్తరాలు రాస్తున్నాడు హరిబాబు.

అయినా కాలం గడపడం దుర్భరమై పోయింది.

ఎప్పుడూ.. తిండి.. మందులు.. ఇంజక్షన్లతో విసిగిపోతున్నాడు.

తిండి కోసమే జీవిస్తున్నట్లనిపిస్తోంది అతనికి.

శానిటోరియం చెరసాలగా ఉంది.

ఎప్పుడు తను అందులోంచి బయట పడడం?

ఈ కటిక చీకట్లోంచి ఎప్పుడు తను వెలుగుల్లో పడడం?

రాజశేఖరం రోజూ సాయంత్రం హరిబాబును వెంట తీసుకొని వార్డ్సు బయటికెళ్ళి అక్కడ చెట్ల కింద కూర్చొని చల్లగాలి పీలుస్తూ హరిబాబుతో కబుర్లు చెబుతూ ఉండేవాడు.

ఆ రోజూ అలాగే ఓ వేపచెట్టు కింద కూర్చున్నారిద్దరూ.

సూర్యాస్తమయం అవుతోంది.

పడమటి ఆకాశం రక్తతటాకంలా ఎర్రగా ఉంది.

అందులో స్నానం చేసి గట్టుచేరిన మనిషిలా ఉన్నాడు సూర్యుడు.

కుంకుమ రంగు చీర కట్టుకొన్న పెళ్ళికూతురిలా ఉంది సంధ్య.

ఇలాంటి సంధ్యా సమయంలో... తను, సౌందర్య ఇద్దరూ విశాఖపట్నం బీచ్‌లో కూర్చొని ఎన్ని సాయంకాలాలు గడిపారు!

సౌందర్య! ఎంత అపురూపంగా ... నిజంగానే సార్థక నామధేయురాలు ఆమె!

సౌందర్య గుర్తుకు రాగానే హరిబాబు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. అది రాజశేఖరం గమనిస్తాడేమోనని తల మరో పక్కకు తిప్పేశాడు.

అయినా గమనించనే గమనించాడు రాజశేఖరం.

"హరీ!" అంటూ భుజం మీద చెయ్యి వేశాడు రాజశేఖరం.

హరిబాబు కళ్ళు ఒత్తుకున్నాడు.

"హరీ! ఏమిటి...ఏమిటా కన్నీరు?"

"ఏమీలేదండీ"

"చెప్పు హరీ"

"ఏం లేదు లెండి...ఏదో గతం.."

"గుర్తుకొచ్చిందా?"

అవునన్నట్టు తల ఆడించాడు హరిబాబు.

"ఏమిటా గతం?"

"ఏదైతే ఏముందిలెండి దూరమైపోయాక"

"అయితే దగ్గర కావడానికి మళ్ళీ ప్రయత్నించు"

"అది వీలుపడదులెండి"

"ఎందుకని?"

"మీరేగా చెప్పారు జీవితం పునః ప్రారంభం కాదనీ.. పురోగమనమే దాని లక్షణమని. జీవితంలో కొన్ని చేజారిపోతే... వాటిని మళ్ళీ పొందడం చాలా కష్టం. ప్రేమించడం... మనుషుల చేత ప్రేమింపబడడం అనేది కొందరి పాలిట వరమైతే...అదే నా పాలిట శాపమైంది. వర్తమాన జీవితాన్ని భరించలేనివాడు.. భవిష్యత్తుపై ఆశలు వదులుకొన్నవాడు.. గతంలో...అనుభవ తోరణంలోనుండి రాలిపోయిన రసమయక్షణాలను ఏరుకుంటూ ఇలా కన్నీరు కారుస్తూ కూర్చోక ఇంకేం చేయగలడు చెప్పండి"

అన్నాడు హరిబాబు.

కాసేపు ఎవ్వరూ మాట్లాడుకోలేదు.

"హరీ! ఇటు చూడు... ఈ అందమైన చెట్లు..ఆ చెట్లమీద పడే సాయంకాలపు ఎండ...ఆ ఎండలో మెరిసే ఆకులు...ఆ ఆకుల కదలికతో వచ్చే చల్లగాలి.. చెట్లలోంచి చెవులకు ఇంపుగా విన్పించే పక్షుల అరుపులు.. ఇదంతా ఎంతో అందంగా లేదూ?"

"అవును అందంగానే ఉందండి. కానీ ఈ ప్రకృతి సంతరించుకొన్న అందాలను చూసి ఆనందించే అదృష్టం ఇక్కడ బతికే రోగులకు లేదుగదా! ప్రతిక్షణం మృత్యుభయంతో బిరబిగుసుకపోయే రోగుల హృదయాలు ఈ పకృతి అందాల్ని చూసి స్పందిస్తాయంటే నేను నమ్మను"

"హరీ!"

"చెప్పండి"

చాలా రోజులనుండి నీకోమాట" చెప్పాలనుకొంటున్నాను"

"సందేహం ఎందుకు ? చెప్పండి"

"నువ్వు నాకోసాయం చెయ్యగలవా?"

"తప్పకుండా"

"ఆ నమ్మకంతోనే ఎప్పుడూ, ఎవరినీ చేయిచాచి అడగని నేను యివాళ నిన్ను అడుగుతున్నాను"

"తప్పకుండా మీరడిగే సాయం చేస్తాను"

"హరీ! ఖైదీని ఉరితీసేముందు..ఆఖరి కోరిక ఏమిటో అడుగుతారట. ఈ జబ్బు నన్ను ఉరితీయక మానదు. నేను బతకనని డాక్టర్లకు బాగా తెలుసు. అందుకే ఆఖరి కోరిక నిన్ను అడుగుతున్నాను"

"చెప్పండి"

"నేను...జీవితంలో ఒక దేవతను మోసం చేశాను. ఆ పాపం నన్ను వెంటాడి చివరకు యిలాశిక్షించింది నన్ను. ఆ దేవత యింకా బతికే ఉంది. ఆమెను కలుసుకొని క్షమించమని అడిగే అర్హత కూడా కోల్పోయాను నేను. నువ్వు ఈ శానిటోరియంలో పూర్తిగా ఆరోగ్యవంతుడివై ఇందులో నుండి తప్పకుండా బయటపడతావు. నేను ఆ దేవత అడ్రసు నీకిస్తాను. నువ్వు ఈ శానిటోరియంలోంచి బయటపడ్డాక ఆమెను కలుసుకొని నేనిలా ఈ శానిటోరియంలో చేసిన తప్పులకు కుమిలిపోతూ మరణించానని చెప్పి... ఆమెకు నీ చేతనైన సాయం చెయ్యగలవా హరీ!"

రాజశేఖరం ఆ మాట అడుగుతుంటే అతడి కంఠం వణికింది.

"ఆమెను తప్పకుండా కలుసుకొని సాయం చేస్తాను"

మాట యిచ్చాడు హరిబాబు.

"చాలు హరీ! నాకు కావలసింది యింకేమీ లేదు" అన్నాడు రాజశేఖరం. అతని కళ్లు ఆనందబాష్పాలతో నిండిపోయాయి.

* * *

రోజులు గడుస్తున్నాయి.

కొందరు రోగులు కొత్తగా వచ్చి చేరుతున్నారు. మరికొందరు జబ్బును నయం చేసుకొని వెళ్ళిపోతున్నారు.

రాజశేఖరానికి జబ్బు బాగా ముదిరిపోయింది.

ఆ రోజు హరిబాబుకు నిద్ర రావటం లేదు.

కాట్ మీద అటూ యిటూ దొర్లుతున్నాడు.

అతను తప్ప పేషంట్స్ అందరూ




నిద్రపోయారు. బయటంతా గాఢాంధకారం. హరిబాబు హృదయంలోలాగానే ఉందది. ఆకాశంలో మేఘాలు భయంకరంగా గర్జిస్తున్నాయి. వార్డ్ పక్కనున్న చెట్లు గాలికి ఊగుతున్నాయి. ఆకాశ దేవత భీకరంగా శోకిస్తున్నట్టు కుంభ వర్షం కురవసాగింది.

కాట్ మీద పడుకొని...

ఆ వర్షం కేసి చూస్తున్న హరిబాబుకు చటుక్కున సౌందర్య గుర్తుకొచ్చింది. ఆ రోజు కూడా యిలాగే వర్షం...తనకు బాగా గుర్తుంది. హరిబాబు మనస్సు సౌందర్య పరిచయమైన ఆ రాత్రివేపు పరుగుతీసింది.

మెడిసిన్ ఫస్టియర్ చదివే రోజుల్లో హాస్టల్లో చేరకుండా టౌన్‌లో అద్దె గది తీసుకుని ఉన్నాడతను.

మెస్‌లోంచి భోజనం తెప్పించుకుంటూ ఉండేవాడు.

గది కాస్త విశాలంగా ఉండేది.

ఎటాచ్‌డ్ బాత్‌రూమ్, లావెట్రీ లుండేవి.

ఓరోజు రాత్రి పది గంటలు దాటుతోంది. బయట వర్షం ధారాపాతంగా పడుతోంది. కళ్లు జిగేల్‌మన్పించేట్లుగా మెరుపులు మెరుస్తున్నాయి. చలిగా ఉంటే కిటికీలన్నీ మూసేసి తలుపు మూసి మంచం మీద పడుకొని ఏదో చదువుకొంటున్నాడు హరిబాబు. నిద్రకు ఉపక్రమించే ముందు వరకు తలుపు బోల్ట్ వేసే అలవాటులేదు అతనికి.

సీరియస్‌గా చదువుకొంటున్నాడు హరిబాబు.

ఇంతలో తలుపులు ఫన్‌మంటూ తెరుచుకున్నాయి.

పుస్తకంలోంచి తలెత్తి చూశాడు అతడు.

లోపలికి రాగానే తలుపులు మూసేసింది ఆ అమ్మాయి.

ఆమె వర్షంలో బాగా తడిసిపోయింది. చలికి వణుకుతోంది. తడిసిపోయిన ఆమె వెంట్రుకలనుండి నీళ్ళు కారుతున్నాయి. తడివల్ల ఆమె ఒంటికి బట్టలు బాగా అతుక్కుపోవటంచేత ఆ బట్టల్లోంచి ఆమె యవ్వనం, అవయవాల సొంపులు స్పష్టంగా కన్పిస్తున్నాయి.

ఆమె వెంట్రుకలను విప్పి బాగా విదిలించుకొని వెనక్కు వేసుకొంది మళ్ళీ. చాలా పొడవుగా పెరిగిన ఆమె జుట్టు ఆమె శిరాగ్రం నుండి మోకుతున్న చీకటి జలపాతంలా ఉంది. ఆమె అక్కడే తలుపు దగ్గర మౌనంగా నిలబడిపోయింది.

"లోపలికి రండి" అన్నాడు హరిబాబు.

ఆ మాటకోసమే ఎదురుచూస్తున్నట్టు వచ్చిందామె.

"తల తుడుచుకోండి" అంటూ టవల్ అందించాడు.

కళ్ళతోటే కృతజ్ఞతలు చెప్పిందామె.

"సారీ! నేను బ్రహ్మచారిని. నా గదిలో లుంగీలూ, బెడ్‌షీట్లూ తప్ప చీరలు లేవు" అన్నాడు మెల్లగా.

'ఫర్వాలేదు లెండి' అన్నట్లుగా చూసిందామె.

హరిబాబుకు మెడిసిన్‌లో చేరాక టీ తాగటం బాగా అలవాటైపోయింది. రోజుకు అయిదారుసార్లు కంటే ఎక్కువే తాగుతాడు. అందుకే టీ తయారుచేసుకోడానికి అవసరమైన సామగ్రి అంతా రూంలో ఉంది. అగ్గిపెట్టె అందుకుని స్టౌ

దగ్గరికెళ్ళి వత్తులు పైకి తీసి వెల్గించాడు.

"చలి కాచుకోండి" అన్నాడు హరిబాబు.

ఆమె మెల్లగా స్టౌ దగ్గరికొచ్చి నిలబడింది.

"టీ తాగుతారా?" అడిగాడు ఆమెను.

"దగ్గర్లో టీకొట్టు ఉందా?"

ఆమె గొంతు సన్నగా వీణను మీటినట్లుగా ఉంది.

"దగ్గర్లో ఎక్కడా టీకొట్టు లేదు. కానీ టీ తయారుచెయ్యడానికి కావలసిన సరంజామా రూంలోనే ఉంది. నేను తయారు చేస్తానెండి"

"మీకెందుకు లెండి అంత శ్రమ" అంది ఆమె.

"టీ తయారుచెయ్యడం మీకు తెలుసా?"



"ఎందుకొచ్చింది మీకీ అనుమానం?"

"ఈ కాలం ఆడపిల్లలకు టీ తయారు చెయ్యడంతెలుసని నేను అనుకోవడంలేదు. నేను తయారుచేసి ఇవ్వడం శ్రమ అని మీరనుకొంటే ఆ సరంజామా నేను ఇస్తాను. మీరే టీ తయారు చేసుకోండి"

'అలాగే' అంటూ తల ఆడించింది.

హరిబాబు టీకి అవసరమయ్యే సరంజామా అందించాడు.

పది నిముషాల్లో టీ తయారుచేసి రెండు కప్పుల్లోపోసి ఒకటి హరికి అందించిందామె.

"అబ్బే నాకు వద్దండి. నేను తాగి అరగంట కూడా కాలేదు"

"పర్వాలేదు తిసుకొండి. కంపెనీ సేక్"

కాదనలేక కప్పు అందుకున్నాడు



హరిబాబు.

"టీ చాలా బాగా చేశారండీ" అన్నాడు హరిబాబు.

ఆమె కళ్ళల్లో ఆనందం తొణికిసలాడింది. స్త్రీహృదయం పొగడ్తలకు పొంగిపోతుంది.

"మీరు నాగురించి ఏమీ అడగలేదు" అంది కప్పు కింద పెట్టేస్తూ.

"అంటే...?"

"అంటే నా పేరు, ఊరు, ఇంతవర్షంలో ఇలా తడుస్తూ మీ గదిలోకి రావడానికి కారణం-ఈ వివరాలేమీ మీరు అడగనే లేదు"

"మీరే ఎటూ చెబుతారుగా"

"ఒకవేళ నేను చెప్పకుంటే...?"

"అడిగి తెలుసుకోవాల్సినంత ఆసక్తి లేదు నాకు"

హరిబాబువేపు చిత్రంగాచూసిందామె.

"నా పేరు...సౌందర్య" చెప్పిందామె.

"ఫైన్"

"ఏమిటి? నా పేరా, నేనా?"

"రెండూ అనుకోండి" అన్నాడు హరిబాబు.

చటుక్కున తలెత్తి చూసింది సౌందర్య. ఇద్దరి చూపులూ ఢీకొన్నాయి.

"నేను ఇక్కడ బి.యస్సీ చదువుతున్నాను. మొన్న మా సొంతఊరెళ్ళాను. ఇవాళే తిరిగి ఆఖరి బస్‌కు వస్తున్నాను. బస్ మధ్యలో కొంచెం ట్రబులిచ్చింది. అందుకే ఇంత లేటయింది. నడిచివెళ్తుంటే వర్షం గట్టిగా పట్టుకొంది. ఏంచెయ్యాలో తోచక మీ వరండాలో కొంత సేపు తడిసి, తర్వాత గదిలోకి దూరేశాను" నవ్వుతూ చెప్పింది సౌందర్య.

"నా పేరు హరిబాబు. నేను ఇక్కడే మెడిసిన్ ఫస్టియర్ చదువుతున్నాను" చెప్పాడు హరిబాబు.

బయట వర్షం ఇంకా పడుతూనేఉంది.

ఇద్దరి మధ్య మౌనం...

"ఏమండీ" మెల్లగా పిలిచింది సౌందర్య.

ఏమిటన్నట్టుగా చూశాడు హరిబాబు.

"మీకు ఏమీ అభ్యంతరం లేకుంటే.."

"ఫర్వాలేదు చెప్పండి"

"నేను ఈ రాత్రికి ఈగదిలోనే పడుకొంటాను" అంది.

చటుక్కున తలెత్తి సౌందర్య వేపు చూశాడు హరిబాబు. "ఏమండీ! మీకు నామీద నమ్మకంలేకుంటే ఈరూంలోంచి నేను ఏమైనా పట్టుకెళ్ళిపోతానేమోనన్న సందేహం మీకుంటే చిన్నపని చెయ్యండి. మీరు మీ మంచాన్ని వాకిలి దగ్గర తలుపుకు అడ్డంగా వేసి పడుకోండి" అంది సౌందర్య.

ఆ మాటతో హరిబాబు చాలాబాధపడిపోయాడు. "సౌందర్యగారూ! మనుషుల మీద మరీ అంత అపనమ్మకాన్ని పెట్టుకొని బతికేవాడిని కాదంటే నేను. మీమీద నమ్మకం సంగతలా ఉంచి, నామీద మీకు ఉండాలిగా" అన్నాడు హరిబాబు.

"అంటే..."

"అంటే ఈ రాత్రికి ఈగదిలో మీరు పడుకొంటే నేను మిమ్మల్ని ఏమీ చెయ్యననే నమ్మకం మీకు ఉందా?"

"భలేవారండి మీరు మీ మీద నాకు ఆ మాత్రం నమ్మకం లేకుంటే నేను మీగదిలో ఉండాలని ఎలా అనుకొంటాను!"

అప్పటికే చాలా రాత్రైపోయింది.

హరిబాబు ఆవిడకి పక్కవేసి తలగడ అమర్చాడు.

అలాగే పడుకొంది సౌందర్య.

దూరంగా తన మంచంపై పడుకొన్న





హరిబాబుకు పడుకోగానే నిద్రపట్టేసింది.

బయట వర్షం సన్నగా పడుతోంది.

ఎవరో సన్నగా ఏడుస్తున్నట్టు శబ్దం రావడంతో ఛటుక్కున మెలుకువవచ్చింది హరిబాబుకు. చెవులు రిక్కించి జాగ్రత్తగా విన్నాడు. ఆ ఏడుపు తనరూంలోనే అని నిర్ధారణ చేసుకొన్నాక హరిబాబు మెల్లగా మంచం మీది నుండి లేచి లైట్ స్విచ్ వేశాడు.

విస్తుపోయాడు హరిబాబు.

సౌందర్య మంచం మీద కూర్చొని రెండు చేతుల్లో ముఖం దాచుకొని ఏడుస్తోంది.

ఎందుకు... ఎందుకలా ఏడుస్తోంది? జీవితంలో తనేమైనా మోసపోయిందా?

మెల్లగా ఆమె మంచదగ్గరికి నడిచాడు.

"ఏమండీ"

సౌందర్య తల తిప్పి కూడా చూడలేదు.

"ఏమండీ!" అంటూ ఆమె భుజం పట్టుకొని కుదిపాడు.

తలెత్తి చూసింది సౌందర్య.

"ఎందుకిలా ఏడుస్తున్నారు!" ప్రశ్నించాడు హరిబాబు.

ఆమె బదులు పలకలేదు.

"చెప్పండీ!"

"దయచేసి నన్ను ఏమీ అడగకండి"

"అడగకపోతే మీ కన్నీటికి కారణం ఎలా తెలుస్తుందండి?"

"తెలుసుకొని మీరు చేసేదేమిటి?"

"చెయ్యడం చెయ్యకపోవడం అనేది రెండో విషయమండీ! కానీ సాటి మనిషి కన్నీళ్ళు కారుస్తు కూర్చొని ఉంటే చూసి పట్టించుకోకుండ ఉండడానికి నేనేం జడపదార్థాన్ని కాదను."

"ఉదయం కాగానే మనదారులు వేరై పోతాయి. ఆ మాత్రానికి నా సోది మీకు విన్పించి మీ దగ్గర అయ్యోపాపం అన్పించుకోడమెందుకండీ?"

"ఎవరిదారులు ఎప్పుడువేరైపోతాయో, ఎవరి దారులు ఎలా కలుసుకొంటాయో మనం చెప్పలేంలెండి. ఇంతకూ మీరింత బాధపడ్డానికి కారణం చెప్పండి"

"మా నాన్నకు ఇద్దరు భార్యలు. నేను మొదటి భార్య సంతానం. మా అమ్మ బతికున్నంత వరకు నన్ను ఎంతో ప్రేమగా చూసేవాడు మానాన్న. మా అమ్మపోయి ఆరునెలలైంది. ఆమె పోయినప్పటినుండి రెండో పెళ్ళానికి విధేయుడైపోయాడు నాన్న. ఆమె మాటను కాదనే ధైర్యం ఆయనకు లేదు. ఈ చదువు మానెయ్యమని ఆమె ఒకటే పోరుపెడుతోంది. నాకేమో డిగ్రీసంపాదించి ఉద్యోగం చేసుకోవాలని ఉంది. మానాన్న నాకు డబ్బులివ్వడం మానేశాడు. కాలేజి ఫీజుకట్టడానికి డబ్బుకావాలని ఇంటికెళ్ళి నాన్ననడిగితే ఆయన పైసాయివ్వలేదు.ఇంకో సంవత్సరానికి నా చదువైపోతుంది. కానీ ఇంట్లో డబ్బుయివ్వరు. నేను ఇప్పుడు ఇంటి నుండే వస్తున్నాను. నేను దురదృష్టవంతురాలిని. నాకు చదువుకొనే అదృష్టం లేదు" అంటూ మళ్ళీ కన్నీరు పెట్టుకొంది సౌందర్య.

హరిబాబు హృదయం ద్రవించుకపోయింది.

రెండుక్షణాలు ఆలోచించి ఓ నిర్ణయాని కొచ్చాడు.

"సరే! మీరేమీ బాధపడకండి. మీ చదువు తప్పకుండా కొనసాగుతుంది"

"ఎలా సాగుతుందండి? డబ్బు..."

"నేనిస్తాను" హరిబాబు అన్నాడు.

చటుక్కున తలెత్తి హరిబాబు కళ్ళల్లోకి చూసింది సౌందర్య.

"మీరు నమ్మలేకపోవచ్చు. ఇది కలా మాయా అని మీకు సందేహం రావచ్చు. కానీ నేను నిజమే చెబుతున్నాను. మీరు చదువుతానంటే చదువుకు కావలసినంత డబ్బు నేనిస్తాను" నెమ్మదిగా చెప్పాడు హరిబాబు.

సౌందర్య కళ్ళల్లో కాంతి.

ఆమె గుండెల నిండా పొంగిపొర్లే ఆనందం.

ఆమె కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. చటుక్కున హరిబాబు చేతిని తీసుకొని ముద్దు పెట్టేసుకొంది సౌందర్య.

బిత్తరపోయాడు హరిబాబు.

* * *

అలా హరిబాబు జీవితంలో ప్రవేశించింది సౌందర్య.

ఆమె హరిబాబును బాగా ఆకట్టుకుంది.

అతడికి ఎప్పుడూ ఆమే ప్రపంచం.

జీవితంలో సౌందర్యం అనేది ఎదురైనప్పుడు జీవితం తన గమనాన్ని కొంత సేపు ఆపుకొని ఎదురైన ఆ సౌందర్యం చుట్టూ పరిభ్రమిస్తూ ఉండిపోతుంది.

యువతీయువకుల నడుమ ఉండే బలీయమైన ఆకర్షణ ఆ యువతీ యువకులను ప్రభావితం చేసినట్లు "జీవితంలో మరే విషయమూ వాళ్లను అంత అధికంగా ప్రభావితం చెయ్యదేమో! బహుశా ఏ యువకుడూ,ఏయువతీ ఆ ఆకర్షణ నుండి తప్పించుకోడానికి వీలుకాదేమో!

హరిబాబు, సౌందర్య ఇప్పుడు రోజూ కలుసుకొంటున్నారు.

సినిమాలకూ, షికార్లకూ తెగ తిరుగుతున్నారు.

చీకటి పడేవరకు బీచ్‌లో కాలక్షేపం.

ఒకరంటే ఒకరికి ప్రాణం.

సౌందర్యను కలుసుకోని రోజు హరిబాబుకు వెలితిగా ఉండేది.

ఆదివారం పూట సౌందర్య ఉదయం నుండి సాయంత్రం వరకు హరిబాబు రూంలోనే గడిపేస్తోంది. ఆమెకు కావలసినంత డబ్బును హరిబాబు పుష్కలంగా ఇస్తున్నాడు. కళ్ళముందు డబ్బు కర్పూరంలా కరిగిపోతోంది. అయినా దానిని గుర్తించే స్థాయిలో లేడు హరిబాబు.

స్త్రీ కోసం...

తలలు పగులగొట్టుకున్న వాళ్లున్నారు.

రాజ్యాలను తగలబెట్టుకొన్న వాళ్లున్నారు.

కానీ ఆ స్థితిలో ఎవరూ దాన్ని గుర్తించలేదు.

హరిబాబు ఇప్పుడు డబ్బు ఎందుకు అంత ఎక్కువగా పంపించమని ఉత్తరాలు రాస్తున్నాడో శివరామయ్యకు అర్థంకావడం లేదు. ఆ విషయం ఆయన హరిబాబును అడగనూ లేదు. కారణంహరిబాబు ఖర్చు పెట్టే డబ్బంతా అతనిదే.వాళ్ళ పొలాన్ని సాగుచేయించి, పంటలు అమ్మి ఆ డబ్బును హరిబాబుకు పంపిస్తున్నాడు శివరామయ్య. అంతేగాని ఆయన తన సొమ్ము పంపించడంలేదు.

రోజులు దొర్లిపోతున్నాయి నిముషాల్లా.

హోటళ్ళు, సినిమాలు, షికార్లు, సౌందర్యకు కానుకలు- ఇదే హరిబాబు జీవితం. రాత్రింబవళ్ళూ సౌందర్య ధ్యాసే అతనికి.

ఆరోజు ఆదివారం

హరిబాబు గదిలో అతని మంచం మీద...

సౌందర్య ఒడిలో తల పెట్టుకొని పడుకొన్నాడు హరిబాబు.

"సౌందర్యా!"

"ఊఁ"

"చాలా చిత్రంగా లేదూ?"

"ఏమిటి?"

"నువ్వు నాకు పరిచయం కావడం... మన దారులు కలుసుకోవడం..."

"ఎవరి దారులు ఎప్పుడు ఎలా కలుసుకొంటాయో మనం చెప్పలేమని నువ్వేగా చెప్పావు. మనం అనుకోకుండా జరిగే ప్రతి విషయం మనకు చాలా చిత్రంగా అనిపిస్తుంది హరీ!" అంటూ అతడి వెంట్రుకల్ని చేతో సర్దసాగింది సౌందర్య.

"సౌందర్యా!"

"ఊఁ"

"నీ ఒడిలో... ఇలాగే..."

"ఊ ఇలాగే... చెప్పుమరి"

"జీవితాంతం ఉండిపోవాలన్పిస్తోంది"

"అబ్బా! ఆశ"

ఇద్దరి నడుమ రెండు క్షణాల మౌనం.

"రేపటి నుండి మాకు సెలవులు" అన్నాడు హరి.

"ఊరికి వెళతావా?" అడిగింది సౌందర్య.

"నిజానికి వెళ్ళాలని లేదు..."

"ఏం ఎందుకని?"

"నిన్ను వదిలి నేను అన్నాళ్లు ఉండగలనా?"

"అయితే నన్నూ తీసుకపో మీ ఊరికి"

"ఓకే. అలాగే"

"నిజంగా?" సందేహంతో ప్రశ్నించింది సౌందర్య.

"ఇప్పుడు కాదు"

"ఇంకెప్పుడు?"

"మన పెళ్లి అయిన తరువాత"

మళ్లీ రెండు క్షణాలు మౌనంగా గడిచాయి.

"నిజానికి సెలవుల్లో నాకు ఊరు వెళ్లాలని లేదు. కానీ ఊరి నుండి వచ్చి చాలా రోజులైపోయింది. ఊరికి వెళ్ల కుండా ఇన్నాళ్లు ఎప్పుడూ నేనుండలేదు. మా బాబాయి, పిన్నికి నన్ను చూడాలని పిస్తోందట. అందుకే తప్పకుండా రమ్మని మరీ మరీ రాశారు" చెప్పాడు హరిబాబు.

"వాళ్ళకు నువ్వంటే ప్రేమగా ఉన్నట్టుంది."

"అవును సౌందర్యా! నేను కన్న కొడుకుతో సమానం వాళ్ళకు"

"అయితే ఊరెళతావన్నమాట"

"అవును. రేపు ఉదయం ట్రైనుకు"

"మళ్ళీ ఎప్పుడొస్తావు హరీ" అడిగింది సౌందర్య.

"దేవిగారిని చూడకుండా నేను అక్కడుండగలనా? వెళ్లి రెండ్రోజులుండి మళ్లీ వచ్చేస్తాను. నేను వెళ్లినా నా మనసు ఇక్కడే ఉంటుంది."

"అబ్బో! అబ్బాయిగారికి కవిత్వం వస్తోందే" నవ్వింది సౌందర్య.

"సౌందర్యా! నువ్వు నవ్వుతుంటే ఎలా ఉందో తెలుసా?"

"ఎలా ఉంది?"

"మంచు కురిసినట్లు చల్లగా, మల్లెలు విరిసినట్లు హాయిగా, మబ్బులలో మెరుపు మెరిసినట్లు..."

"ఓల్డాన్, ఓల్డాన్. కవిత్వం చాలు గానీ ఇక వెళతాను"

"రేపు ఉదయం స్టేషన్‌కు వస్తావా?" అడిగాడు హరి.

"వీలుంటే..." చెప్పింది సౌందర్య.

"వీలుంటే కాదు. తప్పక రావాలి" అంటూ సౌందర్య ఒడిలోనుండి పైకి లేచాడు హరిబాబు.

క్షణంలో ఇద్దరి పెదవులూ కలుసుకొన్నాయి.

* * *

హరిబాబు ఇంటికొచ్చి వారం కూడా కాలేదు.

ఊళ్ళో ఉండడం మహా విసుగ్గా ఉంది అతనికి.

అతని మనసంతా విశాఖపట్నంలోనే ఉంది.

సౌందర్య నుండి ఉత్తరం రాలేదు.

రోజూ వేయికళ్ళతో ఉత్తరం కోసం ఎదురుచూస్తున్నాడు.

సౌందర్య మీద అతనికి బోలెడంత కోపంవస్తోంది. ఇక ఊళ్ళో ఉండలేక పోయాడు హరిబాబు. వెంటనే విశాఖపట్నం బయలుదేరాడు. వచ్చి వారం రోజులు కూడా కాకనే తిరుగు ప్రయాణమవుతున్న హరిబాబును చూసి ఆశ్చర్యపోయారు శివరామయ్య, శాంతమ్మలు. ఇంకా ఓ వారంరోజులు ఉండమని వాళ్లు హరిబాబును బలవంతంచేశారు. కానీ తనకు చదువుకొనే పనిఉందని అబద్ధం చెప్పి విశాఖపట్నం బయలుదేరాడు హరిబాబు.

ట్రెయిన్‌లో కిటికీదగ్గర కూర్చున్నాడు హరిబాబు.

ప్రయాణాల్లో కిటికీ దగ్గర కూర్చోవడం అతని అలవాటు.

అబ్బ! ఈ ట్రెయిను ఎప్పుడు చేరుకొంటుంది విశాఖపట్నం?

తను సౌందర్యను చూసేదెప్పుడు?

తన మెడిసిన్ పూర్తి అవడానికి ఇంకా నాలుగైదు సంవత్సరాలు పడుతుంది. అంతవరకు సౌందర్యను పెళ్ళి చేసుకోకుండా తను ఎలా ఉండడం?

ఆరు నెలల్లో సౌందర్యకు బి.యస్సీ అయిపోతుంది.

తర్వాత ఆమెను యం.యస్సీలో చేర్పించాలి.

రీసెర్చిమీద ఇంట్రెస్ట్ ఉంటే తర్వాత పి. హెచ్ డి.లో చేర్పించాలి. తనకు హౌస్‌సర్జన్ అయిపోయేసరికి సౌందర్యకు దాదాపు పి. హెచ్.డి. కూడా అయిపోవచ్చు.

ట్రెయిన్ తన గమ్యం చేరుకొంది.

లగేజి తీసుకుని స్టేషనులో దిగాడు హరిబాబు.

పావుగంటలో తనగది చేరుకున్నాడు.

గది తాళం తీశాడు.

నేలమీద ఏవో రెండు మూడు ఉత్తరాలు పడిఉన్నాయి. లగేజిగదిలో పెట్టి రిక్షావాడికి డబ్బులిచ్చి పంపేసి, బట్టలు మార్చుకొని మంచంమీద పడుకొని ఉత్తరాలు తీశాడు హరిబాబు.

అందులో ఒకటి ప్రసాద్ నుండి వచ్చింది.

రెండోది ఓ ఫ్రెండునుండి వెడ్డింగ్ కార్డ్.

మూడో ఉత్తరం చించి చదవసాగాడు హరిబాబు.

"డియర్ హరీ!

ప్రపంచంలో మగవాళ్ళలో చాలామంది మోసగాళ్లు ఉంటారని అనుకొనే నాకు, మగవాళ్ళలో చాలా అమాయకులు కూడా ఉంటారనే విషయం నిన్ను చూశాకే అర్థం అయింది. నువ్వు పరిచయం అయిన పది నిమిషాల్లోనే నువ్వు చాలా మంచివాడవనీ, మనుషులమీద నమ్మకం




గలవాడవనీ అర్థమైంది.

కానీ హరిబాబూ! మనుషుల్ని తేలికగా నమ్ముకుంటూపోతే ఈ ప్రపంచం నిన్ను బతకనివ్వదు. నీ మంచితనాన్ని ఈ ప్రపంచం బాగా ఉపయోగించుకుంటుంది. నాకు తెలుసు నేనంటే నీకు చాలా ఇష్టమని. నువ్వు అంతగా నన్ను ఇష్టపడ డానికి కారణం నేనే. నేను నీ దగ్గర అలా ప్రవర్తించాను.

నువ్వు నన్ను ప్రేమించావు.

కానీ నేను నీడబ్బును ప్రేమించాను.

ఛీ అని అనుకొంటున్నావు గదూ? నాకు హృదయం లేదనుకొంటున్నావు గదూ? కానీ హరిబాబూ! నాకుహృదయమే లేకుంటే నేను నిన్ను ఇంకా బాగా మోస గించి, నిన్ను ప్రేమిస్తున్నట్టు నటించి ఇంకా కావలసినంత డబ్బును నీనుండి గుంజు కొని ఉండేదాన్ని. పతితలకూ హృదయ ముంటుంది హరిబాబూ! అవును నేను పతితనే. చెడిపోయిన దాన్ని...కాదు చెడి పోగొట్టబడ్డదాన్ని. నేను బి.యస్సీ చదవడం లేదు. అంతా నటన.

ఆరోజురాత్రి నేను కావాలనేఏడ్చాను. ఆ ఏడుపు నిద్రపోయే నీకు మెలుకు వను తెప్పిస్తుంది. నువ్వు మేల్కొని నా కన్నీటికి కారణం ఏమిటని అడుగుతా వని నాకు తెలుసు. అనుకొన్నట్టే జరి గింది ఆరోజు. తర్వాత నేను చెప్పిన కట్టు కథనంతా నిజమని నమ్మావు.

కానీ నీ మంచితనాన్ని, నువ్వునామీద చూపించే ప్రేమనీ భరించలేక దూరంగా వెళ్ళిపోతున్నాను. నీ చేత ప్రేమించబడే అర్హత నాకు ఏమాత్రమూ లేదు. ఎంగి లాకులాంటి నా జీవితాన్ని నీకు అర్పించి పవిత్రమైన, స్వచ్ఛమైన నీ జీవితాన్ని కళంకితం చెయ్యలేను.

నాగురించి నీకు ఏమీ తెలీకుండా చాలా జాగ్రత్తపడాల్సి వచ్చింది. కానీ ఏదో ఒకరోజు అవన్నీ బయటపడక పోవు. నువ్వు నన్నసహ్యించుకోకపోవు. అందుకే ముందే తప్పుకొంటున్నాను.

స్త్రీని ప్రేమించే గొప్ప మనసు నీలోనే చూశాను. కానీ కన్పించిన ప్రతి స్త్రీనీ నమ్మి ప్రేమించకు, అందగా ఉన్నాయి గదా అని కన్పించే ప్రతి పువ్వునూ వాసన చూశావంటే కొన్ని కంపుకొడతాయి. మరి కొన్నిటిలో పురుగులుంటాయి. నేను అలాంటిదాన్నే. క్షమించి నన్ను మరిచిపో.

—సౌందర్య"

హరిబాబు గుండెలు బద్దలైపోయాయి.

అతడి ప్రేమ నీటి బుడగలా చిట్లి పోయింది. అతడు కన్నకలలన్నీ వల్ల కాట్లో శవంలా తగలబడిపోయాయి. అతడి కళ్ళల్లో అశ్రుజ్వాలలు.

తోడుగా ఉంటుందని అనుకొన్న సౌందర్య తనను ఒంటరివాణ్ని చేసింది. శాశ్వతమనుకొన్నది క్షణికమైపోయింది.

తలగడలో ముఖం దాచుకొని విలపిం చాడు హరిబాబు.

ప్రేమభావన పుస్తకాలలో తప్ప ప్రపంచంలో కన్పించదని అన్నది ఎవరో గానీ ఎంత నగ్న సత్యాన్ని చెప్పాడు!

స్త్రీని ప్రేమించడం నేరమైతే దాని కిదేనా శిక్ష?

తన జీవితంతో ఎందుకిలా ఆడుకొం టున్నారు వీళ్ళు?

అమృతను తనకు కానీయకుండా చేసింది కాలకన్య.

ఇప్పుడు తనను ప్రేమించే అర్హత లేదని వెళ్ళిపోయింది సౌందర్య.

తమంత తామే వీళ్ళు తన జీవితం



లోకి ప్రవేశించారు. కొన్నాళ్ళు తన జీవితంతో ఆడుకొన్నారు. ప్రేమ ఊబిలోకి తనను లాగారు. చివరకు అందులో తనను ముంచేసి, ఒంటరిగా వదిలేసి వెళ్ళిపోయారు.

ఎంత అన్యాయం! ఎంత దారుణం!

ఇంకెప్పుడూ ఆడదాన్ని తన జీవితంలోకి ప్రవేశించడానికి తను అవకాశం ఇవ్వకూడదు. ప్రేమ శిఖరాన్ని అధిరోహించాలని ప్రయత్నించి తను ఇప్పటికే పట్టుతప్పి అగాధాలలోకి జారిపడిపోయాడు. ఒక్కసారికాదు... రెండుసార్లు.

కానీ... ఆ పడడంతో తగిలిన గాయాలే తనకు గుణపాఠాలు. జీవితమంతా అవి తనను హెచ్చరిస్తూనే ఉంటాయి.

* * *

రాజశేఖరం గట్టిగా దగ్గడంతో హరిబాబు గతంలోంచి వర్తమానంలోకొచ్చాడు. ఆ వార్డ్‌లో ఒక్క రాజశేఖరం దగ్గు, నిద్రపోయే రోగుల ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తప్ప మరేమీ విన్పించడం లేదు.

వార్డ్ బయట వర్షం సన్నగా పడుతోంది.

గతాన్ని తవ్వుకొని సౌందర్యను గుర్తుకు తెచ్చుకొన్న హరిబాబు గట్టిగా ఓ నిట్టూర్పు విడిచాడు. ఆ నిట్టూర్పులో జీవితంపై విసుగు, అనుభవాల అలసట మిళితమై ఉన్నాయి.

ఆ ఉదయం వార్డ్‌లో...

రాజశేఖరం ఆయాస పడుతున్నాడు. రక్తం వాంతి చేసుకొంటున్నాడు.

ఆవేశంతో రొప్పుతున్నాడు.

డాక్టర్లు, నర్సులు ఆయన్ను చుట్టు ముట్టారు. తమ ప్రయత్నాలేవో తాము చేస్తున్నారు. హరిబాబుకు భయంగా ఉంది. ఒంట్లో వణుకు పుడుతోంది.

విలవిలలాడిపోతున్నాడు రాజశేఖరం

డాక్టర్స్ ముఖాలలో కంగారు.

నర్సులు ఆందోళనగా అటూ ఇటూ పరుగెడుతున్నారు.

కొంత సేపు గడిచింది.

డాక్టర్స్ ప్రయత్నాలు ఫలించలేదు.

రాజశేఖరం గుండె కొట్టుకోవడం మానేసింది.

డాక్టర్స్ నిట్టూర్పులు వదిలారు.

మృత్యు విహంగం రాజశేఖరం జీవితాన్ని వేగంగా తన్నుకపోయింది. అతని భౌతికదేహాన్ని త్యజించి ఆత్మ అనంత వాయువుల్లో ఐక్యమైపోయింది. చలనరహితంగా పడిఉన్న రాజశేఖరాన్ని చూడలేకపోయాడు హరిబాబు.

ఆ వార్డ్‌లో ఒక బెడ్ ఖాళీ అయింది. రాజశేఖరం ఇకలేడు.

తను కన్నీరు పెట్టుకొంటే ఓదార్చ డానికి అతను ఇకరాడు.

రాజశేఖరం ఎంత బాగా ధైర్యం చెప్పేవాడు! నిండుకొన్న నిరాశలను ఛేదించి ఆ వార్డ్‌లోని రోగులందరికీ జీవితంపై ఎంతబాగా ఆశలను పుట్టించే వాడు!

ఛిద్విలాసపు సృష్టి సంగీతంలో రాజశేఖరం ఒక తెగిపోయిన రాగం. రక్తమాంసాల పంజరంలోంచి అతని ఆత్మకు విముక్తిని ప్రసాదించిందీ రోగం.

వార్డ్‌లో ప్రతి పేషంట్ ముఖంలోనూ వేదన.

ఆత్మీయుడు రాజశేఖరం పోయాడని వాళ్ళ గుండెల్లో మథన. అందరినీ పలకరిస్తూ, అందరినీ ఓదార్చే రాజ శేఖరం పోవడంతో తమ శరీరంలోని ఒక అవయవాన్ని పోగొట్టుకొన్నట్ల యింది వారికి.




ఒంటరివాడైపోయాడు హరిబాబు.

రాజశేఖరం లేనిలోటు ఆ వార్డ్‌లో కన్పిస్తూనే ఉంది.

హరిబాబు ఎవరితోనూ మాట్లాడటం లేదు.

రోజులు దొర్లిపోతున్నాయి.

ఒంటరితనం వేధిస్తోంది.

అప్పుడప్పుడూ గుర్తుకొచ్చి గతం బాధిస్తోంది. ప్రపంచమంతా ఒకటైనట్టు, తాను మాత్రమే ఒకడైనట్టు అన్పిస్తోంది హరిబాబుకు. సాయంత్రం పూట వార్డ్ లోంచి బయటకెళ్ళి చెట్లకింద కూర్చోవటం లేదు. ఎప్పుడైనా అలావెళ్ళి కూర్చుంటే రాజశేఖరం గుర్తుకొచ్చి హృదయమంతా భారమైపోయేది.

జీవితం నిస్సారంగా, శానిటోరియం చెరసాలలా తయారైంది

తనకీ రోగం నయమయ్యేది ఎప్పుడు? ఈ శానిటోరియం నుండి బయటపడేది ఎప్పుడు?

ఒకవేళ తన వ్యాధినయమై, తను

పూర్తిగా ఆరోగ్యవంతుడై బయటకెళితే తను ఒక క్షయరోగి అనే దృష్టితోనే చూస్తారేమో తనను?తనకావ్యాధి నయమై పోయినా తన పక్కన కూర్చోడానికే భయపడతారేమో?తనొక వ్యాధిగ్రస్తుడని అందరూ చిన్నచూపు చూస్తారేమో...? అదే నిజమైతే తను ఈ రోగంతో ఇక్కడే చచ్చిపోవడమే నయం.

సాయంత్రమైంది.

ఎర్రగా మండుతోంది పడమటి ఆకాశం.

కొలిమిలో కాలే ఇనుప ముక్కలా ఉన్నాడు సూర్యుడు.

వార్డులో ఎవరూ లేరు హరిబాబు తప్ప.

రోగులందరూ బయటకెళ్లి చల్లగాలి పీలుస్తున్నారు. కొందరు గుంపులు గుంపులుగా చేరి లోకాభిరామాయణం మాట్లాడుకొంటున్నారు.

ప్రసాద్‌కు ఉత్తరం రాద్దామని పెన్నూ, ఓ నోట్ బుక్కూ తీసుకొని వార్డులోంచి బయటపడ్డాడు హరిబాబు. ఎక్కడైనా అనువైన చోట ఒంటరిగా కూర్చొని ఉత్తరం రాద్దామని కలయ చూస్తున్న హరిబాబుకు దూరంగా ఓ వేప చెట్టూ, దాని కింద ఓ వెడల్పయిన రాతి బండ కన్పించింది. వార్డుకు కొద్ది దూరంగా ఉంది.

మంత్రముగ్ధుడిలా అక్కడికి నడిచాడు హరిబాబు.

అవును...ఇదే వేప చెట్టు...ఇదే రాతిబండ...

ఇక్కడే... ఇక్కడే...తనూ,నీలిమ కబుర్లు చెప్పుకొంది.

ఆ అనుభవమే వేరు. ఆ అనుభూతి ఏ రచయిత ఊహకూ అందనిది. ఏ కవి వర్ణనకూ పీలుకానిది.

ఈ వేప చెట్టుకింద...

ఇదే రాతిబండ మీదే...

తను, నీలిమ పక్క పక్కన కూర్చొని ఒకరి శరీరం యింకొకరి శరీరానికి రాసుకొంటుంపగా తను ఎన్ని గాలి మేడలు కట్టుకొన్నాడు! ఎన్ని ఊహా సౌధాలు నిర్మించుకొన్నాడు!

ఆ గాలి మేడలు కూలి...

ఆ ఊహా సౌధాలు కాలి...

చివరకు తనకు అనంతమైన వేదనను మిగిల్చాయి. తన హృదయంలో నీలిమ పట్ల గూడుకట్టుకున్న ప్రేమ భ్రమకాదు. మిథ్య అంతకన్నా కాదు. తన హృద యంలో ఆరిపోయిన ప్రణయజ్యోతిని ఏ నీలిమ మళ్ళీ వెలిగించిందో...మనుషుల్ని ప్రేమించడం మానేసిన మనసుకు ప్రేమ అభిమానాన్ని ఏ నీలిమ నేర్పిందో ఆ నీలిమ మంచులా కరిగిపోయి, మానులా ఒరిగిపోయి కేవలం తన జ్ఞాపకాలతోనే జీవించమని శపించి తనకు దూరమై పోయింది.

నీలిమ ఎంత అందంగా ఉండేది!

అజంతా శిల్పంలా,పాలరాతి బొమ్మలా నీలిమ మాట్లాడితే ఎంత బావుండేది!

మల్లెలువిరిసినట్లు,తొలకరిజల్లు కురిసి నట్లు సముద్ర కెరటాల్లా హరిబాబు మనో జలధిలో నీలిమ జ్ఞాపకాలు ఉధృతంగా ఎగిసిపడ్డాయి.

మెడిసిన్ థర్డ్‌యియర్ చదివే రోజు లవి.

అప్పుడు ప్రసాద్‌కూడా అక్కడే యం. ఏ. ఫైనల్ చదివేవాడు. ఇద్దరూ ఒకేచోట పెద్ద గది తీసుకొని ఉండేవాళ్లు.

ఒకరోజు సాయంత్రం వేళ...

బీచ్‌లో ఒంటరిగా నడుస్తున్నాడు

హరిబాబు.

బీచ్‌లో అక్కడక్కడా మనుషులు. ఇసుక రేపుకొంటూ ఏదో ఆలో చించుకుంటూ మెల్లగా నడుస్తున్న హరి బాబు ఒక్కసారిగా ఆగిపోయాడు.

ఇసుకలో అతని చెప్పుకాలికి ఏదో తగిలింది.

ఏమిటా అని వంగి చూశాడు.

ఎవరిదో పర్సు.

తీసి చూశాడు.

అందులో ఓ వందరూపాయలనోటు, ఆరు పదిరూపాయల నోట్లు, మరికొంత చిల్లర ఉంది. అదే పర్సులో చిరునామా గల ఓ కాగితం ముక్కకూడా కన్పిం చింది.

సీలిమ, సెకండ్ బి.ఏ.

అక్షరాలు ఎంత అందంగా ఉన్నాయి! అయితే అందులోని అడ్రసు ఇక్కడిది కాదు. అందమైన అక్షరాలతో ఆ కాగితం ముక్కలో ఉన్నది ఆమె స్వగ్రామపు చిరునామా.

తను పుట్టి పెరిగింది ఆ జిల్లాలోనే, ఆ తాలూకాలోనే. ఈ విశాఖపట్నానికి ఆ ఊరు చాలా దూరం. ఎవరీ సీలిమ? అంత దూరం నుండి ఇక్కడికెందుకొచ్చినట్టు? ఈ బీచ్‌లో పర్సు ఎలా పోగొట్టుకున్నట్టు? బంధువులెవరైనా ఉంటే వచ్చిందేమో! బీచ్‌ని చూడడానికొచ్చి పర్సు పోగొట్టు కొందేమో!!

ఆ మరుసటిరోజు ఉదయం ఆ డబ్బును ఎం.ఓ. చేస్తూ ఆ పర్సు తనకు బీచ్‌లో ఎప్పుడు ఎలా దొరికిందో వివ రంగా ఆ అమ్మాయికి ఓ లెటర్ రాశాడు హరిబాబు.

పదిరోజుల తర్వాత జవాబు వచ్చింది.

అలా ఆ అమ్మాయినుంచి ఉత్తరం వస్తుందనుకోలేదు హరి.

"హరిబాబుగారికి నమస్కారాలు.

కాలేజీకి వెళదామని రెడీ అవుతుంటే పోస్ట్‌మన్ వచ్చి మీరు పంపిన మని యార్డరూ, రాసిన ఉత్తరమూ అందించాడు. వైజాగ్‌నుండి ఎం.ఓ అనగానే ఆశ్చర్య పోయాను. ఎందుకంటే వైజాగ్‌లో నాకు తెలిసినవాళ్లెవరూ లేరు. మీరు భలే వారండి—ఉత్తరంలో మీరు ఫ్రమ్‌అడ్రస్ కూడా రాయలేదు. పోస్ట్‌మాన్ దగ్గర ఎం. ఓ కూపన్‌లోని మీ అడ్రసును నోట్ చేసుకొని మీకు ఈ ఉత్తరాన్ని రాస్తు న్నాను.

అబ్బ! మీ అక్షరాలెంత బాగున్నా యండీ! చాలా ముద్దుగా... అచ్చం ప్రింటు లాగే ఉన్నాయి. ఈమధ్య మేము కాలేజీ తరపున అమరావతి, నాగార్జునసాగర్, భీమిలి టూర్ వచ్చి వైజాగ్‌లో దిగాం. ఆ సాయంత్రం నేను మా ఫ్రెండ్స్‌తో కలిసి బీచ్‌లో తిరుగుతుంటే నా పర్సు ఎక్కడో పోయింది. చివరికది మీకు దొరికింది.

దొరికిన పర్సు, దానిలోని డబ్బును ఇంకెవరయినా అయిఉంటే హాయిగా ఖర్చుపెట్టుకొని ఉండేవాళ్లు. కానీ మీరు ఇలా పంపారంటే అది మీ సంస్కారానికీ, సహృదయతకు నిదర్శనం. మీలాంటి వారు ఈ సమాజంలో ఎందరుంటారు చెప్పండి? అన్నట్టు చెప్పడం మరిచాను. నేను ఇక్కడ మదనపల్లి బి.టి. కాలేజీలో బి.ఏ సెకండియర్ చదువుచున్నాను. నాకు మీతో కలం స్నేహం చెయ్యాలని ఉంది. దయచేసి బదులు రాస్తారుగదా. మీ ఉత్తరంకోసం ఎదురుచూస్తూ ఉంటాను.

సీలిమ"

హరిబాబు మరో రెండుసార్లు చదివాడు




ఆ ఉత్తరాన్ని.

ఇప్పుడు తనేమిటి చెయ్యడం? రాయాలా, మానుకోవాలా ? ఏమో ఈ అమ్మాయి పరిచయం చివరకు తనకేమి మిగిలిస్తుందో! ఉత్తరం రాయకుంటే ఏమనుకొంటుంది? తనను పిరికివాడను కొంటుందేమో. అయినా అనుకొంటే తన కొచ్చే నష్టం ఏమిటి?

హరిబాబు జవాబు రాయలేదు. పది హేనురోజులు గడిచాక మళ్ళీ హరిబాబుకు నీలిమ నుండి ఉత్తరం వచ్చింది.

"హరిబాబుగారికి, మీనుండి ఉత్తరం వస్తుందని ఇన్నాళ్ళూ ఎదురుచూసి చివరకు విసుగెత్తి మళ్ళీ మీకు ఉత్తరం రాస్తున్నాను.

అమ్మాయితో స్నేహంచేస్తే ఏం కొంపలు మునిగిపోతాయోనని భయపడు తున్నారా?చూడండి– స్నేహం అనేది చాలా ఉన్నతమైంది. మధురమైంది. దానికి మగ ఆడ అంటూ భేదమేముంది చెప్పండి?

నిజం చెప్పాలంటే జీవితంలో మొదటి సారిగా నేను మీకు, అంటే మగవాళ్ళకు ఉత్తరం రాసింది ఇరవై రోజుల క్రితమే. అది మీకే! మీకుతప్ప నేనింతవరకు ఏ మగవాడికీ రాయలేదు. నాతో స్నేహం చెయ్యడం మీకు ఇష్టంలేకుంటే ఆ విషయ మైనా రాసెయ్యండి. సెలవు–నీలిమ"

సందిగ్ధావస్థలో పడిపోయాడుహరిబాబు.

అవును.. నీలిమ చెప్పినట్లు ఆడ వాళ్ళతో స్నేహం చేస్తే ఏం కొంపలు మునుగుతాయో అని తను భయపడిన మాట నిజమే.

అయినా ఈ నిజాన్ని నీలిమ ఎంత బాగా ఊహించింది!

గతంలో నేర్చుకొన్న గుణపాఠాలు తనకు గుర్తున్నాయి.

వాటిని తను అంత తొందరగా మరచి పోగలడా?

అందుకే తను నీలిమతో స్నేహం చెయ్యడానికి సందేహిస్తున్నాడు. అయినా నీలిమ ఎక్కడో చాలా దూరంలో ఉంది. ఆ అమ్మాయిని కలిసేందుకు కూడా తనకు అవకాశం లేదు. తను కేవలం ఉత్తరాలేగా రాసేది. ఒక పెన్‌ఫ్రెండ్‌గా ఉత్తరాలు రాసుకొంటే తప్పేమిటి?

బాగా ఆలోచించాడు హరిబాబు.

చివరకు నీలిమకు ఉత్తరం రాయ డానికి నిశ్చయించుకొని పేపరూ, పెన్ అందుకొని ఉత్తరం రాయడం మొద లెట్టాడు హరిబాబు.

"నీలిమగారికి.. మీరు రాసిన రెండు ఉత్తరాలూ అందాయి.

మొదట్లో ఉత్తరం రాయనందుకు ఏమీ అనుకోకండి.

నేను మెడిసిన్ మూడో సంవత్సరం చదువుతున్నాను.

ఒంటరితనమంటే నాకు చాలా ఇష్టం. అది తెలిసేనేమో నా వాళ్ళందరూ నన్ను వదిలేసి వెళ్ళిపోయారు. ఎక్కడికో తెలుసాండీ? పరలోకానికి. నాకు చీకటంటే కూడా చాలా ఇష్టం. ఎందుకంటే... దానికీ, నా జీవితానికీ పెద్ద తేడా లేదు కనుక. నాకు ప్రత్యేకమైన హాబీలంటూ ఏమీలేవు. శెలవు మరి.

–హరిబాబు"

ఉత్తరం రాయడం ముగించి పోస్ట్ చేశాడు.

తర్వాత నీలిమ నుండి రాబోయే ఉత్తరం కోసం...

అతనికి తెలియకుండానే అతనిలో ఏదో నిరీక్షణ.

ఒక రోజు నీలిమ నుండి ఉత్తరం

వచ్చింది.

"మిత్రులు హరిబాబుగారికి...

ఈ రోజు ఉదయం క్లాస్‌లో కూర్చొని పాఠం వింటుంటే...

చటుక్కున మీరు గుర్తుకొచ్చారు.

అప్పుడనుకొన్నాను-మీనుండి అసలు బదులే రాదేమోనని. అలా అనుకోగానే ఎందుకో మనసులో ఎక్కడో బాధేసింది. తర్వాత పాఠం ఏమీ ఎక్కలేదు.

హమ్మయ్య! ఇవాళ మీ నుండి ఉత్తరం వచ్చింది.

మీ ఉత్తరాన్ని చూడగానే ఎంతో ఆనందం వేసింది.

మీ ఉత్తరంలో ఎందుకో నాకు మీ వేదన కన్పించింది. మీరు ఒంటరి అయిపోయినందుకు బాధపడకండి. అసలు ప్రపంచంలోకల్లా ఏకాకిగా ఉన్నవాడే మహా బలవంతుడని 'ఇబ్సెన్' అంటాడు. మీకన్నా చిన్నదాన్ని కనుక గౌరవ బహువచనాలు వాడకండి.

ఇప్పుడు నేనేం చేస్తున్నానో తెలుసాండీ? మీకు ఉత్తరం రాస్తూ చాక్లెట్ చప్పరిస్తున్నాను. మీకూ కావాలా? సారీ ఎంగిలైపోయింది.

నా హాబీలను గురించి అడిగారు.

నాకు అప్పుడప్పుడూ తెలుగుకవిత్వం చదవడం హాబీ. కృష్ణశాస్త్రిలోని కృష్ణపక్షపు కటికచీకటిలాంటి బాధ, శ్రీశ్రీలోని రగులుకొనే రాక్షసిబొగ్గు లాంటి ఆవేశం, బైరాగిలో చీకటి నీడల్లా పాకే నిశ్శబ్ద వేదన-ఇవంటే నాకు చాలా ఇష్టం.

పోతే ఇకనుండి మీరు ఒంటరివారు కాదు.

మీకు నీలిమ అనే ఫ్రెండ్ ఉందని మరచిపోకండి. ఇక ఉంటాను. జవాబు రాయండి. నీలిమ"

ఆ ఉత్తరాన్ని ఎన్నిసార్లు చదువుకొన్నాడో హరిబాబుకే తెలియదు. అతని మనస్సు అనిర్వచనీయమైన ఆనందంతో నిండిపోయింది.

అబ్బ! ఎంత ఆప్యాయంగా రాసింది.

కానీ ఆ కవిత్వం విషయమే తనకు అర్థం కావడం లేదు.

చాలా తెలివైన పిల్లలా ఉంది నీలిమ.

నీలిమను గురించి ఆలోచించడం మొదలెట్టాడు. హరిబాబు హృదయంలో ప్రత్యేకమైన అభిమానం ఏర్పడిపోయింది నీలిమపై.

* * *

అలా ఉత్తరాల ద్వారా ఆ ఇద్దరూ సన్నిహితులయ్యారు.

వారి మధ్య ఉండే బహువచన ప్రయోగాలు తొలిగాయి.

పేజీలకు పేజీలుగా ఉత్తరాలు రాసుకొంటున్నారు. ఒకరి ఉత్తరాల కోసం ఒకరు ఎదురు చూడడం అలవాటైపోయింది. హరిబాబుకిప్పుడు గత జ్ఞాపకాలేవీ గుర్తుకు రావడంలేదు.

పంచుకోగల హృదయమూ, కలుపుగోలుతనమూ ఉండాలే గానీ మనుషుల మధ్య అనుబంధాలూ, ఆత్మీయతలూ ఏర్పడి అవి బలంగా పాతుకపోయి బతుకును ప్రభావితం చెయ్యడానికి ఎంతో కాలం పట్టదు.

జనన మరణాల మధ్య ఉండే రహదారి జీవితం.

ఆ రహదారిలో నడుస్తుంటే మనకు ఎంతో మంది తారసపడతారు. ఎందరో పరిచయమవుతారు. కానీ అందరి పరిచయాలూ అనుబంధాలుగా మారవు. మన అభిప్రాయాలకూ, అభిరుచులకూ సరిపడే

 

మనుషులు పరిచయం కావడం అదృష్టం. ఆ పరిచయం అనుబంధంగా మారడం ఓ వరం.

నీలిమ ఒక చోట

హరిబాబు మరో చోట.

వాళ్ళిద్దరి మధ్యా ఎంతో దూరం. అయితే ఆ దూరం వాళ్ల మనసులకులేదు. నీలిమకూ, హరిబాబుకూ మధ్య ఉన్న అనుబంధమూ, చనువు, సన్నిహితం బహుశా మరెవరి మధ్యా లేవేమో! వాళ్ళు రాసుకొనే ఉత్తరాలను చూస్తే ఎవరైనా అలాగే అనుకుంటారు.

"హరీ! ఈరోజు రాత్రి అన్నంతింటుంటే హఠాత్తుగా నువ్వు గుర్తుకొచ్చావు. అంతే! తర్వాత నాకు ఒక్కమెతుకుకూడా దిగలేదు. మీ మెస్‌లో ఒక్కోసారి అన్నం తినడానికే సయించదని, అలాంటప్పుడు ఆకలితోనే గదిలో పడుకొంటావని క్రితం సారి నువ్వు ఉత్తరంలో రాసిన విషయం గుర్తుకొచ్చింది. నువ్వు అక్కడ ఆకలితో పడుకొన్నావేమో అనే ఆలోచన రాగానే ఇక ఈ రాత్రి ఒక్క మెతుకు కూడా తినలేకపోయాను. నువ్వు ఆకలితో ఉంటే నేను మాత్రం ఎలా భోంచెయ్యగలను?

హరీ! నువ్వక్కడ తిన్నావో లేదో నని చూడడానికి కూడా నీకు ఎవరూ లేరన్న విషయం గుర్తుకు రాగానే నా కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. పిచ్చి నీలిమ అని అనుకొంటున్నావు గదూ? కానీ, నా మనసు, అందులోని బాధ నీకు ఎలా తెలుస్తుంది హరీ?"

ఈ ధోరణిలో రాసింది నీలిమ.

ఆ అభిమానానికి చలించిపోయాడు హరిబాబు.

అతడి కళ్ళల్లో సన్నగా కన్నీటిపొర. ఏమిటి ఈ పిచ్చి అభిమానం? ఈఅభిమానానికి అర్థం ఏమిటి? అది తనను ఎక్కడికి తీసుక వెళుతుంది?

తనెవరు? నీలిమ ఎవరు?

తను ఆకలితో ఉంటాడని ఊహించి బాధపడి తను కూడా అన్నం తినడం మానేసి తనకోసం ఎందుకు కన్నీరు కార్చడం?

ఆమెకు తనేమవుతాడని ఈ పిచ్చి అభిమానం?

స్త్రీలో నిజంగా ఇంత ఉన్నతభావాలున్నాయా? అమృత, సౌందర్య ఎందుకు తనపై నీలిమలా అభిమానం చూపించలేకపోయారు. నీలిమ చూపెట్టే ఈ గాఢమైన అభిమానానికి, ఆప్యాయతలకు పాత్రుడు కావడానికి నిజంగా తనకు అర్హత ఉందా?

నీలిమకు తన హృదయంలో ఉన్నతమైన స్థానాన్ని ఇచ్చాడు హరిబాబు. ఆ ఉత్తరంలోని మాటలు పదేపదే చదివాడు. చదువుతుంటే ఎందుకో నీలిమ పరాయి స్త్రీ అన్పించలేదు.

ఈ లోకంలో మగవాడి మీద గాఢమైన ఆప్యాయతలను, అనురాగాన్ని చూపించే స్త్రీలు ఇద్దరేయిద్దరు. ఒకరు నవమాసాలూ మోసికని పెంచి పెద్దచేసిన మాతృదేవత. ఇంకొకరు కష్టసుఖాలలో భాగం పంచుకొని బతికే అర్ధాంగి.

"హరీ! ఈ ప్రపంచంలో నాకు ఇష్టమైన వ్యక్తి ఎవరో తెలుసా? హరిబాబని ఓ అబ్బాయి ఉన్నాడులే. అవును హరీ! నువ్వంటే నాకెంత ఇష్టమో చెప్పలేను. నువ్వు లేనిరోజున నేను ఈ ప్రపంచంలో బతకలేను. మనిద్దరినీ వేరు చేయగల శక్తి ఆ మృత్యువుకు కూడా లేదేమో. అబ్బ! నువ్వు రాసే ఉత్తరాలెంత బాగుం

టాయని! వాటని అందుకోగానే నా పెదవులు నాకు తెలియకుండానే వాటిని..."

ఉత్తరంలోని ఆ మాటలు చదువుతుంటే...

హరిబాబుకు నవ్వు వచ్చింది.

"హరీ! 'పిచ్చి నీలూ! నాపై నీకెందుకింత అభిమానం' అని ప్రశ్నించావు. ని ప్రశ్నకు సమాధానం తెలుసుకోగల్గితే... జవాబు నీదగ్గరే ఉంది. ఎవరూలేని ఏకాకిని అనుకొంటూ అనవసరంగా బాధపడకు. నీకు ఎవరున్నా లేకపోయినా ఈ నీలూ లేదూ?

అయ్యో బాబోయ్! బాగా చీకటి పడిపోయింది. నేను ఒంటరిగా మేడమీద నీకు





ఉత్తరం రాస్తూ కూర్చున్నాను. సరిగ్గా నువ్వు ఇప్పుడేం చేస్తుంటావో చెప్పనా? బీచ్‌లో కూర్చుని సముద్రం వేపు చూస్తూ ఉంటావు. అవునా?

ఏయ్ దొంగా.. సిగరెట్లుకూడా తాగుతున్నావా? ఏం నువ్వు ఆరోగ్యంగా ఉండడం నీకు ఇష్టం లేదా? ఇదిగో ... ఇదే చెబుతున్నాను. నామీద ఏమైనా అభిమానం ఉంటే సి,,రెట్లు మానేసేయ్. ఇక ఉంటానోయ్ మెడికో అబ్బాయ్.

నీ నీలూ

పదే పదే చదువుకొన్నాడు ఉత్తరాన్ని హరిబాబు.

నీలిమ ఎంతబాగా మందలిస్తుంది! ఎంతబాగా ధైర్యం చెబుతుంది! ఎంతబాగా తనను ఓదార్చుతుంది! ఆ హృదయంలో నీలిమ తనకు చోటు



ఇవ్వటం నిజంగా తన అదృష్టం. ఇంత అదృష్టం ఎంతమందికుంటుంది?

"నా ప్రియమైన హరీ!

ఏమిటలా చూస్తున్నావ్?

ఈసారి నా సంబోధన మరో రకంగా ఉందనా?

నువ్వునాకు ప్రియమైన వ్యక్తివిగాక మరేమిటనుకొన్నావు? ఇదిగో మేడికో అబ్బాయ్! నా మనసు సరిగాలేదు. ఓసారి వచ్చి నాకు ట్రీట్‌మెంట్ ఇవ్వవూ? అన్నట్టు చెప్పడం మరచానోయ్...మా వదినకు ఈ రోజు ఇంట్లో సీమంతం జరిపారు. ఎందరెందరో ఆడవాళ్లు వచ్చారు. ఆ సమయంలో నువ్వూ మా ఇంట్లో ఉంటే ఎంతో బాగుండేది. పోనీ నువ్వు ఓ చిన్నపని చెయ్యి. నా లేపాక్షి చీర పంపిస్తాను.ఎంచక్కా ముస్తాబు చేసుకొని వచ్చెయి. ఏం? రాలేవా? తమరు సాగర మధనంలో అమృతం పుట్టినప్పుడు మోహిని అవతారం ఎత్తిన వైకుంఠ వాసులు హరిగదా! అప్పుడు ఆ అవతారం ఎత్తినవాడివి ఈ చిన్న అవతారం ఇప్పు డెత్తలేవూ?

ఈ ఉత్తరం నేను గదిలో తలుపుబోల్ట్ వేసుకొని నీకు రాస్తున్నాను. ఎందుకు బోల్ట్ వేశానంటే ఏ క్షణంలోనైనా అమ్మ ఇటు రావచ్చు. ఆవిడగానీ ఈ ఉత్తరం చూసిందా... ఇంకేంలేదు బడితెపూజ చేసేస్తుంది.అమ్మ చాలా చాదస్తంమనిషిలే. ఆడపిల్ల పెళ్ళి అయ్యేంతవరకు మగాడితో మాట్లాడకూడదని ఆమె సిద్ధాంతం. నాన్నకు కూడా అమ్మనుచూస్తే భయమే. ఏయ్! మొన్న నా కలలోకొచ్చి నన్ను నిద్రపోనీకుండా చేస్తావా? నా కలలోకి రావడమేనా నీ పని?"

అలా చిలిపిచిలిపిగా రాస్తుండేది నీలిమ.

ఉత్తరాలు చక్కగా రాయడం అనేది ఓ కళ.

ఆ కళ అందరికీ రాదు.

నీలిమ రాసిన ఉత్తరాన్ని చదువుతుంటే...అసలు నీలిమతో మాట్లాడుతున్నట్లే ఉండేది హరిబాబుకు. వచ్చిన ఉత్తరాన్ని ఆ రోజంతా చదువుకొనేవాడతడు.

క్రమంగా చదువుమీద శ్రద్ధ తగ్గుతోంది. రంగుల కలలు కనటం ఎక్కువయింది. పేజీలకు పేజీలుగా ఉత్తరాలు రాస్తున్నాడు.

కాలాన్ని చాలావరకు వృధా చేసుకొంటున్నాననే విషయాన్ని గుర్తించే స్థితిలోలేడు హరిబాబు.

కాలహరణం మనిషి చేసే అన్ని దుబారా ఖర్చులలోకి అతివిలువైనది.దానికి ఖరీదు కట్టడం, ఆ నష్టాన్ని అంచనా వెయ్యడం ఏ మనిషివల్లాకాదు. ఒక్కక్షణం జారిపోయినా అది మళ్ళీ తిరిగిరాదు.

నీలిమ నుండి వచ్చే ఉత్తరాలకోసం ఎదురుచూడడం, వచ్చాక ఆ ఉత్తరాన్ని పదిసార్లు చదువుకొని దానికి బదులురాసుకొంటూ కూర్చోవడం ఇది చాలా ముఖ్యమైన పనిగా తయారైంది హరిబాబుకు.

"మైడియర్ హరీ! అబ్బ నీ ఉత్తరం కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను.

అన్నట్టు మొన్న మా కాలేజీలో కవి సమ్మేళనం జరిగింది. యూనివర్శిటీనుండి ఓ లెక్చరర్ అధ్యక్షుడుగా వచ్చాడు. ఆ సమ్మేళనంలో నేనూ విప్లవ ధోరణిలో రాసిన ఓ కవితను ఆవేశంతో చదివాను. అందుకు ఆ అధ్యక్షుడు 'ఈ సింహ కిశోరం' అంటూ నా గురించి పొగిడాడు.

అన్నట్టు హరీ! నువ్వోసారి రాకూ




డదూ? నువ్వువస్తే ఎంచక్కా మనం కలుసుకొని హాయిగా మాట్లాడుకోవచ్చు. మా ఇంట్లో వీలుకాదులే. ఇక్కడికి దగ్గర్లో ఇండియాలోనే ఫేమస్ అయిన టి.బి.శాని టోరియం ఒకటుంద.ఆశాని టోరియంలో మా ఫ్రెండ్ ఓ అమ్మాయి నవ్వగా పని చేస్తోంది. అక్కడే వాళ్ళ క్వార్టర్స్‌లో మనం కలుసుకొని హాయిగా కబుర్లు చెప్పుకోవచ్చు.

ఇదిగో నా తలలో మల్లెపూలు గుబా ళిస్తున్నాయి.

వచ్చి ఓసారి వాసన చూడరాదూ? పో...నీకు అసలు వాసనచూడడమే తెలి యదు. ఏయ్! అమ్మ నన్ను భోజనానికి లెమ్మంటోంది. నువ్వూ రారాదూ. ఇద్దరం కలిసి భోంచేద్దాం. చాలా ఆకలిగా ఉందోయ్. ఇక నేను వెళతాను.

—నీ నీలూ

ఆ ఉత్తరం చదవడం అది ఆయిదో సారి. చదవడమైపోయాక తన సూట్ కేస్ తెరిచి అందులో ఆ ఉత్తరాన్ని పడేశాడు హరి. సూట్ కేస్‌లో సగం నీలిమ రాసిన ఉత్తరాలతో నిండిపోయివుంది.

* * *

సాయంత్రం ఆరుగంటలవుతోంది.

బీచ్‌లో చాలా రద్దీగా ఉంది.

హరిబాబు ఓ చోట ఒంటరిగా కూర్చు న్నాడు

ఇసుకలో ... 'హరిబాబు – నీలిమ' అంటూ వేలితో పెద్ద పెద్ద అక్షరాలు రాసుకొని.. ఆ అక్షరాలనే పిచ్చివాడిలా చూస్తున్నాడు.

ఇంతలో ఏవో పకపకలు విన్పించ దంతో తలెత్తాడు హరి.

అయిదారుమంది అమ్మాయిలు నవ్వు కొంటూ వెళ్తున్నారు.

హరిబాబుకూ, నీలిమకూ మధ్య ఇన్ని ఉత్తరాలు సాగుతున్నా ఇంతవరకు ఒకరి నొకరు చూసుకోలేదు. ఫొటో అడగా లంటే ఇద్దరికి అభిమానం లాంటిది అడ్డొస్తోందేమో మరి. నీ ఫొటో పంపు అని హరిబాబు నీలిమనుగానీ నీలిమ హరి బాబునుగానీ ఇంతవరకు అడగనే లేదు. అయితే ఒకరినొకరు చూడాలని ఇద్దరికీ ఎంతో ఆసక్తిగా ఉంది.

నీలిమ ఎలా ఉంటుంది?

ఆ గుంపులో ఎర్ర చీర కట్టుకొన్న అమ్మాయిలాగానా?

లేక.. ఆ రెండు జడలు వేసుకొన్న అమ్మాయిలాగానా?

లేక అదిగో జడలో పూలు పెట్టు కున్న అమ్మాయిలాగానా?

నో...వీళ్లెవరూ తన నీలిమకు సాటి రారు.

నీలిమ..ఎంతో ఉన్నతమైన వ్యక్తి.

ఎన్ని జన్మలెత్తినా వీళ్లు తన నీలిమకు సాటిరారు. అయినా..నీలిమ ఎలా ఉంటే ఏమిటి? తను ఇష్టపడింది ఆమె హృద యాన్ని, తను ఆరాధిస్తున్నది ఆమె హృద యాన్ని, తను చోటు చేసుకొంది ఆ హృదయంలోనే!

హరిబాబు ఆలోచనలు నీలిమ చుట్టూ పరిభ్రమిస్తున్నాయి.

ఏడుగంటలకు తిరిగి రూంకొచ్చాడు.

ప్రసాద్ ఏదో ఇంగ్లీష్ నవల చదువు తున్నాడు.

"ఎక్కడికి వెళ్ళావోయ్" అడిగాడు ప్రసాద్.

"బీచ్‌కి"

"అన్నట్టు మీ సిస్టర్ శోభకు ఉత్తరం రాశావా?"

"ఇంకా లేదు ప్రసాద్"

"ఏం ఎందుకని?"

"సిదానంగా రాద్దామని..."

"ఏం తీరిక లేదా పాపం? వెనకొచ్చిన కొమ్ములే ముందొచ్చిన చెవులకన్నా పొడవన్నట్లు..శోభకు రిప్లై రాయడానికి టైం లేదుగానీ మొన్న పరిచయమైన నీలిమకు పేజీలకు పేజీలుగా ఉత్తరాలు రాయడానికి మాత్రం బోలెడంత టైముంటుంది. అసలు నువ్వు ఊరికెళ్లి సంవత్సరం పైగా అవుతోంది. కనీసం శోభ పెళ్ళికి వెళ్ళావా? అదీలేదు. ఆ అమ్మాయికి మూడు నెలల క్రితం పిల్లాడు పుట్టాడని ఉత్తరం రాస్తే చూడ్డానికి అప్పుడైనా వెళ్ళావా? ఇలా ఉండిపోతే వాళ్లు నీ గురించి ఏమనుకొంటారు? ఆ అమ్మాయి ఉత్తరం రాసి పదిరోజులైంది. ఇప్పుడైనా శోభకు ఉత్తరం రాయి" అంటూ చీవాట్లు పెట్టాడు ప్రసాద్.

శోభకు బదులు రాయసాగాడు హరిబాబు.

నీలిమ విషయం హరిబాబు ఎప్పటికప్పుడు ప్రసాద్‌కు చెబుతుండేవాడు. నీలిమ తనకు రాసే ప్రతి ఉత్తరాన్ని ప్రసాద్‌కు చదవమని ఇచ్చేవాడు హరిబాబు. వాళ్ళది ప్రగాఢమైన స్నేహం.

"ఈమధ్య నీలిమ విశేషాలేమిటో నువ్ చెప్పలేదోయ్" అంటూ చదువుతున్న పుస్తకాన్ని టేబిల్ మీద బోర్లించాడు ప్రసాద్.

"ఓహో! నువ్వు నెలరోజులుగా లేవు గదూ...నా సూట్ కేస్‌లో ఈమధ్య నీలిమ నుండి వచ్చిన ఉత్తరాలు పైనే ఉన్నాయి. తీసి చదువు"

"ఏమంటోంది మీ నీలిమ?"

"నువ్వే చూడు తెలుస్తుంది"

ప్రసాద్ వెళ్ళి కాలక్షేపానికి కొన్ని ఉత్తరాలు తెచ్చుకుని విప్పి చదవసాగాడు.

"మైడియర్ హరీ! జీవితంలో నాకు నువ్వు తప్ప ఇంకేమీ అవసరం లేదు. నాకు ఎన్ని ఉన్నా నువ్వు లేని రోజున నేను ఏమీ లేనిదాన్నే. అసలు నువ్వు నాకు లేని రోజున నేను ఈ ప్రపంచంలోనే ఉండను. ఏది శాశ్వతమైనా కాకున్నా మనిద్దరి బంధం మాత్రం శాశ్వతం..."

ఆ ఉత్తరాన్ని పూర్తిగా చదవలేదు ప్రసాద్. ఆ ఉత్తరం ఉత్తరంలా లేదు. అది అరఠావు కాగితాలలో ఆరు పేజీలు రాయబడింది.

ఇంకో ఉత్తరాన్ని తీశాడు ప్రసాద్.

"ఏయ్ హరీ! ఏమిటమ్మా నీకంత పొగరు? ఆడపిల్ల అనే సానుభూతి కూడా లేకుండా నన్ను ఏడ్పించడానికి నా చెంప మీద కొడతావా? ఇదిగో ఇంకోసారి కొట్టావో నీ చేతిని పళ్ళతో కొరికి పారేస్తాను జాగ్రత్త. అన్నట్టు ఇంట్లో అందరూ సినిమాకు వెళ్ళిపోయారు. ఇంట్లో ఒకదాన్నే. నువ్వు వచ్చెయ్యరాదూ! ఇద్దరం కలసి హాయిగా....."

ఆ ఉత్తరాన్ని కూడా పూర్తిగా చదవకుండా ఇంకో ఉత్తరాన్ని తీశాడు ప్రసాద్.

"అబ్బ! ఈ ఊళ్ళో చాలా చలిగా ఉందోయ్. రెండు దుప్పట్లు కప్పుకొన్నా చలిపోదు. అన్నట్టు ఇక్కడో అమ్మాయికి బాగా పిచ్చిపట్టిపోయింది. ఎప్పుడూ హ రి బా బు... హరిబాబు అనుకొంటూ ఉంటుంది. ఆ అమ్మాయి పేరు నీలిమ. మీ వైజాగ్‌లో మెంటల్ హాస్పిటల్ ఉందిగా! అందులో ఈ పిచ్చి




అమ్మాయిని చేర్పించగలవా?"

ఇంకో ఉత్తరం తీశాడు ప్రసాద్.

"మొన్న రాత్రి నాకో కల వచ్చింది. భయంకరమైన కల. చటుక్కున మెలుకువ వచ్చింది. చాలా సేపు ఏడుస్తూ ఉండిపోయాను. ఆ కలలో నామీద కోపంతో నన్ను వదిలేసి వెళ్ళిపోతున్నావు ఏదో కొండమీదికి. నేను నీవెంట బడి ఏడుస్తూ వస్తున్నాను. వద్దు హరీ! నేను దీనిని కలలోనైనా భరించలేను"

"హరీ! జీవితం చాలా చిత్రమైంది కదూ? కాకపోతే ఇక్కడ మదనపల్లిలో ఉండే నన్ను..ఎక్కడో విశాఖపట్నంలో ఉండే నిన్ను ఒకటిగా కలుపుతుందా? ఈ బంధాన్ని శాశ్వతం చేస్తుందా? నీలిమ, హరిబాబు వేరు వేరు కాదోయ్. వాళ్ళిద్దరి శరీరాలు మాత్రమే వేరువేరు. ఆత్మలు ఎప్పుడో ఒక్కటిగా ఐక్యమైపోయాయి"

ప్రసాద్ ఉత్తరాన్ని మడిచేశాడు.

ఏ ఉత్తరమూ అరతావు కాగితాల్లో అరడజను పేజీలకు తక్కువ లేదు.

"ఒరేయ్ హరీ" పిలిచాడు ప్రసాద్.

ఏమిటన్నట్టుగా తలెత్తి చూశాడు హరిబాబు.

"నేనైతే పర్వాలేదు గానీ ఇంకెవరైనా ఈ ఉత్తరాలు గానీ చూశారంటే ఖచ్చితంగా మీకిద్దరికీ పిచ్చి పట్టిందను కొంటారు" అంటూ ఆ ఉత్తరాలను తీసుకపోయి సూట్ కేస్‌లో పడేశాడు ప్రసాద్.

ఆ గదిలో రెండుక్షణాలు నిశ్శబ్దం.

"ఈమధ్య ఈ ఉత్తరాలలో పడి నువ్వు సరిగా చదవడం లేదు హరీ" మెల్లగా హెచ్చరించాడు ప్రసాద్.

హరిబాబు బదులు చెప్పలేదు. ఉత్తరం రాస్తూనే ఉన్నాడు.

"శోభకేనా నువ్వురాసే ఉత్తరం?"

అవునంటూ తల ఆడించాడు హరిబాబు.

"భోజనానికి టైమైంది. వెళ్దాంలే. మళ్ళీ వచ్చి రాసుకొందువులే" అని భోజనానికి వెళ్ళేందుకు సిద్ధమయ్యాడు ప్రసాద్.

హరిబాబు రాయటం ఆపేసి బయల్దేరాడు.

గదికి తాళంవేసి ఇద్దరూ బయట పడ్డారు.




ఇప్పుడు హరిబాబుకు నీలిమే సర్వస్వం అయిపోయింది.

క్లాస్‌లో కూర్చొని ఉంటే నీలిమే గుర్తుకొచ్చేది. తర్వాత పాఠాలేవీ బుర్రకెక్కేవి కాదు. ఆరోజు నీలిమ నుండి ఉత్తరం వస్తుందని కాలేజి నుండి పరుగులాంటి నడకతో గదికి వచ్చాడు. హరిబాబు. గది తలుపులు తెరిచాడు.

నేలమీద రెండు ఉత్తరాలు, ఒక వెడ్డింగు కార్డూ కన్పించింది. ముందు నీలిమ రాసిన ఉత్తరాన్ని చించాడు.

"ప్రియమైన హరీ! ఇప్పుడు టైమెంతో తెలుసా? కరక్టుగా ఉదయం ఆరుగంటలు.

కిటికీ దగ్గర కూర్చొని.. ఎర్రబడిన తూర్పు ఆకాశాన్ని చూస్తూ నీకు ఈ

ఉత్తరాన్ని రాస్తున్నాను.

అబ్బ! సూర్యోదయం ఎంత అందంగా ఉంటుంది! తూర్పుకొండల్లో సగం ఉదయించిన సూర్యుడు.. ఆకాశంలో మిణుకు మిణుకుమనే చుక్కలు... ఇంకా అస్తమించని చంద్రుడు ఈ దృశ్యం చూస్తుంటే 'కాళహస్తీశ్వర మహాత్మ్యం'లో ధూర్జటి 'ఉదయ గ్రావము పానవట్టము' అంటూ సూర్యోదయాన్ని వర్ణించిన పద్యం గుర్తుకొస్తోంది.

అన్నట్టు హరీ! 'ప్రేమలేఖలు' పుస్తకం మా ఊళ్లో దొరకడం లేదు. అక్కడగానీ దొరికితే పంపు. అప్పుడప్పుడూ అనుకొంటూ ఉంటాను.. మనిద్దరం ఒకరికోసం ఇంకొకరు పుట్టామేమోనని. మరణానంతరం మరో జన్మంటూ ఉంటే ఆ జన్మలోనూ మన బంధంయిలాగే ఉండాలి"

ఉత్తరం చదవటం ముగించాడు హరిబాబు.

ఇంకో ఉత్తరం. ప్రసాద్‌కు వచ్చింది.

వెడ్డింగ్ కార్డ్ తీసి చూశాడు.

కిశోర్ పెళ్ళి... అతడు హరిబాబుకు బి.కాం.లో క్లాస్‌మేట్. బి.కాం.లో ఉన్నప్పుడు.. అమృత, కిశోర్ మాత్రమే హరిబాబుకు సన్నిహితంగా ఉండేవారు. తర్వాత బి. కాం.ను డిస్‌కంటిన్యూ చేసి వైజాగ్‌లో మెడిసిన్‌లో చేరాక కూడా అప్పుడప్పుడూ హరిబాబుకు ఉత్తరాలు రాస్తుండేవాడు కిశోర్. ఇప్పుడు హరిబాబు ఆనందం కిశోర్‌కు పెళ్ళి అవుతున్నందుకు కాదు. ఆ పెళ్ళి మదనపల్లిలో జరగబోతున్నందుకు.

తను ఆ పెళ్ళికి తప్పకుండా వెళ్ళి తీరాలి.

లేకుంటే... కిశోర్ బాధపడతాడు.

మదనపల్లి వెళితే.. అటు నీలిమను కూడా కలుసుకోవచ్చు.

ఆ ఆలోచన రాగానే నీలిమకు ఉత్తరం రాయసాగాడు హరి.

"మైడియర్ నీలూ! ఇప్పుడు నాకెంత సంతోషంగా ఉందో చెప్పలేను. ఎందుకో తెలుసా? మీ ఊరు వచ్చే అవకాశం నాకు ఇంత తొందరలో వస్తుందని నేనెప్పుడూ అనుకోలేదు. రేపు సోమవారం ఉదయం మదనపల్లిలో మా ఫ్రెండ్ పెళ్లి జరగబోతోంది. నేను ఆ పెళ్లికి వస్తున్నాను. నిన్ను తప్పకుండా కలుసుకొంటాను.

ఉదయం ఎనిమిది గంటలకు కరక్టుగా ముహూర్తం అయిపోవచ్చు. పెళ్ళి థియేటర్లో ఏర్పాటు చేస్తున్నారు. ముహూర్తం అయిపోగానే నేను థియేటర్ ముందు ఒంటరిగా నిలబడి ఉంటాను. వైట్ ప్యాంటూ, వైట్ ఫుల్‌షర్టూ వేసుకొని... టక్ చేసుకొని ఉంటాను. నా చేతిలో పసుపు రంగు కర్చీఫ్ ఉంటుంది. ఈ గుర్తులతో నువ్వు నన్ను బాగా గుర్తుపట్టొచ్చు. నువ్వు తప్పకుండా ఎనిమిదీ ఎనిమిదిన్నర మధ్య అక్కడ కలుసుకోవాలి. ఎనిమిదిన్నర లోపలగానీ వచ్చి నన్ను ఆ థియేటర్ ముందు కలవకపోయావా అసలు నీకు మళ్ళీ జీవితంలో ఉత్తరం రాయను" – అంటూ ఏ థియేటర్లో ఏ రోజు పెళ్లి జరుగుతుందో అన్నీ వివరంగా రాశాడు హరిబాబు ఉత్తరంలో.

అయిదు నిమిషాలు గడిచింది.

ప్రసాద్ రాగానే అతని కొచ్చిన ఉత్తరాన్ని అందించాడు హరి.

"హరీ మా నాన్నకు ఆరోగ్యం బాగ లేదట. వీలుంటే ఓ సారి రమ్మని ఇంట్లో

వాళ్లు రాశారు. మాకు యింకో పదిహేను రోజుల్లో ప్రిపరేషన్ హాలిడేస్ ఇచ్చేస్తారు. నేను ఈ రోజు సాయంత్రమే ఊరెళ్లి పోతాను. మళ్ళీ చాలా రోజులకు అంటే ఎగ్జామ్స్ ముందు తిరిగి వస్తాను" అంటూ చెప్పాడు ప్రసాద్.

"నేనూ ఎల్లుండి ఊరికి బయలు దేరుతున్నా. అక్కడి నుండి మదనపల్లికి ఓ ఫ్రెండ్ పెళ్లికి వెళ్ళి అటే నీలిమను కలుస్తాను" అంటూ తన ప్రోగ్రాంను గూర్చి చెప్పేడు హరి.

"నీలిమను కలిశాక నాకు వివరాలతో ఊరికి ఉత్తరం రాయి" ప్రసాద్ అన్నాడు.

ఆరోజు సాయంత్రం ప్రసాద్ వెళ్ళిపోయాడు.

* * *

మదనపల్లిలో బస్సు దిగాడు హరి బాబు.

బస్టాండులో దిగి చుట్టూ కలయ చూశాడు.

నీలిమ ఉండేది కమ్మవీధిలో గదూ!

ఆవీధి ఎక్కడుందో ఈ ఊళ్ళో. ఈ ఊరికి తను రావడం ఇదే మొదటిసారి. నీలిమ ఏం చేస్తుంటుంది ఇప్పుడు? మేడ మీదకి ఎక్కి బహుశా సూర్యాస్తమ యాన్ని చూస్తుందేమో! తన ఉత్తరం తప్పకుండా అందిఫుంటుంది. రేపు ఉదయం ఎనిమిదిగంటలపైన తనను తప్ప కుండా కలుసుకొంటుంది. అయినా ఎంత చిత్రం! ఈ ఊళ్ళో తనకో అమ్మాయి పరి చయమౌతుందని, తను ఈ మదనపల్లి వస్తాడని, ఆ అమ్మాయిని కలుసుకోగల డని కలలోనైనా ఎప్పుడూ అనుకోలేదు తను.

రిక్షావాడి పిలుపుతో ఈ లోకానికి వచ్చాడు హరిబాబు.

రిక్షా ఎక్కి ఓ మంచి లాడ్జిముందుదిగి అందులో ఓ రూం తీసుకొన్నాడు. ఆ రాత్రంతా అతనికి నిద్రపట్టలేదు. ఎప్పుడు తెల్లవారుతుందా ఎప్పుడు నీలిమనుకలుసు కొంటానా అని ఒకటే ఆలోచన.

ఎందుకో ఆరాత్రి ఉదయించకుండా అనంతగా సాగుతున్నట్టు అన్పిస్తోంది. హరిబాబుకు.

రాత్రంతా నీలిమను గురించే ఆలో చించుకొంటున్నాడు.

నీలిమ ఉత్తరాలలో చూపించే అభి మానం, ఆప్యాయత ఇప్పుడుతను ఎదురు పడితే చూపిస్తుందా? ఉత్తరాలలోచూపించే చనువు తన ముందు చూపించగలదా?

అలా ఆలోచించుకొంటూ పడుకొన్న హరిబాబుకు ఎప్పుడో నిద్రపట్టేసింది నిద్రలో కూడా అతడికి నీలిమనుగురించి కలలు...

బాగా తెల్లారిపోయింది.

బెడ్ మీద నుండి హుషారుగా లేచి కాలకృత్యాలు ముగించుకొని కిషోర్ పెళ్ళి ఏర్పాటు చెయ్యబడిన థియేటర్ దగ్గరకు వెళ్లాడు హరిబాబు. కిషోర్‌ను కలుసుకొని కొంతసేపు మాట్లాడాడు. పెళ్ళితతంగం మొదలయింది.

ఉదయం ఎనిమిది గంటలు కావ స్తోంది.

పెళ్ళి పీటల మీద వధూవరులు ఇంకా అలాగే ఉన్నారు.

పెళ్ళికి వచ్చిన జనంతో థియేటర్ చాలా రద్దీగా ఉంది.

లోపల కూర్చొన్న హరిబాబుకు మనసంతా బయటేఉంది.

నీలిమ వచ్చేస్తుంది. తను వెళ్ళాలి.

తను అక్కడ లేకుంటే నీలిమ తిరిగి వెళ్ళిపోతుందేమో! మెల్లగా లేచి థియేటర్లోంచి బయటకొచ్చి ఓచోట నిలబడ్డాడు హరిబాబు. పాలనురుగు లాంటి తెల్లని పాంటూ, దాని మీద ఆరెంగు గల పలుచని ఫుల్ షర్టూ వేసుకొని టక్‌చేసుకొన్నాడు. అతని చేతిలో వెడల్పయిన పసుపు రంగు కర్చీఫ్ ఉంది. ఇంకో చేతిలో చలం ప్రేమలేఖలు బుక్ ఉంది. ఆ థియేటర్ ముందు అక్కడక్కడా మనుషులు.

కొందరు అమ్మాయిలూ, అబ్బాయిలూ ఏదో చెప్పుకొంటూ నవ్వుకొంటున్నారు. మరికొందరు థియేటర్ లోపలకీ, వెలుపలకీ హడావుడిగా తిరుగుతున్నారు. వాళ్ళందరూ ఆ పెళ్ళికి వచ్చినవాళ్ళే.

ఎనిమిదింపావు అవుతోంది.

తనను ఎవరైనా పలుకరిస్తారేమోనని, తనవేపు ఏ అమ్మాయైనా వస్తుందేమోనని..అక్కడ అటూ ఇటూ తిరిగే అమ్మాయిల వేపు ఆశగా చూస్తున్నాడు

కానీ హరిబాబు వేపు ఎవరూ చూడడం లేదు.

అసలు అతనిని ఎవరూ పట్టించుకోవడం లేదు.

హరిబాబుకు...మనసులో దిగులు దిగులుగా ఉంది. తనకు ఏదో అన్యాయం జరిగిపోతున్నట్టుగా ఉంది. తననెవరో మోసం చేసేస్తున్నట్టు బాధగా ఉంది. మొదటిసారిగా నీలిమపై చాలా కోపం




వచ్చింది హరిబాబుకు.

"హరీ!"

ఉలిక్కిపడ్డాడు హరిబాబు. ఇది తన భ్రమ కాదుకదా!

"ఏయ్... హరీ!"

తను భ్రమపడడం లేదు. ఏదో.. అత్యంత మధురమైన గొంతు తనను పిలుస్తోంది. నీలిమ... నీలిమ వచ్చేసిందేమో.

అడ్డం ఉన్న మనుషుల్ని తప్పించుకొని చూశాడు హరిబాబు.

అక్కడో అమ్మాయి నిలబడి మెల్లగా నవ్వుతోంది...

అచ్చం పాలరాతి బొమ్మలా..ఎక్కడినుండో జారి భూమి మీద పడిన సౌందర్యపు ముక్కలా...ముట్టుకొంటే కందిపోయే అతి సుకుమారిలా సమస్త విశ్వంలోని సౌందర్యానికి కేంద్రమేమో అన్నట్లుగా....ఏ ప్రబంధ కవుల వర్ణనలకూ అందని అపూర్వ స్వరూపంలా.

"హరీ! ఏమిటోయ్ అలా చూస్తున్నావు? నేను.. నీలిమను" అంది ఆ అమ్మాయి హరిబాబు దగ్గరికొచ్చి.

"మీరు... మీరు..."

"మీరు ఏమిటోయ్? నేను..నీలూని" మెల్లగా నవ్వి అంది.

"నీలిమా.. నిజంగా నువ్వేనా?"

"అబ్బే కాదు. మాయా రూపంలో వచ్చిన శూర్పణఖను. అది సరేగానీ... మల్లెపూవులాంటి బట్టలేసుకొన్న నిన్ను చూస్తుంటే.. అదేదో బట్టల సబ్బు అడ్వర్‌టైజ్‌మెంట్‌లోని బొమ్మ గుర్తుకొస్తోందోయ్" అంటూ పకపక మంటూ నవ్వింది నీలిమ.

అబ్బ! ఆ నవ్వు ఎంత బాగుంది.

నవ్వితే సొట్టలుపోయే ఆ ఎర్రటి బుగ్గలు...

"మదనపల్లి కెప్పుడొచ్చావ్? నిన్న సాయంత్రమా?"

అవునన్నట్టుగా తల ఆడించాడు హరిబాబు.

"మీ ఫ్రెండ్ పెళ్ళి ముహూర్తం అయిపోయిందా?" అడిగింది నీలిమ.

అయిపోయిందన్నట్టుగా మళ్ళీ తల ఆడించాడు.

"ఏయ్ ఏమిటోయ్ మూగవాడిలాగా తల ఆడిస్తున్నావు? మాట్లాడితే నీ నోటి ముత్యాలుగానీ రాలిపోతాయా ఏమిటి? లేకపోతే ఆడపిల్ల ఎదురుపడి మాట్లాడేసరికి మాటలు ఆగిపోయాయా కొంప దీసి?" కిలాకిలా నవ్వింది నీలిమ.

"నీలూ! నేను రాసిన ఉత్తరం చేరింది కదా?"

"ఏమిటోయ్ ఈ అర్థంలేని ప్రశ్న? నీ ఉత్తరం చేరకుండా ఉంటే.. ఇప్పుడు నేను ఈ థియేటర్ ముందుకొచ్చి ఈ 'టినోపాల్'ను ఎలా కలుసుకొని ఉంటాను?" అంది నీలిమ మెల్లగా.

హరిబాబు కన్నార్పకుండా చూస్తూనే ఉన్నాడు నీలిమను. "ఏమిటి హరీ! అలా బెల్లంకొట్టిన రాయిలా నిలబడిపోయావ్? బయలుదేరు. వెళ్దాం" అంది నీలిమ.

"ఎక్కడికి?" అడిగాడు హరిబాబు.

"ఎక్కడికీ వెళ్ళకుండా ఇక్కడే మాట్లాడుకుంటూ ఉందామా? ఈ ఊరి విషయం నీకు తెలియదు. ఓ అబ్బాయీ, అమ్మాయీ కలిసి మాట్లాడుకొంటుంటే మహా వింతగా చూస్తారు. పైగా మా ఇల్లు ఇక్కడికి చాలా దగ్గర. ఏ క్షణంలోనైనా మా వాళ్లు ఇటు రావచ్చు. మనిద్దరినీ చూశారంటే యిక కొంప

లంటుకపోతాయి. అందుకని మనం ఓపని చేద్దాం"

ఏమిటన్నట్టు ప్రశ్నార్థకంగా చూశాడు హరిబాబు.

"ఇక్కడికి దగ్గర్లో శానిటోరియం ఉందని, అందులో మా ఫ్రెండు సర్వుగా పనిచేస్తోందని చెప్పాను గుర్తుందా? చెప్పడమంటే క్రితం ఓసారి లెటర్లో రాయడం. మనిద్దరం ఆ శానిటోరియం దగ్గరికెళ్లి మా ఫ్రెండువాళ్ళ క్వార్టర్స్‌లో హాయిగా మాట్లాడుకొందాం. సరేనా? ఏమిటి నేను చెప్పేది అసలు వింటున్నావా నువ్వు?"

"ఆఁ ఆఁ...వింటున్నాను"

"అదిగో అక్కడ బస్‌స్టాండ్ కన్పిస్తోంది. చూశావా? ఇప్పుడు బస్ రెడీగా ఉంటుంది. నేను ముందు వెళతాను. నువ్వు నా వెంబడే వచ్చి నేను ఎక్కిన బస్సే ఎక్కు. ఈ మాట ఎందుకంటున్నానో తెలుసా? మనిద్దరం కలిసి బస్‌స్టాండు వరకు మాట్లాడుతూ వెళ్ళడం మా క్లాస్ మేట్స్ అబ్బాయిలు ఎవరైనా చూశారనుకో రేపు వాళ్లు కాలేజీలో 'నీలిమ ఎవడినో పట్టేసిందిరోయ్' అంటూ నన్ను గలాటాచేస్తారు. అసలే వాళ్ళు కోతి వెధవలు. సరే ఇక వెళ్దాం" అంటూ నీలిమ గబగబా బస్‌స్టాండు వేపు నడిచింది.

హరిబాబు నీలిమను అనుసరించాడు.

ఆమె బస్ దగ్గర ఆగి ఓసారి వెనక్కు చూసి బస్సెక్కింది.

హరిబాబు కూడా అదే బస్సెక్కాడు.

తనకు తెలిసినవాళ్లున్నారేమోనని ఓ సారి బస్సంతా కలయచూసింది నీలిమ. కానీ ఎవరూ కన్పించలేదు. వచ్చి తన పక్కన కూర్చో అన్నట్టుగా నీలిమ తన చేతితో సైగ చేసింది. హరిబాబు మెల్లగా వచ్చి నీలిమ పక్కన కూర్చున్నాడు.

శానిటోరియంకు తనే టిక్కెట్టు తీసుకుంది.

బస్సు మెల్లగా కదిలింది.

అప్పుడప్పుడూ ఇద్దరి శరీరాలు రాసుకొంటున్నాయి.

ఆ రాపిడిలో హరిబాబు గుండెల్లో అనిర్వచనీయమైన అనుభూతి. ప్రపంచంలో తనంత అదృష్టవంతుడు ఇంకెవరూ లేరనిపించింది హరిబాబుకు ఆ సమయంలో.

అబ్బ! ఈ అందమైన నీలిమ... ఈ ఉన్నతమైన నీలిమ తనది. తన సొత్తు. నీలిమ నిజంగానే అంత అందంగా ఉందా? లేక తను నీలిమను ఆరాధిస్తున్నాడు గనుక తనకలా అన్పిస్తోందా? ఇది అర్థం లేని సందేహం. ఎందుకంటే నీలిమ ఓవేళ అందవికారంగా ఉంటే మాత్రం తను ఆమెను వదులుకోగలడా? అది ఎప్పటికీ జరగదు.

"హరీ! పైకిలే. మన స్టాపింగ్ వచ్చేసింది" అని నీలిమ అనడంతో ఆలోచనలను కట్టిపెట్టి బస్సు దిగేశాడు హరిబాబు నీలిమతో పాటు.

ఇద్దరూ శానిటోరియంలోకి నడిచారు.

"ఇక్కడ మా ఫ్రెండు ఉండే క్వార్టర్స్‌కు వెళదామా?" అంది నీలిమ.

"వద్దు నీలూ" అన్నాడు హరిబాబు.

"ఏం?"

"అక్కడికెళితే నేను నీతో ఫ్రీగా మాట్లాడలేను. మనమధ్య పరాయి వాళ్లుంటే నాకెందుకో ఇబ్బందిగా ఉంటుంది"

"అయితే ఎక్కడకూర్చొని మాట్లాడుకొందాం?"

"ఎక్కడైనా...కాస్త దూరంగా..."

"సరే అయితే పద" అంది నీలిమ.

ఇద్దరూ నడుస్తున్నారు.

నీలిమ అక్కడ శానిటోరియంలో ఉండే ఒక్కొ వార్డూ చూపిస్తూ అక్కడున్న రోగులను గురించి, డాక్టర్స్ వాళ్లకు ఇచ్చే ట్రీట్‌మెంట్‌ను గురించి, అక్కడుండే వాతావరణాన్ని గురించి చెబుతోంది.

"నీలూ! అదిగో అక్కడో పెద్ద వేప చెట్టూ, దాని కింద వెడల్పయిన రాతిబండ కన్పిస్తోంది చూశావా? అక్కడ కూర్చుందామా?" అన్నాడు హరిబాబు.

"సరే పద" అంది నీలిమ.

ఇద్దరూ వెళ్ళి అక్కడ ఆ రాతిబండ మీద పక్కన పక్కన కూర్చున్నారు. గాలి చల్లగా వీస్తోంది. చెట్లు గాలికి మెల్లగా అటూఇటూ ఊగుతున్నాయి. అక్కడక్కడా ముళ్ళపొదలు...ఆ పొదల్లో దాక్కొని ఉడుతలు కాబోలు అరుస్తున్నాయి.

"సిగరెట్లు తాగడం మానేశావా?" అడిగింది నీలిమ.

"మానకుంటే నువ్వు ఊరుకుంటావా? ఏ రోజు ఉత్తరంలో మానెయ్యమని చెప్పావో ఆ రోజే మానేశాను" అన్నాడు హరిబాబు.

"అబ్బో! మన మాటకు చాలా విలువుందే"

"విలువ మాటకుకాదు..మనిషికి"

"అన్నట్టు అడగడం మరిచాను. ప్రేమలేఖను..."

"మరిచిపోకుండా తెచ్చాను. ఇదిగో" అంటూ శుభ్రంగా మంచి అట్ట వేయబడిన పుస్తకాన్ని నీలిమకందించాడు హరిబాబు.

మెల్లగా పుస్తకం తెరిచింది నీలిమ.



అందులో... ప్రియమైననీలూకి

ప్రేమతో హరి—

ఇలా రాయబడి ఉంది.

"ఇది నాకు కానుకా?" అడిగింది నీలిమ.

అవునన్నట్టు తల ఆడించాడు హరిబాబు.

"అబ్బో! పెద్దకానుకే తెచ్చావు"

"కానుకగా ఇప్పుడు నీకు ఇవ్వడానికి నా దగ్గరేం మిగిలిందని?"

ఇద్దరిమధ్యా రెండుక్షణాల మౌనం.

"సారీ హరీ! నీకు నేను ఏమీ తీసుకు రాలేదు"

"ఏమిటి?"

"కానుక" అంది నీలిమ.

"అది నువ్వెప్పుడో ఇచ్చేశావ్లే" అన్నాడు హరిబాబు. ఆమాట అనగానే నీలిమ చటుక్కున హరిని చూసి మళ్ళీ తలదించుకొంది.

"నువ్విచ్చిన ఆ కానుకేమిటో తెలుసా?"

'ఏమిటి' అని అడగలేదు నీలిమ. మౌనంగా ఉండిపోయింది.

నీలిమ ఎందుకని సరిగా మాట్లాడడం లేదు?

ఎందుకలా మౌనంగా ఉండిపోతోంది?

తన ప్రశ్నలకు ఎందుకని సమాధానాలు చెప్పదు?

ఓవేళ స్త్రీకి సహజంగా ఉండే సిగ్గు వల్ల అలా మౌనంగా ఉండిపోతోందేమో! అవునుమరి. స్త్రీ కొన్ని ప్రశ్నలకు సమాధానం చెప్పదు. దానిని మగవాడే గ్రహించాలి. తను ఎక్కడో చదివినట్లు గుర్తు మాటల ద్వారా తన అభిప్రాయాన్ని వ్యక్తం చేయని స్త్రీ సగం ఒప్పుకొన్నట్లే అని.

తైమెపోతోంది.

నీలిమ అప్పుడప్పుడూ తన రిస్ట్ వాచీలో టైంచూసుకొంటోంది. ఒక్కోసారి ఆకాశంవేపు ఎంత పొద్దెక్కిందా అన్నట్లు చూస్తోంది.

నీలిమ తన కుటుంబం గురించి చెబుతోంది.

తమ కాలేజీని గురించి చెబుతోంది.

సినిమాల గూర్చి మాట్లాడుతోంది.

రాజకీయాలను గూర్చి మాట్లాడుతోంది.

తెలుగు సాహిత్యం గూర్చి మాట్లాడుతోంది.

కానీ నిజానికి దేన్ని గురించి మాట్లాడాలో దాన్ని గురించి నీలిమ మాట్లాడ్డం లేదని అన్పిస్తోంది హరిబాబు.

"హరీ! ఒంటిగంట కావస్తోంది" అంది నీలిమ.

"ఇక మనం బయలుదేరాలి" మళ్ళీ అంది.

"అప్పుడేనా?"

"ఒకటిన్నర లోపల నేను ఇంట్లో ఉండి తీరాలి. లేకుంటే అమ్మ చీవాట్లు పెడుతుంది. చెప్పానుకదా అమ్మ చాద స్తం మనిషని. కానీ ఆమెకు చాలా సంస్కారం ఉంది. నీనుండి ఇప్పటికి ఎన్ని ఉత్తరాలొచ్చాయో నాకుతెలియదు. కానీ ఏరోజూ అమ్మ నీ ఉత్తరాన్ని చదివి ఎరుగదు. టైమై పోయింది. ఇక బయల్దేరుదాం" అంటూ పైకి లేచింది నీలిమ.

హరిబాబు ఏమీ మాట్లాడలేదు.

అతని గుండెలనిండా అసంతృప్తి

ఏదో బాధగా, వెలితి వెలితిగా ఉంది.

తను ఏవిషయాన్ని అడగాలని ఎంతో ఆశతో వచ్చాడో ఆ విషయాన్ని నీలిమను అడగలేకపోయాడు హరిబాబు.

మదనపల్లిలో బస్సు ఆగింది.

ఇద్దరూ దిగేశారు.

"ఇక వెళతాను హరీ" అంటూ వెళ్ళిపోయింది నీలిమ. హరిబాబు బుర్రలో ప్రస్తుతం నీలిమ పెద్దక్వొశ్చన్‌మార్క్‌గా మిగిలింది. వైజాగ్‌కు తిరిగి వస్తుంటే ఎందుకో ఆపుకోలేనంత దుఃఖం వచ్చేసింది హరికి. తను అడగవలసిన విషయాన్ని స్పష్టంగా రాసి వైజాగ్ నుండి నీలిమకు ఉత్తరాన్ని పోస్ట్ చేశాడు హరిబాబు.

* * *

పది రోజులు గడిచాయి.

నీలిమ నుండి ఉత్తరం దూసుకొచ్చింది హరిబాబుకు.

ఆ ఉత్తరం కోసం రోజూ ఎదురు చూస్తున్నాడు.

ఉత్తరాన్ని గబగబా చేతికి తీసుకొన్నాడు.

హరిబాబు కళ్లల్లో-ఈ ప్రపంచంలో తొలి ప్రాణికి జీవంపోసి ఆ ప్రాణి కదలికకై ఎదురుచూసే సృష్టికర్తలా ఆతృత. కన్ను తెరవగానే తను ప్రసవించిన తొలి సంతానాన్ని చూడడానికి ఆ తల్లి కళ్ళల్లోని ఆతృత.

"మిస్టర్ హరిబాబూ! ఒక అమ్మాయిని సాధారణంగా ఒక అబ్బాయి ఏ దృష్టితో చూస్తాడో నువ్వూ అదే దృష్టితో నన్ను చూశావు. అందరి మగాళ్ళలోనూ నువ్వు కొంచెం భిన్నమైన మగవాడివని భ్రమపడ్డాను. లాభంలేదు. నువ్వూ అందరిలాంటి మగవాడివే. ఆడది కాస్త చనువుగా ఉన్నంత మాత్రాన తనను ప్రేమిస్తోందని అనుకోవడం మీ మగాళ్ళలో ఉండే బలమైన బలహీనత. నేనెప్పుడూ నువ్వు నన్ను చూసినదృష్టితో

నేను నిన్ను చూడలేదు. మన కులాలు వేరు. మన అంతస్తులు వేరు. అలాంటప్పుడు మనిద్దరికీ పెళ్ళి జరుగుతుందని నువ్వెలా అనుకోగలిగావు? ఒక్క మాటలో చెప్పాలంటే నన్ను ప్రేమించడానికి నీకు ఏ అర్హతా లేదు. నిన్ను ఓ మంచి స్నేహితుడిగా, ఓ ఆత్మీయుడిగా మాత్రమే నేను ఇన్నాళ్ళూ చూశాను. ఇక ఏ మగాడితోనూ స్నేహం చెయ్యకూడదని నాకు మంచి గుణపాఠం నేర్పావు. ఇదే నేను నీకు రాసే చివరి ఉత్తరం. ఇకనుండి నువ్వు కూడా నాకు ఉత్తరాలు రాయకు. ఆఖరిగా చెబుతున్నాను. నేను నిన్ను ఆ దృష్టితో చూడలేదు. అమ్మ మీద ఒట్టు. నేను అబద్ధం చెబుతుంటే మా అమ్మ నాకు దక్కదు"

హరిబాబు గుండెలు బద్దలైపోయాయి.

పిచ్చిగా అరిచాడు... గుండెలు బాదుకొన్నాడు.

జుట్టు పీక్కున్నాడు. హృదయ విదారకంగా ఏడ్చాడు.

నీలిమ...నీలిమ ఎందుకిలా చేసింది?

'పగిలిన హృదయాన్ని దేవుడికిస్తే అతికించి బాగుచేస్తాడు. కానీ నిండు హృదయాన్ని స్త్రీ చేతుల్లో పెడితే దానిని పగులగొట్టేవరకు నిద్రపోదు' అన్నారొకరు...నిజమేనన్నమాట!

అబ్బ! ఎంత నగ్నసత్యమిది!

నువ్వంటే నాకు ప్రాణం. మన శరీరాలు వేరైనా మన ఆత్మలు ఒక్కటే. నాకు ఎన్ని ఉన్నా నువ్వు లేకుంటే నేను ఏమీలేనిదానికిందే లెక్క. నువ్వు నాకు దక్కని రోజున నేనీ ప్రపంచంలో ఉండను. మనిద్దరినీ విడదీసే శక్తి ఆ మృత్యువుకు కూడా లేదు....

ఇలా... ఇలా ఉత్తరాలలో రాసిన నీలిమేనా ఇప్పుడీ ఉత్తరం రాసింది? తనకు ఇన్నాళ్ళూ ఒక స్నేహితుడికి ఉత్తరాలు రాసినట్లే రాసిందా? అందులో, ఆ ఉత్తరాలలో ఒక్క స్నేహం తప్ప అంతకుమించి ఇంకేమీలేదా? ఇంకేమీ లేనప్పుడు నీలిమ తనకాధోరణిలో ఎందుకలా ఉత్తరాలు రాయాలి? నిజంగా ఆ ఉత్తరాలలో స్నేహం మాత్రమే ఉంటే ఇక ప్రేమ, అనురాగాలు అనేవి ప్రపంచంలో ఎక్కడుంటాయి? ఏ స్వరూపంలో ఉంటాయి?

నీలిమను ప్రేమించడానికి తనకు ఏ అర్హతా లేదట.

ఎంత నిర్దయగా, ఎంత దారుణంగా రాయగలిగిందీమాట!

ప్రేమించడానికి కూడా కొన్ని ప్రత్యేకమైన అర్హతలున్నాయా?

ఆ అర్హతలు ఏమిటి?

కులమా? అంతస్తులా? అందమా? హృదయమా?

అందమే అర్హత అనుకొంటే నీలిమ ఎలా ఉంటుందో కూడా తెలియనప్పటి నుండి తనుఆమెను గాఢంగాఆరాధించాడు. ప్రేమించాడు. ఓ వేళ తను అందంగా లేడేమో...తన రూపం చూశాక తన అందం నీలిమకు నచ్చలేదేమో! ఆ విషయాన్ని చెప్పలేక డొంకతిరుగుడుగా ఉత్తరం రాసిందేమో... నిజంగా తను అందంగా లేడేమో...!

అందంగా ఉన్నవాళ్ళకే ప్రేమించే అర్హత ఉంటుందా?

అందానికీ, ప్రేమకూ అవినాభావ సంబంధముందా?

అందంగా లేనివాళ్ళు ప్రేమించబడరా?

అంద విహీనుల ప్రేమ చరిత్రకు





ఎక్కడా? చరిత్రకు ఎక్కినవాళ్ళందరూ అందమైనవాళ్ళేనా? నిజమేమరి. క్లియో పాత్రా, నూర్జహాన్, లైలా వీళ్ళందరూ అందమైనవాళ్ళే. వీళ్ళ ప్రియులు కూడా అందమైనవాళ్ళేనేమో...!

నీలిమ ఎంత దారుణానికి ఒడిగట్టింది!

స్త్రీహృదయానికి నిర్వచనం వంచనా? దగానా?

ఒకవేళ ఆ ఉత్తరాలలో నిజంగా స్నేహమే ఉందేమో..!

తను మగాడు గనుక తనకు ఆ ఉత్తరాలలో లేనిదేదో కన్పిస్తోందేమో! పోనీ తను ఇన్ని ఉత్తరాలు రాశాడుగదా ఆఖరి ఉత్తరంలో తప్ప అంతకుముందు ఏ ఉత్తరంలోనూ 'నీలిమా!నిన్ను గాఢంగా ప్రేమించాను మనిద్దరం పెళ్ళిచేసుకొందాం' అని తను రాయగలిగేడా? లేదు. ఎందుకని? నీలిమను, ఆమె చనువును...తను మరోవిధంగా అపార్థం చేసుకొన్నాడేమో!

'పరిమితమైన హృదయం... అనంతమైన హృదయాన్ని అవగతం చేసుకోజాలదు' అన్న 'డ్రైడన్' మాటలు నిజమేనేమో! ఇక్కడ ... పరిమితమైన హృదయం ఎవరిది?తనదా లేక నీలిమదా? ఓ వేళ..విశాలమైన నీలిమ హృదయాన్ని అవగతం చేసుకోలేక తను ఆ అమ్మాయి మీద అభాండాలు వేస్తున్నాడా?

లేదు... లేదు... తను అభాండాలు వెయ్యడం లేదు.

నీలిమ తనను మోసగించిన మాట వాస్తవమే.

ఈ ఉత్తరాలను తీసుకెళ్లి ఎవరి ముందు పడేసినా చదివినవాళ్ళందరూ 'హరీ! నువ్వు చాలా దారుణంగా మోసపోయావు' అని అనకమానరు.

ఒకనాటి అమృత...

మరోనాటి సౌందర్య...

ఈనాటి నీలిమ... వీరు ముగ్గురూ తమకు తాముగానే తన జీవితంలోకి ప్రవేశించి... తన హృదయ తెరపై కొంతసేపు ఆడుకొని వెళ్ళిపోయారు. శూన్యమైన తెరలాగే తన హృదయం మిగిలిపోయింది.

అమృతతో పెంచుకొన్న అనుబంధాన్ని కాలం తెంపేసింది.

'నిన్ను ప్రేమించే అర్హత నాకులేదు హరీ' అంటూ సౌందర్య బంధాన్ని తెంచుకొని వెళ్ళిపోయింది. కానీ ... ఇప్పుడు 'నన్ను ప్రేమించే అర్హత నీకు లేదం'టూ నీలిమ.. తన దారిన తాను వెళ్ళిపోయింది. జీవితంలో ఎన్నిమలుపులు..ఎన్ని అనుభవాలు...ఎన్ని అనుభూతులు!

తన జీవన వీణలో ప్రేమ తంత్రులు తెగిపోయాయి.

తన ఊహలు ఉరి తియ్యబడ్డాయి. వాస్తవం వెక్కిరించింది.

సముద్రం లాంటి ఆశ స్వరూపం లేకుండా కరిగిపోయింది.

నీలిమ హృదయం పంచదార పూత పూసిన విషపు మాత్ర.

తనకూ, నీలిమకూ మధ్య జరిగిన ఈ తతంగాన్ని ఎవరేనా వివరంగా విని, చదివి తన మీద బోలెడంత సానుభూతిని చూపిస్తారేమో... 'అయ్యో పాపం' అంటూ తనమీద జాలి చూపుతారేమో... అమ్మాయిలను గుడ్డిగా, వెర్రిగా ప్రేమించే యువకులు తనను చూసి జాగ్రత్తపడతారేమో...!

కానీ.. స్త్రీలు మాత్రం నీలిమ పాత్ర చాలా అసహజంగా ఉందనీ, కేవలం స్త్రీని నీచంగా చిత్రించడానికే అలా

సృష్టించిందని దుమ్మెత్తిపోసినా పొయ్యవచ్చు. కానీ.. వాళ్ళకేం తెలుసు? నీలిమ ఈ సమాజంలోనే ఉందనీ, తను మోస పోయాననీ, ఇది కట్టు కథ కాదనీనూ.

మన అనుభవానికి రాని విషయాన్ని.. ఏ రచయితో నవలలో చిత్రిస్తే అది అసహజం కాదు. తన జీవితాన్ని.. జీవితంలోని అనుభవాలను ఏ నవలైనా స్పృశించగలిగితే అదో గొప్ప నవలని ఆ పాఠకుడనుకొంటాడు. తన జీవితాన్ని ఏ కోణంలోనూ స్పృశించని నవలను అదో చెత్తనవల అని పాఠకుడు అనుకోనూవచ్చు.

ఓ వేళ తన జీవితం నవలగావస్తే.. ఏ పాఠకుడైనా ఆ నవలలోని నీలిమ

పాత్ర చాలా 'అవాస్తవికం' అనగలిగితే ఆ పాఠకుడికి తను నీలిమ రాసిన ఉత్తరాలను చూపెట్టి... నీలిమ పాత్ర వాస్తవికమైందేనని రుజువు చెయ్యగలడు. ఏ రచయితైనా.. 'ఇలాంటి ఇతివృత్తం గల నవలను నేను ఇదివరకే రాశాను. ఈ నవల నా నవలకు కాపీ' అని అనగలిగితే-'ఇది నీ నవలకు కాపీ కాదయ్యా బాబూ! ఇది నా జీవితం' అని తను ఆ రచయితకు ఆధారాలను చూపించగలడు. కానీ.. తన జీవితం నవలగా రూపొందదు. కారణం.. తను రచయిత కాదు.

ఏ నీలిమ తనను గుండెల్లో దాచుకొంటుందని భ్రమించాడో..

ఆ నీలిమ తన గుండెలపై బరిసె పోట్లు పొడిచింది.



ఏ చేతులు తనను లాలించి, తన కన్నీటిని తుడిచి తనను ప్రేమగా ఒడి లోకి తీసుకొంటాయని కలలు కన్నాడో.. ఆ చేతులు తన కళ్ళను పొడిచేసి, కను పాపలు పీకేసి అంధకారాన్ని మిగిల్చి దిక్కు తెలియని పాంథుడిలా చేశాయి తనను. తనకన్నా శాపగ్రస్తుడెవడు?

ఈ కళామయ ప్రపంచంలో తన ప్రేమ వెలసిపోయిన రంగు.

ఈ లోకంలో బాధ.. నిరాశ.. నిస్పృహ ఘర్షణల మధ్యే తన జీవితం కొట్టుమిట్టాడుతోంది. తన జీవన వనం లోకి ఇంతవరకు వసంత ఋతువు ప్రవేశించనే లేదు.

ఇదంతా తన వేదన..

వినగలిగితే నీలిమకు నివేదన..

ఏమిటో ఈ నిర్భర విరహవేదన..

అబ్బ! ఏమిటి జీవితం? ఎందుకిలా వేధిస్తుంది? ఎందుకిలా బాధిస్తుంది? ఎందుకిలా పొడుస్తుంది.. శూలంలాగా, కరవాలంలాగా. 'క్షణికానందం కోసం మనం పరుగులు తీసినప్పుడు.. సంప త్సరాల తరబడీ మనం శాంతి లేకుండా చేసుకొంటాం'అనిబల్వార్ చెప్పినమాటలో ఎంత సత్యముంది! అనురాగం.. ఆప్యా యత అంటూ వాటికోసం పరుగులెత్తి తన జీవితాన్నంతా అశాంతిపాలుచేసుకొన్నాడు తను.

అసలీ ప్రపంచంలో ప్రేమ అనేది ఉందా?

అది ఎక్కడుంది? ఏ రూపంలో ఉంది?

ఏ రూపంలో ఉందో తెలుసుకోవా లనే తను ఆరాటపడి కాలాన్ని వృధాచేసి గుండెల నిండా కటిక చీకటిని నింపు కొన్నాడు.కానీ ఒక్కవిషయం తెలుసుకో గలిగాడు. స్త్రీ అంటే...అర్థంగాని అదో అపూర్వశక్తి. ఆ శక్తి మగాడిని చీకటి నుండి వెలుతురుకూ,వెలుతురునుండి చీకటి చెంతకూ;మృత్యువునుండి అమృతత్వానికీ, అమృతత్వంనుండి మృత్యువు చెంతకూ తీసుకపోగలదు.

స్త్రీ...ఒక అమృతభాండం. ఒక విష కుంభం.

తన జీవితం ఓ మరుభూమి... ఓ స్వప్నసీమ ఓ ఎడారి...

స్త్రీని ప్రేమించడం.. స్త్రీచే ప్రేమింప బడడం తనకు చేతకాదేమో!తను అసమర్థు డేమో! ఈ ప్రేమయాత్రలో తను గమ్యం చేరలేదు.

కాలం ఎడారిలో తనో ఒంటరి బాట సారి.

పెనుగాలి స్పర్శతో తీగనుండి రాలి పోయిన విరి.

అలా...అలా...పిచ్చివాడిలా ఆలో చించుకుంటూ మథనపడుతున్నాడు హరి బాబు.

గదిలో హరిబాబు ఒక్కడే.

ప్రసాద్ ఊరినుండి తిరిగిరాలేదు.

తన పరీక్షల విషయం చటుక్కున అప్పుడు గుర్తుకొచ్చింది హరిబాబుకు.

గుండెలు దడదడా కొట్టుకొన్నాయి హరిబాబుకు.

అతడు నీలిమకు ఉత్తరాలు రాయ డంతోటే...ఆమెను గురించి కలలు కనడం తోటే కాలమంతా అయిపోయింది. పుస్తకాలు ఎక్కువగా ముట్టుకొనేవాడు కాదు.

సాయంత్రంపూట బజార్లలోనూ, బీచ్‌లోనూ తనతో చదువుకొనే విద్యార్థులు ఎవరూ కన్పించడం లేదు. అందరూ కూర్చొని చదువుకొంటున్నారు. హరిబాబు




గదిలో పుస్తకం ఎత్తితే నీలిమ గుర్తు కొస్తోంది.

అబ్బ! ఈ స్థితిలో ఎలా చదవడం?

చదవకుంటే తను పాస్ కావడం ఎలా?

నీలిమను మరచిపోయి బాగా చదవాలి.

ఆ రాక్షసికోసం తన చదువు నాశనం చేసుకోకూడదు.

ఏమైనాసరే రాత్రింబవళ్ళు చదవాలి. హరిబాబు గట్టి నిర్ణయం తీసుకొన్నాడు. ఓ కొట్టులో తలనొప్పి మాత్ర కొనుక్కుంటుంటే ఆ కొట్టులోనే మరోపక్క అమర్చిన సిగరెట్ ప్యాకెట్లు హరిబాబును అపహాస్యం చేస్తున్నట్లుగా కనిపించాయి. నీలిమ అతడిని సిగరెట్స్ మానమని ఉత్తరంలో రాసిన మాటలు గుర్తు కొచ్చాయి. వెంటనే రెండు ప్యాకెట్లు సిగరెట్ పై సిగరెట్ వరసగా నీలిమ మీది కసితో తాగసాగాడు హరిబాబు.

రోజులు గడుస్తున్నాయి. రాత్రింబవళ్లు చదువుతున్నాడు హరిబాబు. ఆరోగ్యం బాగా చెడిపోయింది. నీరసంగా తయారయ్యాడు. ప్రసాద్ ఊరినుండి రావడంతోనే హరిని డాక్టర్ దగ్గరికి తీసుకు వెళ్లాడు. అంతకుముందే ఉన్న టి. బి: లక్షణాలు ఈమధ్య బాగా ముదిరాయంటూ డాక్టర్ ఇచ్చిన సలహాను అనుసరించి ఆ సంవత్సరం పరీక్షల్ని వదిలేసి మదనపల్లి టి.బి. శానిటోరియంలో చేరిపోవడం జరిగింది.

చీకటిపడుతోంది.

తోమిన కంచంలాగా ఆకాశంలో పైపైకి వస్తున్నాడు చంద్రుడు. ఆకాశ దేవత మెడలోని హారం తెగిపోగా జారి చెల్లాచెదురైపోయిన ముత్యాలలాగా ఉన్నాయి – ఆకాశంలో అక్కడక్కడా చుక్కలు.

ఆ సమయంలో శానిటోరియంలో ఆ వేపచెట్టు కింద కూర్చొని నీలిమకు సంబంధించిన ఆ గతాన్ని తవ్వుకొంటూ కూర్చున్న హరిబాబు మెల్లగా పైకిలేచి తన వార్డ్ వేపు నడకసాగించాడు.

అప్పటికే రోగులందరూ వార్డ్ లోపలికెళ్ళిపోయారు.




కాలానికి కళ్ళెం వెయ్యడం ఎవరివల్లా కాదు.

రోజులు దొర్లిపోతున్నాయి.

మందులు తింటూనే ఉన్నాడు హరిబాబు.

అతడికి ఇప్పుడు కొంచెం ఒళ్లు పెరిగింది.

కొంచెం బలంగా తయారయ్యాడు. ఇక ఆ శానిటోరియంలో ఉండలేకపోతున్నాడు. ఎప్పుడూ ఏవో మందులూ, మాత్రలూ, తిండీ తింటూ కూర్చోవడం– ఇదేపని అక్కడ.

ఏమిటీ దుర్భరమైన బతుకు...

తినడం... నిద్రపోవడం...

బాధలు గుర్తుకు తెచ్చుకుని మధనపడడం....

ఇంతేనా ఇక్కడి జీవితం?

ఇక్కడి నుండి ఎప్పుడు తను బయటపడడం?

ఆశను చంపుకొన్న కళ్లతో, మోస పోయిన జీవితంతో గాజు ముక్కలాగా పగిలిపోయిన హృదయంతో ఇంకా తను ఈ శానిటోరియంలో, ఈ నాలుగు గోడల మధ్య ఎన్నాళ్ళని జీవించాలి?

ఇక్కడ అశాంతినీ, అశ్రుకిరణాలను ప్రసరించే కొడిగట్టిన జ్ఞాపకాల ప్రమిదలో అనుభూతి తైలాన్ని పోసుకొంటూ గతం గుండెల్లో రగిలించిన స్మృత్యాగ్నికణాల కుంపటిముందు కూర్చొని వెచ్చ వెచ్చగా చలికాచుకొంటూ ఎన్నాళ్లని తనిలా ఇక్కడ బతకడం?

రేపు మీద ఆశలేదు.

జీవితంపై ధ్యాసలేదు.

అనుభవాలతో ఆశలన్నీ మృగ్యమై..

పరాపజయాలతో బతుకుమీది తీపి విధ్వంసమై....

అన్నీ పోగొట్టుకొన్న తన శూన్య హృదయం శుష్కించి... వెక్కి వెక్కి ఏడుస్తూ విషాదారోహకగీతాన్ని ఆలా పిస్తోంది.

తెగిపోతున్న జీవితాన్ని ముడిపెట్టు కోవడంతోనే, ఓడిపోతున్న హృదయాన్ని ఓదార్చుకోవడంతోనే కాలమంతా గడిచి పోతోంది.

ఇక్కడ..చీకటి గుహలాంటి శాని టోరియంలో... ప్రతిక్షణం భయంతో, బాధతో వేదనతో ఇలా బతకడం కన్నా ఒక్కసారిగా చచ్చిపోవడమే నయం. అదే జరిగితే.... ఈ చింతనుండి తను బయటపడవచ్చు.

ఈ చింత...ఒక చితి లాంటిది. చితిలో చచ్చిన మనిషి కాలిపోతే..చింతలో బతికున్న మనుషులు కాలిపోతారు. అగ్ని గుండంలా రగిలే ఈ భయంకరమైన బాధలను భరిస్తూ బతకడంకన్నా ఈ క్షణమే తనను మృత్యువు ఆహ్వా నిస్తే...

ఈ ఘడియే తనకు చివరి ఘడియ అయితే బాగుండును.ఈ భౌతిక దేహాన్ని విడుల్చుకొని ఆత్మ దివ్యమని ఎటో ఎగిరిపోతే ఎంతో బాగుండును.

ఆలోచిస్తూ మెల్లగా నిద్రలోకి జారు కొన్నాడు హరిబాబు.

కాలప్రవాహం సాగిపోతోంది.

హరిబాబుకు ఎక్స్రే తీశారు.

ఎక్స్రే రిపోర్ట్ వినగానే అతని గుండెల్లో ఆనందం ఒక్కసారిగా ఉప్పొంగింది. అతడి మనసు పురివిప్పిన నెమలిలా నృత్యం చెయ్యసాగింది.

హరిబాబుకు వ్యాధి నయమైపోయింది.

శానిటోరియం నుండి అతడిని డిశ్చార్జ్ చేస్తున్నారు.

అబ్బ! ఇక తను వెళ్లిపోవచ్చు.

ఈ ఊబిలోంచి తనకు విముక్తి లభిస్తోంది.

తను మామూలు ప్రపంచంలోకి వెళ్ళి పోతున్నాడు. తను తొందరగా యిక్కడి నుండి వెళ్లిపోవాలి. మెడిసిన్ కంటిన్యూ చెయ్యాలి.

ప్రయాణానికి సిద్ధమయ్యాడు హరి బాబు.

డాక్టర్సకూ, నర్సులకూ అందరికీ చెప్పివచ్చాడు.

"హరిబాబూ! ఇక్కడి నుండి వెళ్లి పోతున్నావా?" అడిగాడు తోటి పేషంట్.

"అవును. నా జబ్బు నయమైపోయిం దట. నన్ను ఈ రోజే శానిటోరియం నుండి డిశ్చార్జ్ చేస్తున్నారు" చెప్పాడు హరిబాబు.

హరిబాబు డిశ్చార్జ్ అయి వెళ్లిపో




తున్నాడన్న విషయం ఆ వార్డ్ అంతా పాకిపోయింది. రోగులందరూ అతడిని చుట్టుముట్టారు.

"ఇకనుండి ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో బాబూ"

"చీకట్లోంచి వెళ్లిపోతున్నావు. అదృష్టవంతుడివి నాయనా"

అంటూ ప్రతి ఒక్కరూ హరిబాబు వెళ్లిపోతున్నందుకు సంతోషంతో అతని ఆరోగ్యం పట్ల జాగ్రత్తగా ఉండమని చెప్పారు.

హరిబాబు ఓపికగా అందరితోనూ మాట్లాడాడు.

అందరికీ ధైర్యం చెప్పాడు.

అందరినీ ఓదార్చాడు.

"నాకులాగే మీకు కూడా జబ్బునయమై అందరూ యిక్కడి నుండి తప్పకుండా బయటపడుతారు" అని చెప్పాడు.

హరిబాబు ఆవార్డ్‌లోంచి కాలు బయట పెడుతుంటే అతనికేదో హృదయంలో చెప్పలేని బాధగా ఉంది. ఇన్నాళ్ళూ ఈ రోగుల మధ్య తనూ ఒకడు. కానీ నేడు తను రోగి కాదు.

తను వీళ్ళనందరినీ వదిలేసి వెళ్ళి పోతున్నాడు.

చివరగా...ఒక్కసారి ఆగి వెనక్కు తిరిగి వార్డ్‌లోని రోగుల ముఖాలకేసి చూశాడు హరిబాబు.

అందరి ముఖాలలోనూ విచారం.

వాళ్ళను వదిలేసి అతడు వెళ్ళి పోతున్నందుకు ఆ రోగుల హృదయాలలో ఏదో దిగులు. అందుకే ఎవరూ హరిబాబుకు సంతోషంగా వీడుకోలు చెప్పలేక పోయారు. కారణం — అతడికి జబ్బు నయమై వెళ్లిపోతున్నందుకు కాదు ఆ దిగులు. ఒక కుటుంబంలాంటి ఆ వార్డ్ లోంచి ఒక మంచి వ్యక్తి తమను వదిలేసి వెళ్లిపోతున్నాడే అని వాళ్ళ బాధ. అది హరిబాబు మీద ఆ రోగులకుండే అభిమానం.

హరిబాబు నడక సాగించాడు.

శానిటోరియం గేటు దాటుకొని రోడ్డు మీదికొచ్చి నిలబడి ఆ గేటును, తిరిగి చూశాడు.

అది ఇప్పుడు మృత్యులోకపు ముఖ ద్వారంలా కన్పించడం లేదు.

శానిటోరియంలోకి వేయబడిన ఆ వెడల్పయినబాట స్వర్గానికి వేయబడిన రహదారిలా ఉంది అతనికి. చల్లగా వీస్తున్నగాలి అతనికి వీడ్కోలు చెబుతున్నట్లుగా ఉంది.

మదనపల్లి వెళ్ళే బస్సు వచ్చి ఆగింది.

హరిబాబు గబగబా ఆ బస్సెక్కి మదనపల్లిలో దిగి వెంటనే అక్కడినుండి తన ఊరికి మరో బస్ ఎక్కాడు.

* * *

ఊళ్ళో కొన్నాళ్లుండి, విశాఖపట్నం వెళ్లి మళ్ళీ మెడిసిన్ కంటిన్యూ చెయ్య సాగాడు హరిబాబు.

కాలవాహినిలో గంటలూ, రోజులూ కొట్టుకపోతున్నాయి.

అద్దె గదిలో ఒంటరిగా నివాసం.

కాలేజికి వెళ్లి రావడం,చదువుకోవడం —ఇదే వ్యాపకం.

ఇక ఏ స్త్రీతోనూ తన జీవితం ముడిపడరాదని గట్టిగా నిర్ధారణ చేసుకొన్నాడు.

'అనుభవాల వెలుగులో ముందుకు పయనించే వ్యక్తి మళ్లీ తప్పులు చెయ్యడు. గతం నేర్పిన పాఠాలే భవిష్యత్తుకు బంగారు బాటలు' అని ఎక్కడో

చదివిన మాటలు అతని హృదయంలో బాగా నాటుకపోయాయి.

అందుకే ఇకనుండి తను ఏ స్త్రీ జీవితంలోకి ప్రవేశించడంగానీ... ఏ స్త్రీని తన జీవితంలోకి ప్రవేశించే అవకాశాన్ని ఇవ్వడం గానీ చెయ్యకూడదని హరిబాబు గట్టి నిర్ణయం తీసుకొన్నాడు.

ప్రసాద్ నుండి ఉత్తరం వచ్చింది.

"డియర్ హరీ! నీ ఉత్తరం అందింది. యింకో శుభవార్త. మీ జిల్లాలోనే నాకు ఉద్యోగం వచ్చింది. ఇక్కడ ఇంగ్లీష్ లెక్చరల్ పోస్ట్ వచ్చింది. పదిహేను రోజుల క్రితం జాయినయ్యాను. నువ్వు మాయింటికి రాసిన ఉత్తరం ఇక్కడికి రీడైరెక్ట్ చెయ్యబడింది. ఇక్కడ రూం తీసుకొని ఉంటున్నాను. కింద అడ్రసు ఇస్తున్నాను. ఇకనుండి నువ్వు ఉత్తరాలు ఈ అడ్రసుకు రాయి. లేదా కాలేజీ అడ్రసుకు రాయి. నీకు వీలుంటే ఓసారి వచ్చివెళ్ళు. నిన్ను చూసి చాలారోజులైంది. ఈ ఉత్తరం నేను కాలేజిలో కూర్చొని రాస్తున్నాను. నాకు క్లాసుకు టైమ్అయ్యింది. ఇక వెళ్తాను. వెంటనే బదులు రాయి.

ప్రసాద్"

ఉత్తరంచదవడమైపోయాక ప్రసాద్‌కు రిప్లై రాద్దామని ఇన్‌లాండ్ కవర్ కోసం టేబుల్ సొరగులో చూశాడు హరిబాబు.

కానీ అందులో అది కన్పించలేదు.

ఎక్కడో రెండ్రోజుల క్రితం రూంలో ఖాళీ కవర్ చూసినట్లు గుర్తు అతనికి. ఎక్కడ చూశానా అని కొద్దిసేపు ఆలోచించాడు.

కానీ గుర్తురావడం లేదతనికి.

వెంటనే వెళ్ళి సూట్ కేస్‌లో వెదకసాగాడు. అలా వెదుకుతుంటే ఆ సూట్ కేస్‌లో ఎవరిదో అడ్రసు రాయబడిన ఒక కాగితం ముక్క కన్పించింది హరిబాబుకు. చేతికి తీసుకొని చూశాడు. అది లక్ష్మీదేవి అనే ఆమె విజయవాడ అడ్రసు రాయబడిన కాగితం ముక్క.

అది...అవును తనకు ఇప్పుడు గుర్తొచ్చింది.

ఇన్నాళ్ళూ తను చాలా పొరబాటు చేశాడు.

శానిటోరియం నుండి రాగానే తను ఈ అడ్రసు వెతుక్కుంటూ వెళ్ళి లక్ష్మీదేవిని కలుసుకొని ఉండాల్సింది. తను ఆమెను కలుసుకొని ఆమెకు సహాయం చేస్తానంటూ శానిటోరియంలో రాజశేఖరానికి మాటిచ్చాడు తను. తన మాటను నమ్మాడు రాజశేఖరం. అందుకే ఆరోజు ఈ కాగితం ముక్కమీద అడ్రసు రాసిచ్చాడు.

కానీ తను చేసిందేమిటి?

ఆ విషయాన్ని పూర్తిగా మరిచిపోయాడు.

ఇప్పుడు ఆ కాగితం ముక్కను చూస్తుంటే ఆ విషయం గుర్తుకొస్తోంది తనకు. ఛీ తను చాలా పొరబాటు చేశాడు. ఇప్పుడైనా మునిగిపోయిందేమీ లేదు. తను వెంటనే విజయవాడ బయల్దేరాలి.

వెంటనే బ్రీఫ్‌కేసులో రెండుమూడు జతలు బట్టలు సర్దుకొని ఆ కాగితం ముక్క జాగ్రత్తగా దాచుకొని విజయవాడకు బయలుదేరాడు హరిబాబు.

* * *

విజయవాడలో దిగి ఓ హోటల్ కెళ్ళి వేడివేడిగా కాఫీ తాగి రోడ్డుమీదికొచ్చాడు హరిబాబు.

"రిక్షా కావాలా సార్" అడిగాడు రిక్షావాడు. తను వెళ్ళవలసిన వీధి పేరూ,

ఇంటి నంబరూ చెప్పి రిక్షాలో కూర్చు న్నాడు హరిబాబు.

రిక్షావాడు హుషారుగా తొక్కుతు న్నాడు. ఆ రిక్షా ఎక్కడెక్కడో మలుపు తిరిగి చివరికి ఓ వీధిలోకి ప్రవేశించింది.

ఆ వీధి ఊరికి కొంచెం దూరంగా విసిరిపారేసినట్టుగా చూడడానికి అస హ్యంగా ఉంది. మురికి కాలువల్లోంచి దుర్గంధం వస్తోంది. చేతిగుడ్డతో ముక్కు మూసిపెట్టుకున్నాడు హరిబాబు.

ఓ ఇంటిముందు రిక్షా ఆగింది.

హరిబాబు షర్ట్‌జేబులోంచి కాగితం ముక్కనుతీసి చూశాడు. ఇంటి నంబర్ పరిశీలించి చూశాడు. అదే ఇల్లు.

ఇంటిముందు ఎవరో నలభైలోపు వయస్సుండే ఓ స్త్రీ నిలబడి ఉంది. రిక్షా లోంచి దిగి ఆమెను తదేకంగా చూశాడు.

లక్ష్మీదేవి ఈమేనేమో...!

రాజశేఖరం తను ఓ దేవతను మోసం చేశానని చెప్పాడు. బహుశా అతను మోసంచేసింది ఈవిడనేనేమో! రాజశేఖరం క్షయతో చనిపోయాడని చెబితే ఈమె ఎలా ఫీలవుతుంది? బహుశా షాక్ తింటుం దేమో...! అయినా చెప్పక తప్పదు.

ఆమెకూడా హరిబాబునే చూస్తోంది.

"ఏమండీ! ఇక్కడ లక్ష్మీదేవి అని..." ఆగిపోయాడు.

"ఆమె ఇప్పుడు ఇక్కడ లేదండీ" అంది ఆమె హరిబాబు ముఖాన్ని పరి శీలనగా చూస్తూ.

"ఎక్కడుందండి?" అడిగాడు హరి బాబు.

"కావలిలో" చెప్పిందామె.

"కావలి అంటే...నెల్లూరు జిల్లాలో"

"ఆఁఆఁ! ఆ ఊళ్ళోనే. ఈ ఇంట్లోంచి ఆమె వెళ్ళిపోయి మూడు నెలలైంది. మీరెవరు?వాళ్ళ తమ్ముడా?"అడిగిందామె.

"కాదండీ! కాస్త తెలిసినవాడిని"

ఇద్దరిమధ్య రెండు క్షణాల నిశ్శబ్దం

"కావలిలో ఆమె ఎక్కడుందో తెలుసా మీకు?" అడిగాడు.

"ఆ మధ్య నాకు రెండు ఉత్తరాలు రాసింది.అడ్రస్ కావాలా?" అడిగిందామె.

"ఉంటే రాసివ్వండి"

ఆమె ఇంట్లోకి వెళ్లి ఓ కాగితంమీద అడ్రసురాసి తెచ్చి హరిబాబుకు ఇచ్చింది.

"వస్తానండి"

"మంచిది"

రెండడుగులు ముందుకేసి మళ్ళీ వెనక్కు తిరిగాడు హరిబాబు. ఏంకావాలి అన్నట్టుగా చూసింది హరిబాబువేపు ఆమె.

"ఏమండీ! ఆమె...అంటే లక్ష్మీదేవి రాజశేఖరంకు ఏమవుతుంది?" అడిగాడు హరిబాబు.

"కొన్నాళ్ళు ప్రేయసి...కొన్నాళ్ళు ఉంపుడుగత్తె"

"ఆఁ"నిర్ఘాంతపోయాడు హరిబాబు.

తిరిగి బస్టాండు చేరుకొన్నాడు హరి బాబు.

ఇప్పుడు తను ఏం చేయాలి? కావలి వెళ్ళడమా లేక వైజాగ్ వెళ్ళడమా? కావలి వెళ్ళడమే నయం.ఇటు లక్ష్మీదేవిని, అటు ప్రసాద్‌ను కలుసుకోవచ్చు.

ఆ రాత్రి విజయవాడలో ఉండి మరు సటిరోజు బయలుదేరాడు.

కావలి బస్టాండులో దిగాడు హరిబాబు.

తను ఇప్పుడు ఎవరిని కలుసుకో వాలి?

లక్ష్మీదేవినా? లేక ప్రసాద్‌నా?

ఇవాళ ఆదివారం గనుక ప్రసాద్‌కు

కాలేజి ఉండదు. కాబట్టి రూములోనే ఉండొచ్చు. ముందు ప్రసాద్‌ను కలుసు కొంటే తర్వాత ఇద్దరూ కలసి లక్ష్మీదేవి ఉండే ఇంటిని వెతుక్కుంటూ వెళ్లి ఆమెను కలుసుకోవచ్చు.

ఆలోచిస్తూ హరిబాబు బస్టాండుకు పడమరగా ఉండే రోడ్డుమీదికొచ్చి నిల బడ్డాడు. ప్రసాద్ ఉత్తరాన్ని జేబు లోంచి తీసి అడ్రసును గుర్తు పెట్టు కొన్నాడు.

ఇంతలో రిక్షావాలా వచ్చి హరిబాబు ముందు నిలబడ్డాడు.

"జనతాపేటకు వస్తావా?"

"ఎక్కండి సార్" అన్నాడు రిక్షా వాలా.

బేరం మాట్లాడి ఎక్కి కూర్చున్నాడు హరిబాబు.

జనతాపేట దగ్గరుండే పెద్ద రైల్వే





గేటు మూసేసి ఉండడంతో అంతవరకూ తొక్కుకుంటూ వచ్చి రిక్షావాడు ఆ గేటు దగ్గర ఆగిపోయాడు.

"ట్రైను వచ్చే టైమయిందా?" అడిగాడు హరిబాబు.

"అవునండి" చెప్పాడు రిక్షావాడు.

రిక్షాలో కూర్చుని ఆ రైల్వే గేటునూ చుట్టు పక్కల పరిసరాలనూ పరిశీలనగా చూస్తున్నాడు హరిబాబు. గేటుకు అటు వేపు చాలా వాహనాలు నిలబడి ఉన్నాయి. కొందరు మనుషులు గేటు మూసేసి ఉన్నా పక్కవేపు గుండా రైల్వే పట్టాలను దాటుకొంటూ ఇవతలివేపుకు వచ్చేస్తున్నారు. మరికొందరు ఇవతలి వేపు నుండి అవతలి వేపుకు వెళుతున్నారు.

"జనతా పేట ఇక్కడికి ఎంత దూర ముంటుంది?"

"అదేనండి.. అదిగో గేటుకు అవతల ఇళ్లు కన్పిస్తున్నాయి చూశారా? అదే జనతా పేట" అంటూ రిక్షావాడు చేతితో జనతా పేటను చూ పెట్టాడు.

"ఈ ట్రైను వచ్చేసరికి చాలా సేపు అయ్యేటట్లుంది. నేను వెళ్లిపోతాన్లే" అంటూ రిక్షాలోంచి దిగి వాడికి చిల్లర ఇచ్చేసి సూట్ కేస్ అందుకొన్నాడు హరిబాబు.

"సార్! మీరు రోడ్ క్రాస్ చేసే టప్పుడు జాగ్రత్తగా క్రాస్ చేయండి. ఇది అసలే ఆక్సిడెంట్లకు సెంటర్. ఇక్కడ ఎప్పుడు ఆక్సిడెంట్ జరుగు తుందో ఎవరూ చెప్పలేరు. ఈ ఎలక్ట్రిక్ ట్రైన్స్ వేశాక ఈ గేటు దగ్గర ఆక్సి డెంట్లు జరగడం మరీ ఎక్కువై పోయింది. నిన్ననే ఇక్కడ ఓ లెక్చ రర్ను ట్రైను కొట్టేసింది" అంటూ రిక్షా వాడు పట్టాలను జాగ్రత్తగా క్రాస్ చెయ్యమని మరీమరీ చెప్పి వెళ్ళిపోయాడు.

హరిబాబు మెల్లగా వెళ్ళి పట్టాలకు ఇవతల నిలబడ్డాడు. అటూ ఇటూ చూసి ఏ ట్రైనూ రావడం లేదు గనుక పట్టా లను దాటుకొని అవతలికి వెళ్ళిపోతే తనకేమీ ప్రమాదం జరగదని నిర్ధారణ చేసుకున్నాక గబగబా రోడ్డును క్రాస్ చేసి అవతలకు చేరుకున్నాడు హరిబాబు.

అక్కడ నిలబడిన కొంతమంది మను షులు ఆ ముందు రోజు జరిగిన ఆక్సి డెంట్ను గురించి, ఆ ఆక్సిడెంట్లో చని పోయిన కాలేజి లెక్చరర్ మంచితనాన్ని గురించి మాట్లాడుకొంటున్నారు.

"హరీ!" నడుస్తున్న హరిబాబు ఆగి వెనుతిరిగి చూశాడు.

అక్కడ ప్రసాద్ కొట్టులో ఏదో కొనుక్కుంటున్నాడు.

"ఏమిట్రా! ఇలా ఉత్తరం ముక్కైనా రాయకుండా ఉన్నట్టుండి ఊడిపడ్డావ్?" అంటూ హరిబాబు దగ్గరికి గబగబా వచ్చాడు ప్రసాద్.

"అర్జంటు పని ఉంటేనూ..."

"అర్జంటుపని అంటున్నావు. ఏమి ట్రోయ్ కథ? ఈ కావలి జనతాపేటలో పెళ్లి కూతుర్నిగానీ చూడ్డానికి వచ్చావా ఏమిటి?"

"అలాంటిదేమీ లేదులేవోయ్" అంటూ తను వచ్చిన పనిని గురించి ప్రసాద్కు వివరంగా చెప్పాడు హరిబాబు.

ఇద్దరూ రూమ్ చేరుకొన్నారు.

"ఈ ఊళ్లో తుఫాన్నగర్ ఎక్క డుండేది?"

"దగ్గరే. ఏం?" అడిగాడు ప్రసాద్.

"లక్ష్మీదేవి ఉండేది తుఫాన్నగర్ లోనే" అంటూ తన జేబులో ఉన్న లక్ష్మీదేవి అడ్రసు రాయబడిన కాగితం ముక్కను ప్రసాద్కు అందించాడు హరి బాబు.

"మనం తుఫాన్నగర్ వెళ్ళి ఆమెను కలిసివద్దామా?" హరిబాబు అన్నాడు.

"ఇప్పుడా? అంత తొందర ఏముంది లేవోయ్! సాయంత్రం వెళ్లి కలుద్దాంలే" అన్నాడు ప్రసాద్.

తర్వాత ప్రసాద్ విశాఖపట్నం విశే షాలను గురించి, హరిబాబు చదువు గురించి ఇంకా ఎన్నెన్నో విషయాలను గురించి హరిబాబును అడిగాడు.

"పెళ్ళెప్పుడు చేసుకొంటావ్?" అడి గాడు ప్రసాద్.

"ఎవరు? నేనా?"

"ఆఁ...నువ్వే"

 

"నాకెందుకోయ్ పెళ్ళి. జీవితంలో గడించిన అనుభవాలు చాలు. ఇక ఏ ఆడదాన్నీ నా జీవితంలోకి ప్రవేశించ నీయకూడదని గట్టిగా నిర్ణయం తీసుకొన్నాను" చెప్పాడు హరిబాబు.

"నువ్వు తీసుకొన్న నిర్ణయం నీ తెలియనితనానికి నిదర్శనం. అమృత నిన్ను మోసగించలేదు. ఆ విషయం నీకు ఖచ్చితంగా తెలుసు. ఇక రెండవది సౌందర్య. ఆమె కూడా నిన్ను మోసగించలేదనే నేనంటాను. నిన్ను మోసగించే ఉద్దేశమే ఉంటే నీకు దూరంగా వెళ్ళిపోయేదికాదు సౌందర్య. ఇక మూడవ అమ్మాయి నీలిమ. ఈ అమ్మాయి నాకు ఇప్పటికీ అర్థంకావడంలేదు. కానీ నీలిమ నిన్ను మోసగించాలని అలా ప్రీప్లాన్‌గా చేసిందనిమాత్రం నేను అనలేను.ఎందుకంటే ఆ అమ్మాయి ఉత్తరాలలో ఆ కపట స్వభావం ఎక్కడా కన్పించడంలేదు. కాకపోతే కులాలు వేరని భయపడి ఉండొచ్చు. ఆ పిరికితనాన్ని ఒప్పుకునే ధైర్యంలేక తప్పును నీమీదే రుద్ది ఉండొచ్చు. ఆ అమ్మాయి అలా పిరికిగా చివరకు తయారుకావడానికి ఎన్నో సామాజిక కారణాలు ఉండవచ్చు. పోనీ నీలిమ నిన్ను మోసం చేసిందే అనుకో- ఆ మాత్రానికే స్త్రీలందరూ మగవాడిని మోసం చేసేవాళ్ళేనని నువ్వొక తప్పుడు అభిప్రాయాన్ని ఏర్పరచుకొని ఇక ఏ ఆడదాన్నీ జీవితంలోకి ప్రవేశించనీయ కూడదని నిర్ణయం తీసుకోవడం మాత్రం మూర్ఖత్వం" అన్నాడు ప్రసాద్.

"స్త్రీలందరూ మగాడిని మోసం చేసే వాళ్ళే అని నేను అనడంలేదు. కానీ చాలామంది స్త్రీలు ఆ కోవకు చెందిన వాళ్ళేనని నేనంటాను"

"చూడు హరీ! సమాజంలో మోసగించే స్త్రీలూ ఉన్నారు. మగాడిచేత మోసపోయే స్త్రీలూ ఉన్నారు. ఇకపోతే స్త్రీ విషయంగా దెబ్బతిన్న మగాడు..ఇంకో స్త్రీ ఎదురుపడినపుడు తను తిన్నదెబ్బను మరిచిపోతాడు. ఎందుకంటే ఎన్ని అనుభవాలున్నా మగాడికి ఎప్పటికప్పుడు స్త్రీతో అనుభవం కొత్తగానే ఉంటుంది. మన కంటిలో నలక పడిందనుకో- కనుపాపను పీకేస్తామా? ఎవరో స్త్రీ మోసగించిందని అసలుస్త్రీని పెళ్ళాడడమే మానేస్తామా? చెప్పు?" అడిగాడు ప్రసాద్.

హరిబాబు మౌనంగా ఉండిపోయాడు.

ఆ సాయంత్రం నాలుగు గంటలు దాటుతోంది.

హరిబాబు, ప్రసాద్ ఇద్దరూ తుఫాన్ నగర్‌కు బయలుదేరారు.

లక్ష్మీదేవి ఇక్కడ ఏంచేస్తోంది?

తనవాళ్లు ఎవరయినా ఉంటే వాళ్ళ ఇంట్లో ఉంటోందా?

రాజశేఖరం బహుశా లక్ష్మీదేవిని పెళ్లి చేసుకొంటానని ఎక్కడినుండో లేవదీసు కొచ్చి చివరకు తన సుఖంకోసం ఆమెను ఉపయోగించుకొని పెళ్లి చేసుకోకుండా వదిలేశాడేమో! లక్ష్మీదేవి హృదయం నిండా రాజశేఖరంపట్ల అసహ్యం పేరుకపోయి ఉంటుందేమో...!

తను రాజశేఖరానికి తెలిసినవాడినని చెబితే తనను అసహ్యించుకొంటుందేమో. కానీ ఆమెకు తను అన్నివిషయాలు వివరంగా చెప్పాలి. ఆమె ఓ వేళ ఇక్కడ ఏదైనా కష్టాలతో బతుకుతుంటే తను ఆమెను ఆదుకోవాలి. ఆమెకు సహాయం చెయ్యాలి. శానిటోరియంలో రాజశేఖరానికి ఇచ్చిన మాటను నిలబెట్టుకోవాలి. అంతే.. అదొక్కటే తన కోరిక. ఆకోరిక

తీరితే చాలు.

తుఫాన్‌నగర్ చేరుకొన్నారు ప్రసాద్, హరిబాబు.

ఓ ఇంటిముందు నిలబడ్డారు.

'ఎవరు కావాలి మీకు' అన్నట్టుగా చూసింది ఆ ఇంటి వాకిలిదగ్గర కూర్చొని బియ్యంలోని రాళ్ళను ఏరుకొంటున్న ఓ స్త్రీ.

"ఏమండీ! ఇక్కడ లక్ష్మిదేవి అని..."

"లక్ష్మనా?" ప్రశ్నించింది ఆమె.

"అవునండి! మూడునెలలక్రితం ఇక్కడికి విజయవాడనుండి వచ్చేసింది ఆమె"

"మీరెవరు?" అడిగిందామె.

"తెలిసినవాళ్ళంలెండి" చెప్పాడు హరిబాబు.

"ఆమె ఇప్పుడే ఓ రెండు మూడు నిముషాలక్రితం ఇక్కడినుండి శేషగిరి రావువాళ్ళింటికి బయలుదేరి వెళ్ళిందండి. వాళ్ళింట్లో ఈమె పనిమనిషిగా ఉంది లెండి. మీరు అర్జంటుగా ఆమెను కలుసుకోవాలా?"

అవునన్నట్టు తల ఆడించాడు హరిబాబు.

"ఒరేయ్ రమణా!"అంటూ ఎవరినో పిలిచిందామె.

ఆ పిలుపుతో ఓ పదేళ్ళ అబ్బాయి ఇంట్లోంచి బయటకి పరుగెత్తుకొచ్చి హరిబాబు' ప్రసాద్‌లను వింతగా చూశాడు.

"ఒరేయ్ రమణా! మీ హెడ్‌మాస్టర్ శేషగిరిరావులేడూ– వాళ్ళింటికి వీళ్ళిద్దరినీ తీసుకెళ్ళు. మీరు వీడితోపాటు వెళ్ళండి. అక్కడే ఆమెను కలుసుకోవచ్చు" అంది ఆమె.

కళ్ళతోటే ఆమెకు కృతజ్ఞతలు చెప్పాడు హరిబాబు.

అక్కడి నుండి శేషగిరిరావు వాళ్ళింటికి బయలుదేరారు.

ఆ పదేళ్ళ అబ్బాయి ముందు నడుస్తున్నాడు.

ఏదో మాట్లాడుకొంటూ హరిబాబు, ప్రసాద్ ఆ అబ్బాయినేఅనుసరిస్తున్నారు.

"అదిగోనండి లక్ష్మిదేవి" ఆఅబ్బాయి ఆగి అన్నాడు.

"ఏది.. ఎక్కడ?" ప్రశ్నించాడు హరిబాబు.

"అదిగో అక్కడ వెళుతోంది చూడండి" అంటూ ఆ అబ్బాయి అక్కడ కొద్ది దూరంలో వెళుతున్న ఓ స్త్రీని చూపించాడు.

అక్కడ ఆ రైల్వేగేటు మూసెయ్యబడి ఉంది.

వాహనాలు అటూ ఇటూ ఆగిపోయి ఉన్నాయి. ట్రైను వచ్చేసే టైమ్ అయిపోయినట్టుంది. అందుకే రోడ్‌ను క్రాస్ చెయ్యకుండా అక్కడే గేటుకు ఇవతలి వేపే నిలబడి ఉన్నారు.

హరిబాబు, ప్రసాద్ గబగబా నడుస్తున్నారు.

అక్కడ ఆమె గేటుదాటుకొని పట్టాలను దాటుతోంది.

ఎలక్ట్రిక్ ట్రైను వేగంగా దూసుకొస్తోంది.

జనం కేకలు వేస్తున్నారు.

హరిబాబు చూశాడు.

అతని గుండెలు దడదడ కొట్టుకొంటున్నాయి.

ఒక్క ఉదుటున గేటు దగ్గరికి పరుగు తీశాడు.

అక్కడ నిలబడిన మనుషులు గట్టిగా అరుస్తున్నారు రైలు వచ్చేస్తోందని. చేతితో




ఆమెకు చూపెడుతున్నారు.

ట్రైను మరింత దగ్గరకు వచ్చేసింది.

అక్కడ గోలగా ఉంది. అందరూ అరుస్తున్నారు. ఊపిరి బిగబట్టుకొని చూస్తున్నారు.

కానీ ఇవేమీ పట్టించుకోనట్టుగా లక్ష్మీదేవి ఇంకా పట్టాలను దాటుతూనే ఉంది.

"ఏమండీ" అంటూ గేటు దగ్గరకు పరుగెత్తుకొచ్చి బిగ్గరగా అరిచాడు హరిబాబు.

ట్రైను వచ్చేస్తోంది...వచ్చేసింది.

అంతే! భయంకరమైన చావుకేక...

రెండుగా దాటిపోయింది క్షణంలో.

గేటుకు అటూ ఇటూ నిలబడివున్న మనుషులు పరుగెత్తుకుంటూ వెళ్ళారు. హరిబాబు కూడా పరుగెత్తాడు.

అక్కడ ఆమె రక్తపు మడుగులో పడిఉంది. కడుపులోంచి పేగులు బయటికొచ్చి వేలాడుతున్నాయి. చితికిపోయిన మాంసపు ముద్దలా చాలా భీభత్సంగా పడి ఉంది ఆమె మృతదేహం. అక్కడ చేరిన మనుషులందరూ ఆ శవంపై జాలినీ, సానుభూతినీ కురిపిస్తున్నారు.

అడ్డంగా ఉన్న మనుషులను తప్పించుకుని దగ్గరికొచ్చి చూశాడు హరిబాబు. అంతే! ఆ రక్తపు మడుగులో భయంకరంగా పడిఉన్న ఆ శవాన్ని చూడలేక గట్టిగా కళ్ళు మూసుకున్నాడు. "ఈ గేటు ఈ ఊళ్ళోని మనుషులనందరిని చంపేసేటట్లుంది. మొన్న ఓ లెక్చరర్ని, మళ్ళీ ఇప్పుడోమనిషిని పొట్టన పెట్టుకొంది ఈ గేటు" అంటూ మాట్లాడుకోసాగారు అక్కడ చేరిన మనుషులు.

ఏమిటి దారుణం?

ఈ ప్రపంచం తనమీద పగపట్టినట్లుంది. అందుకే అడుగడుగునా తనను ఓడిస్తోంది. లక్ష్మీదేవిని కలుసుకొని ఆమెకు సహాయం చేయాలనే తన ఆఖరి ఆశ కూడా ధ్వంసమైపోయింది.

నేనున్నాను సుమా అంటూ కాలం మళ్ళీ వికటాట్టహాసం చేసింది. అడుగడుగునా కాలకన్య తనను వేటాడుతోంది.

తన జీవితం ఓడిపోయిన ఆశల కూడలి.

విషాద విచారాలకు నిలయం.

తనలాంటి శాపగ్రస్తుడు, దురదృష్టవంతుడు ఈ ప్రపంచం అంతా గాలించినా కన్పించరు.

తను ఇంకో అయిదు నిముషాలు ముందు లక్ష్మీదేవికోసం బయలుదేరి వచ్చి ఉంటే ఇప్పుడు ఈమె ఈ ప్రమాదానికి గురి అయి ఉండేది కాదు. కానీ తనకు ఆమెతో ఒక్క మాటైనా మాట్లాడే అవకాశం లేకపోయింది. బతుకంతా పరాజయాలే.

నీలిమ లాంటి వాళ్ళు తనను మోసగిస్తే లక్ష్మీదేవి లాంటివాళ్ళు మగాడిచేతిలో మోసపోయారు. నిజమేమరి ప్రసాద్ చెప్పినట్లు ఈ ప్రపంచంలో మోసగించే స్త్రీలూ, మోసగించబడే స్త్రీలూ ఉన్నారు.

జీవితం గాలిపటమైతే......

ఆశ 'దారం'లాంటిదని తను ఎక్కడో చదివాడు. కానీ తన ఆశలు మాత్రం గాలిపటాన్ని ప్రరున చించే ముళ్ళకంపలు లాంటివి.

"హరీ! ఇక వెళ్దాంరా" అంటూ ప్రసాద్ హరిబాబు భుజంపై చెయ్యి వేశాడు.

ఓ వేడి నిట్టూర్పును వదలి నడక సాగించాడు హరిబాబు.

★

# నిషా ఎక్కిన ఏనుగు

## చతుర

తప్ప తాగితే మనుషులకే ఒళ్లు తెలీదు. ఇక ఏనుగుల సంగతి చెప్పాలా! ఈ మధ్య ఓ పెద్ద ఏనుగు తన నివాసస్థల మైన తల్‌వాడి (తమిళనాడు)ని ఒదిలి కర్నాటక అడవుల్లోకి ప్రవేశించింది. అది అలా కర్నాటకలోని బెండహల్లి గ్రామం లోకి వచ్చింది. ఆ ఊళ్లోని కొందరు గ్రామస్తులు అప్పుడే కొన్ని డ్రమ్ముల నిండా తయారుచేసిన సారాయి నింపి భోజనాలకని వెళ్లారు.

ఆ సమయంలో అక్కడికి చేరిన ఏనుగు డ్రమ్ము నిండా వున్న సారాయిని




తనివితీరా తాగింది. తర్వాత సారామత్తు తీరికగా ఏనుగు తలకి ఎక్కింది. ఆ స్థితిలోనే ఏనుగు తిరిగి తమిళనాడులోని తల్‌వాడి అడవులకి తిరిగి వచ్చింది. దార్లో దానికి పెద్ద చెరకుతోట కన్పిస్తే తాగిన మైకంలో పక్వానికివచ్చిన చెరకు గడలను చూసి రెట్టించిన ఉత్సాహంతో పొలంలో పడి వీరవిహారంచేసి చెరకు గడలను వేళ్లతో సహా పీకి పక్కన పడేసింది. తమ పొలాలు చూసి గుండెలు బాదుకున్న ఆ గ్రామస్తులు పెద్ద డప్పులు మోగిస్తూ ఎలాగైతేనేం ఆ ఏనుగును తరిమేశారు.

అక్కడనుంచి ఏనుగు మల్లంగుల్లి అనే గ్రామంలో చొరబడింది. తెల్లవారు జామున ఒంటరిగా వెళుతున్న ఆ గ్రామస్తు డొకనిపై దాడిచేసి అతని వెన్నెముకను విరగ్గొట్టింది. ఆ తర్వాత ఓ మేకను తొండంతో చుట్టి గాల్లోకి విసిరేసింది. ఆ మేక కింద పడగానే మరణించింది. తన దారికడ్డం వచ్చిన అయిదు గుడిసెలనేగాక కంటికి కన్పించిన వాటినల్లా సర్వనాశనం చేసింది ఏనుగు. ఈ ఏనుగును బంధించ డానికి అటవీశాఖాధికారులు వలపన్ని




సిద్ధంగా వుంటే అది కాస్తా కర్నాటక-తమిళనాడు సరిహద్దుల్లో వున్న దట్టమైన అడవుల్లోకి వెళ్ళి మాయమయింది.

# రాత్రి పందెం



వస్తాదులకు సంబంధించి మనకు తెలిసినంతవరకూ కుస్తీ, వెయిట్ లిఫ్టింగ్, షాట్ పుట్ లాంటి పోటీలే ఎక్కువగా జరుగుతూ ఉంటాయి. కానీ ఒక వింత రకం పోటీ స్విట్జర్లాండ్‌లో జరుగుతూ ఉంటుంది. సుమారు నూటఎనభై మూడు పౌన్లుగల బండరాయిని రెండు చేతులా పైకెత్తి ఎవరు ఎక్కువ దూరం విసరగలిగితే వారు విజేతల కింద లెక్క. మరో విచిత్రం అన్ని పోటీలకూ ఒక కాలవ్యవధి అనేది ఉంటుంది. కాని దీనికలా కాదు. పదేళ్ళకో, పదిహేను సంవత్సరాలకో ఒకసారి జరుగుతూఉంటుంది. 1968లో జరిగిన తర్వాత మళ్ళీ జరిగినట్లుగా ఎవరికీ గుర్తులేదు. ఈ పోటీ ఈనాడు కనిపెట్టింది కాదనీ, నూటముప్పాతిక సంవత్సరాల కిందటే 1805 లోనే ప్రారంభమై క్రమంగా బహుళ జనాదరణ పొందుతోందని తెలిసింది. కాలవ్యవధి అంటూ లేకపోయినా ఈ పోటీకి సైతం ఒక ప్రత్యేక సీజననేది ఉంది. సెప్టెంబర్ నెలలో ఆదివారాలు ఉదయం ఎనిమిది గంటలకు మాత్రమే జరిగే ఈ పోటీలో ఉపయోగించే రాయి బరువు సుమారు నూటఎనభై మూడు పౌన్లు ఉంటుంది. అన్ని పోటీలకు మాదిరే దీనికీ కొన్ని రూల్సున్నాయి.

అందరికంటే ఎక్కువ దూరం ఆ రాయి విసిరిన వస్తాదుకు స్వర్ణపతకం ఇవ్వడంలో వింతలేదు. కానీ, ఆ తర్వాత ఏదో ఒకరోజు మధ్యాహ్నసమయంలో అతను కోరుకున్న 'అతివ'తో విందు భోజనం ఆరగించడానికి ఆరుబయట అందమైన ఏర్పాట్లు కూడా జరుగుతాయి. అయితే అతివలు ఎక్కడివారో కాకూడదు. పోటీ నిర్వాహకులే ఇందుకోసం ప్రత్యేకించి స్థానికంగా లభించే ఓ అర డజను మంది అందాల సుందరులను

ఎంపిక చేసి ఉంచుతారు. ఒక్కొసారి విజేత తన 'భాగస్వామి'ని 'జీవిత భాగస్వామిని'గా మార్చుకోవడం కూడా కద్దు.

ఇప్పటివరకు ఈ పోటీలో రికార్డు దూరం పదకొండు అడుగుల రెండు అంగుళాలు. ఇంతవరకు ఈ రికార్డునెవరూ బద్దలు చేయలేకపోయారు. ఈ పోటీ జరిగే మైదానం అన్స్వెనెన్ సిటీకి కేవలం 'రాయి విసిరే' దూరంలోనే ఉంది.

## గాలితో సోఫాలు

అందుగల డిందులేదను సందేహము వలదు అన్నట్లు గాలి చొరని ప్రదేశం అంటూ వుండదీ ప్రపంచంలో. ఇదివరకు రైలు ప్రయాణాలలో సౌలభ్యం కోసం గాలి దిళ్ళు చంకన పెట్టుకుపోయేవారు.



ఇప్పుడు గాలి దిళ్ళలోకే కాదు, సోఫా పరుపులు వగైరాల్లోకి కూడా ప్రవేశిస్తోంది. ఈమధ్య అమెరికాలోని ఫర్నిచర్ డీలర్స్ ఓ అడుగుముందుకేసి గాలి ఫర్నిచరును తయారుచేస్తున్నారు. అంటే ఇదివరకు దూదితో నింపే వాటినే ఇప్పుడు గాలితో నింపుతున్నారన్నమాట.

వీరు తయారుచేసే ఫర్నిచరులో సోఫాలు, సోఫా కమ్ బెడ్‌లు ప్రస్తుతం స్టేటస్ సింబల్స్‌గా మారాయి. వీటి ఉత్పత్తిదారులు వీటితోపాటు గాలికొట్టే పంపులనుకూడా సప్లైచేస్తారు. ఈ పంపులను చేత్తోనూ, కాళ్ళతోకూడా పని చేయించవచ్చు.

ఇవి ఆకర్షణీయమైన డిజైన్లలో, రంగుల్లో లభిస్తున్నాయి. మన ఇళ్ళలో గదుల రంగుకి అనుగుణమైన సోఫాలను ఎంపిక చేయవచ్చు. పైగా వీటిని ఎక్కడికైనా వెంట తీసుకెళ్ళవచ్చు కూడా. పిల్లలు వీటిమీద గెంతినా, పడినా దెబ్బలు తగిలే అవకాశం లేదు.

వీటన్నిటినీ మించి గృహాలంకరణలో ఈఫర్నిచరు కొత్త ఒరవడిని సృష్టిస్తాయి. ఈ సోఫాలు 16 డాలర్ల నుంచి ఒక డాలరువి కూడా లభిస్తున్నాయి. ఇంగ్లాండ్‌లోని సస్సెక్స్ అనే ప్లాస్టిక్ కంపెనీ వీటిని భారీఎత్తున ఉత్పత్తి చేస్తోంది. కంపెనీవారు వీటికి ఒక సంవత్సరం గ్యారంటీ ఇస్తున్నారు. ఇకనుంచి అన్నీ గాలి మయమే అవుతాయేమో !

# పురుషులకు మాత్రమే!

జపాన్‌లోని ఒక అత్యాధునిక సౌకర్యాలు గల హోటల్‌లో ఆరడుగులకు మించిన ఎత్తుగల ఆజానుబాహులకు ప్రవేశం 'అసాధ్యం'. క్యాప్సూల్ హోటల్ అని పిలువబడే ఈ హోటల్లో కేవలం మూడడుగుల ఎత్తు, రెండున్నర అడుగుల వెడల్పు, ఆరడుగుల పొడవు ఉండే




గదులను నిర్మించారు. లాడ్జింగ్ అవసరాలు, నిర్మాణ ఖర్చులు పెరిగిపోవడం, స్థలాలు పరిమితంగా ఉండడంతో ఒక ప్రముఖ జపనీస్ ఇంజనీర్ అత్యంత నైపుణ్యం ప్రదర్శించి ఈ రకం హోటల్ నిర్మింప జేశాడు. ఒసాకాలోని ఈ హోటల్‌లో మొత్తం నాలుగువందల పదకొండు గదులు అనబడే 'గూళ్లు' ఉన్నాయి. రెండేళ్ళ కిందట ప్రారంభమైన ఈ హోటల్‌లో టి., వి. రెస్టారెంట్ లాంటి సౌకర్యాలుండడమేగాక 'గదు'లన్నీ ఎయిర్ కండిషన్డ్ చేయబడడం ఓ విశేషం.

రాత్రివేళ బండితప్పిన ప్రయాణికులు చవగ్గా విశ్రాంతి తీసుకుని తెల్లవారగానే వెళ్లిపోవడానికి మాత్రమే పనికి వచ్చే ఈ హోటల్ గదుల్లో స్త్రీలకు ప్రవేశం ఉండదు. ఈ గదుల ఆకార విశేషాలు ఎలా ఉన్నప్పటికీ లోపల మంచంపై కూర్చుని రేడియో పెట్టుకోవచ్చు. చదువుకోవచ్చుకూడా. గదుల్లో చేరేముందు అతిథేయులు తమ విలువయిన సామగ్రిని, బట్టలను రిసెప్షన్ కౌంటర్‌లో దాచుకుని పాకుతూపోయి పడకలు చేరాలి. ఈ గదులన్నీ ఎయిర్ కండిషన్డ్. "రెండేళ్లనాడు తెరిచాము దీన్ని. అప్పట్నించీ ఏరోజూ ఒక్క గదికూడా ఖాళీగా ఉండటంలేదు" అంటున్నారు ఈ హోటల్ మేనేజర్. టోక్యోలాంటి మరికొన్ని నగరాల్లోకూడా ఇలాంటివి వెలిసి మెడికల్ రిప్రజంటేటివ్‌లను, వ్యాపారస్తులను చక్కగా ఆదుకుంటున్నాయట.

# 'టి' షర్టుభాష

ఫ్యాషన్లు ఎన్ని మారుతున్నా టిషర్టుల ఫ్యాషన్ మాత్రం చెక్కుచెదరకుండా

అలాగే వుంది. టీ షర్టుల అర్థాలు వేరుగా వుంటాయంటే మీరు మరీ అలా ఆశ్చర్య పోకండి. శరీరాన్ని కప్పివుంచే రక్షణ కవచంగానేగాక ప్రచారసాధనంగా కూడా టీ షర్టుకి మంచిగుర్తింపువుంది విదేశాల్లో. ఎడ్వర్టయిజ్ మెంట్ రంగంలో ప్రముఖ పాత్ర వహిస్తున్న ఈ టీ షర్టులు డబ్బును కూడా అంతలావూ సంపాదించి పెడుతున్నాయి.

'ఐ లవ్యు', 'కిస్మి', 'పన్చ్మి హియర్', 'హే లుక్ హియర్' అని సిల్లీగా ఆడపిల్లల టీ షర్టులమీద చదివి కాలరెగ రేస్తుంటారు అబ్బాయిలు. అలాంటివిగాక ప్రజోపకరమైన నినాదాలను తొందరగా ప్రజల్లో ప్రచారంచేయడానికి టీ షర్టులంత శక్తివంతమైన సాధనం మరోటిలేదు.

మీ ఓటు నాకే, ఫలానా సుబ్బాయ్కే మన ఓటు లాంటి నినాదం కావాలంటే నిమిషాల్లో ప్రింట్ చేసిచ్చే సంస్థలు విదేశాల్లో చాలావున్నాయి.

అబ్బాయిలకంటే అమ్మాయిలు ధరించే టీషర్టుల ద్వారానే త్వరిత ప్రచారం జరుగుతుందనడానికి నిదర్శనాలు కోకొల్లలు.

ఇంగ్లండులోని హెర్ఫీల్డ్ ఆస్పత్రి వాళ్ళు గుండె మార్పిడి చికిత్స కోసం ఆధునికమైన పద్ధతిలో ఓ విభాగాన్ని తెరవడానికి ద్రవ్యసహాయం చేయమని ప్రభుత్వాన్ని అడిగారు. కానీ ప్రభుత్వం ఎటువంటి గ్రాంటు ఇవ్వడానికీ ముందుకు రాలేదు. అంతమాత్రంతో ఆస్పత్రి అధికారులు నిరాశపడక క్షణాల మీద ఓ ఆలోచన వచ్చి దాన్ని అమలు పరిచారు.

చిన్నపిల్లల దగ్గర్నుంచి ముసలివాడి దాకా అన్ని వయసులవారూ ధరించేందుకు వీలుగా వివిధ సైజుల్లోటీషర్టులను తయారు చేయించి వాటిమీద 'హేవ్ ఎ హార్ట్' అనే నినాదాన్ని ముద్రించి మార్కెట్లోవిడుదల చేశారు. మొదటి రోజునే పన్నెండువేల షర్టులు అమ్ముడుపోయాయి. వాటిల్లో ఆడపిల్లల టీ షర్టులకే గిరాకీ ఎక్కువగా వుందట. ఎందుకంటే అమ్మాయిల టీ షర్టులమీద కెంపురంగులో గుండె బొమ్మ చిత్రించారు.

దాంతో స్వామి కార్యమూ స్వకార్యమూ నెరవేరినట్లు 'హేవ్ ఎ హార్ట్' ప్రేమికులకు రొమాంటిగ్గానూ, సెంటిమెంటల్గానూ చెప్పలేని అనుభూతిని కలిగించి గిలిగింతలు పెట్టిందిట.

## విడ్డూరం

ఎడోల్ఫ్ ఫ్రికర్ అమెరికాలోని ధనవంతుల్లో ఒకడు. మంచి వ్యాపారవేత్త. 1921లో అనుకోకుండా వ్యాపారంలో పెద్ద ఎత్తున నష్టం రావడంతో ఎడోల్ఫ్ బాగా షాక్ తిన్నాడు. ఆ షాక్ తీవ్రత వల్ల అతని శరీరంలోని స్వేదగ్రంధులు పూర్తిగా పనిచేయడం మానేశాయి. ఆనాటి నుండి చమట పట్టేదికాదు.

శరీర ఉష్ణోగ్రతను క్రమబద్ధంచేసే స్వేదప్రక్రియ లేకపోయేసరికి శరీరం వేడెక్కి ఒంట్లోంచి ఆవిర్లు వస్తున్నట్లు ఫీలయ్యేవాడు ఎడోల్ఫ్. ఆ బాధ భరించలేక ప్రత్యేకంగా ఓ ఐస్తొట్టెను తయారు చేయించుకుని, శరీర ఉష్ణోగ్రత పెరిగి బాగా వేడెక్కే సూచనలు కనబడగానే ఐస్ తొట్టెలో శమనపొందేవాడు.

అలాగే బాట్ హెన్రీ అనే ఆయన లండన్లోని ఓ చర్చిలో మతబోధకుడు. ప్రార్థనా కార్యక్రమం ముగించుకుని దీపాలార్పి పడుకుందామంటే ఎంత ఊదినా కొవ్వొత్తులు ఆరేవిగావు సరికదా




మరింత దేదీప్యమానంగా వెలుగుతుం దేవి. ఇది నిజంగా అపూర్వమైన సంఘటనే. మంటను అధికం చేసే గుణంగల హైడ్రోజన్ వాయువు అతని నోటినుండి వెలువడ్డమే అందుకు కారణం.

విచిత్రంగా వున్న ఈ కేసును పరిశోధించేందుకు ప్రత్యేకించి ఓ డాక్టర్ల బృందం ముందుకు వచ్చింది. ప్రత్యేక పరీక్షలు జరిపి ఎడోల్ఫ్ పొట్టలో అల్సర్ పుండు వున్నట్లు తెల్సుకున్నారు. ఆ





పుండునుండి ఓ విచిత్రమైన వాయువు వెలువడి అది హైడ్రోజన్‌గా మారుతోందని గ్రహించి వెంటనే శస్త్రచికిత్సద్వారా ఆ పుండును తొలగించారు. తదాదిగా ఎడోల్ఫ్ ఎంత మెల్లిగా వూదినా చర్చిలోని కొవ్వొత్తులు ఇట్టే ఆరిపోతున్నాయి.

ఇలాగే దాదాపు నలభై యేళ్ళకిందట జపాన్లో కాసో ఒషికి అనే వ్యక్తి ఓ రోడ్డు ప్రమాదానికి గురయ్యాడు. కాసో పొట్ట పగిలి పేగులు బైటికి వచ్చాయి. డాక్టర్లు, సర్జన్లు తంటాలుపడి బైటపడ్డ పేగుల్ని లోపలికి తోసి కాసోకి ప్రాణం పోసి ఇంటికి పంపారు. ఇంటికైతే వచ్చాడు గాని అప్పట్నించీ అతనికో వింత వ్యాధి బయల్దేరింది.

మామూలుగా భోంచేసి కూర్చున్న గంటా రెండుగంటలకి ఓ నాలుగయిదు సీసాల 'రమ్' తాగినంత నిషా వచ్చేది. బ్రెడ్డు, బంగాళాదుంపలు తిన్నప్పుడయితే ఆ నిషా ఇబ్బడిముబ్బడి అయ్యేది. జీవితంలో రమ్ వాసన ఎలా వుంటుందో కూడా తెలీని కాసో ఈ బాధ భరించలేక వెళ్ళి డాక్టర్ల కాళ్ళమీద పడ్డాడు.

కాసో ప్రేవుల్లో 'ఫంగస్' వుందనీ, యాక్సిడెంట్ అయ్యాక దాని పరిమాణం రాను రాను పెరుగుతుందనీ నిర్ధారించేరు డాక్టర్లు. ఈ ఫంగస్‌కి బ్రెడ్, బంగాళాదుంపల్ని రమ్ వంటి మత్తు పానీయంగా మార్చే స్వభావంవుంది. అందువల్ల అతను బ్రెడ్డు, బంగాళాదుంపలు తిన్నప్పుడల్లా ఫంగస్‌తో కల్సి రియాక్ట్ అయిరమ్‌గా మారి, దాని ప్రభావం మెల్లిగా శరీరానికంతా పాకి నిషానిచ్చేది. శస్త్రచికిత్సతో ఆ ఫంగస్‌ను తీసేసిన తర్వాత హమ్మయ్యా అని వూపిరి పీల్చుకుని కడుపునిండా భోంచేశాడు కాసో.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/HD/402